# నెస్టమ్ శిశువు జీర్ణానికి మంచిది

మీ పసిపాపకోసం
11 విటమిన్‌లు
ఇనుముగల
బియ్యంతో
తయారయిన
ఒకే ఒక పదార్థం.



ప్రకృతి సిద్ధమైన పద్ధతులలో మీ పాపని పెంచండి. ఇవ్వగలిగినంత కాలం పాపకి చనుపాలు యివ్వండి—మీరు ఇవ్వగలిగిన పుష్టికరమూ, సున్నితమూ అయిన ఆహారం అదే.

పాపకి 4 నెలలు వచ్చేసరికి ఎక్కువ పోషక పదార్థాలు కావాలి. ఘన పదార్థాలు తీసుకోడానికి పాప సిద్ధంగా వుంటుంది. నెస్టమ్ గురించి, పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి. నెస్టమ్ బియ్యంతో తయారు చేయబడింది—ఎంతో సులభంగా జీర్ణమయ్యే సీరియల్.

నెస్టమ్ బేబీ సీరియల్ రైస్—పాల నుంచి ఘన పదార్థాలకి సున్నితమైన మార్పు.




## నెస్టమ్®
## బేబీ సీరియల్
## రైస్

పాల నుంచి ఘన పదార్థాలకి
సున్నితమైన మార్పు

తయారు చేసే పద్ధతి :



ముందుగా మరిగిన వెచ్చని పాలు



పోయండి. నెస్టమ్ చేర్చండి.



కలపండి. తినిపించుటకు తయారు.

NESTLÉ

SAA FSL/N/2257 TEL



# హై పవర్ సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకుతుంది...

అమిత తెల్లగా కనువిందుగా.

మీ అమ్మాయి బట్టలు మురికి చేసుకోవడంలో ఘటికురాలా? ఆ మురికి వదలగొట్టడానికి మీకూ ఘనమైనదే కావాలి మరి. అదే హై పవర్ సర్ఫ్. హై పవర్ సర్ఫ్‌లో వుంది అతి శక్తివంతమైన ఫార్ములా. దానిలోని హెచ్చు డిటర్జంట్ శక్తి మురికినీ, జిడ్డు మరకల్నీ మటుమాయం చేస్తుంది. బాగా మాసిపోయిన దుస్తుల్ని కూడా తెల్లగా మిలమిల మెరిసేలా చేస్తుంది సర్ఫ్. సర్ఫ్, రంగు బట్టలకు కూడా మంచిది. వాటిని పరిశుభ్రంగా, కాంతివంతంగా ఉంచుతుంది. ఇంటిల్లిపాది బట్టలకూ ఉతుకులో అదనపు తెల్లదనం, కాంతీ ఇస్తుంది హై పవర్ సర్ఫ్. ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడటంలో మరి ఆశ్చర్యం ఏముంది గనక?






**ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడతారు.**

హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన — లింటాస్.SU.224.203 TL

## ముఖచిత్రం

'శంకరాభరణం రాజ్యలక్ష్మి' ముఖ చిత్రంతో వెలువడిన 12.3.82 నాటి ఆంధ్ర పత్రిక వారపత్రిక ఆ సంవత్సరము వేసిన ముఖ చిత్రాలలోకి అత్యద్భుతం.

పెద్దిరెడ్డి శిరీష, శారద (మచిలీపట్నం)

* * *

12.3.82 తో తయారైన ఆంధ్రపత్రికలో 'రాజ్యలక్ష్మి' ముఖచిత్రం చాల హుందాగా, మరియు పంచరంగులలో ఎంతో ఆకర్షణీయంగా ఉన్నది.

పి. ఎస్. మురళీకృష్ణ (నాయుడుపేట)

* * *

'రాజ్యలక్ష్మి' ముఖచిత్రంతో వెలువడిన 12.3.82 ఆంధ్రసచిత్ర వార పత్రిక ఎంతో అందంగా, ఆకర్షణీయంగా ఉన్నది.

అలీఖాన్, ఫర్హాద్, ఫరాసత్ (సికింద్రాబాద్)

### కథలు

5—3—82 కృష్ణ, జయప్రద ముఖ చిత్రంతో వెలువడిన పత్రికలో ఆడది కథ నిత్యజీవితంలో జరిగేదిగాను, వాస్తవానికి దగ్గరగానూ ఉన్నది పి. బి. గీత (జంబూపట్నం)

* * *

5—3—82 తేదీన కృష్ణ, జయప్రద ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. ఆడది, పాలవెల్లి కథలు చాలా బాగున్నాయి.

గరిమెళ్ల సాయిప్రసాద్ (వెదురుపాక)

* * *

5—3—82 సంచికపై నటశేఖర కృష్ణ, జయప్రద ముఖచిత్రం, ఆంధ్ర సచిత్ర వార పత్రికకే హైలైట్. విన్నకోట సుశీలాదేవి రచించిన మనస్తత్వాలు కథ నేటి వృద్ధులలో మార్పు తెప్పిస్తుంది.

కన్నేపల్లి గోపాలకృష్ణగారు రచించిన ఆడది కథ నాకు చాలానచ్చింది. నేటి స్త్రీ సమాజంపై ఈ కథ కొంతైనా ప్రభావాన్ని చూపించగలదని నమ్ముచున్నాను.

దువ్వాడ దేవదాసు (కువైట్)

* * *

కృష్ణ, జయప్రద ముఖ చిత్రంతో వెలువడిన మీ (మా) పత్రికలో మనస్తత్వాలు కథ—మమతానురాగాలకంటే డబ్బే ప్రధానమని ఆ కుటుంబములోని వారి మనస్తత్వాలను చక్కగా తెలియజేశారు.

కడియాల సురేష్‌బాబు (మంగళగిరి)

* * *

5 3—82 పత్రిక ముఖ చిత్రం బాగుంది. విన్నకోట సుశీలాదేవిగారి మనస్తత్వాలు, కథనం పాతదే అయినా రచయిత్రి కథను నడిపించిన తీరు ప్రశంసనీయం.

కడియాల చంద్రుడు (మహబూబ్‌నగర్)



మహానత్వం పేరుతో మగవారితో వంటవార్పు చేయించాలనే ఈ నవయువతులందరూ చదివి కనువిప్పు పొందాల్సిన అపూర్వ కథ ''ఒకరికోసం ఒకరు''

కట్నాల విషయంలో అభ్యుదయ భావాలుగల యువకులు ముందుకు వస్తే ఆశలు, కోరికలు తీరవని, వెనుకంజ వేసి, నిందించే వారిని గూర్చి కూడా బాగా విశదీకరించియుండ వలసింది.

బి. సుబ్బారాం (కాకినాడ)

* * *

''రాజ్యలక్ష్మి'' ముఖచిత్రం చాలా బావుంది. ముఖ్యంగా ఎమ్మెస్ లీల గారి ''విజాయితీ'' (చిన్న రచన) చదివి కడుపుబ్బ నవ్వుకొన్నాము. నల్లూరి గారి ''ఆగుదాం— ఆలోచించ కొందాం'' కథ మమ్మల్ని అమితంగా ఆకట్టుకొంది.

విజేంద్రనాథ్‌ప్రసాద్, జె. శ్రీనివాసులు (ఆదోని)



ప్రముఖ రాజనీతిజ్ఞుడు, జాతీయనాయకుడు, గాంధేయవాది ఆచార్య జె బి కృపలానీ అహమ్మదాబాదులోని సివిల్ ఆస్పత్రిలో మార్చి 19న అస్తమించారు. ఆయన వయసు 94 సంవత్సరాలు

## సీరియల్స్

వాసిరెడ్డి సీతాదేవిగారి మనసు కథ సీరియల్ ఆంధ్ర పత్రిక వార పత్రిక సాహితీ నందన వనంలో వికసిత నవ కుసుమంలా విరివిపోగలదు.

పి. పాండురంగారెడ్డి (చిత్తూరు)

* * *

కుమారి వాసిరెడ్డి సీతాదేవి మనసు కథ సీరియల్ మా ఇంట్లో వారందరిని చాలా ఆనందపరచినది. సీరియల్ మాత్రము చాలా ఇంటరెస్ట్‌గా ఉన్నది.

ఎ. సుజాత (పెదపూడి)

* * *

5—3—82 నాటి సంచికపై వెలువడిన నటి జయప్రద, కృష్ణల ముఖచిత్రం చాల బాగున్నది. తార సీరియల్ మనసు కథ సీరియల్ చాల బాగున్నాయి.

ఎ. జానకీదేవి (పోతురెడ్డిపల్లి)

* * *

మనసుకథ సీరియల్ నన్ను బాగాఆకర్షించింది ఈ సీరియల్ చదువుతుంటె నాకు టైము తెలియడంలేదు.

పిట్టల లక్ష్మయ్య (వంగపల్లి)

* * *

5—3—82 ఆంధ్ర సచిత్రవార పత్రిక ముఖ చిత్రం చూడ ముచ్చటగా ఉంది. మనసు కథ ప్రారంభంలోనే చదువరుల మనస్సును ఆకట్టుకొంది. రచయిత్రికి నా ధన్యవాదాలు.

శ్రీమతి సరోజానంద్ (లక్నో)

* * *

12.3.82 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక నటి 'రాజ్యలక్ష్మి' ముఖచిత్రం ఎంతో హుందాగా నిండు ముత్తయిదువు తెలుగింటి సంప్రదాయపు స్త్రీలా పట్టు చీరతో ముగ్ధ స్నిగ్ధ శృంగార భరితంగా వుంది. సీరియల్స్ ''మనసు కథ, తార'' రెండూ పోటీ పడ్తున్నట్లుగా వున్నాయి. మనసు కథ సీరియల్ మనుషులలో అంతర్లీనంగా దాగిన మనస్తత్వాలని ప్రతిబింబింప చేస్తుంది. ''సుజాత'' పాత్ర ఎక్సెలెంట్, ఈ వారం అనుకోని మలుపులు తిరిగింది.

వై. హేమసుందర్‌రావు, హేమబిందు, ప్రియ (డోర్నకల్)

## ధర్మపథం

5—3—82 సంచికలో ధర్మపథం శీర్షికలో ఉత్తమ భూషణం ఏది ? విషయము గూర్చి వ్రాసిన బులుసు వేంకట రమణయ్యగార్కి అనేక ధన్యవాదములు.

పమ్మిన క్రిష్ణారావు (పొందూరు)

* * *

5—3—82 సంచికలో ధర్మపథం శీర్షికలో ఉత్తమ భూషణం ఏది ? అనే విషయం గూర్చి ఎంతో గొప్పగా విన్నవించారు రచయిత.

మంగళగిరి పిచ్చియాచార్యులు (స్వర్ణ) ●

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]
శుక్రవారం : 9-4-'82
దుందుభినామ సం. చైత్ర బ. పాడ్యమి
**సంపుటము 75 : సంచిక 31**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60
ఆరు మాసాల చందా రు. 33-80
విడిప్రతి వెల రు. 1-25 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
వటపూర్ణిమ
(ఫొటో : ఎస్. ఆర్. డి. మూర్తి)

కథలు :


మిటపల్లాలు ... 8
ఒకేజాతిపక్షులు ... 14
స్వర్గమాకళ్ళు తెరచిమాడు... 34
చీకటిలో చిరుదీపం ... 52
సహపంక్తి 61


సీరియల్ నవలలు :


మనము కథ ... 28
తార ... 42


వ్యాసాలు, శీర్షికలు :


ఉత్తరాలు—4, లోకంపోకడ — 5, దుందుభిలో వివాహయోగం — భాగ్యం (రాశిఫలం)-6, చిట్కాలు-10, ప్రశ్నావళి-12, వారఫలం-18, డి. హెచ్. ఉయ్యాల రంగుల బొమ్మలకథ—19, సినిమా-20 స్త్రీల సమస్యలా? అంటే ఏవిటి?—33, డాక్టర్ సలహాలు— 40, బొమ్మల మహాభారతం—48, హైదరాబాద్ నోట్ బుక్—59, ధర్మపథం — 64, వంటలు — 65, అవీ-ఇవీ-అన్నీ-66.




లోకం పోకడ















## రాశిఫలం

విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి

# దుందుభిలో మీ యోగం-భాగ్యం

### మేషం :

ఈ రాశికి సంవత్సరమంతా అందంగా ఆనందంగా జరిగిపోతుంది. 'దుందుభి' నామ సంవత్సరం అన్ని విధాలా, అన్ని రంగాలలో యోగాభివృద్ధికి తోడ్పడుట నిశ్చయం. కళాసాహిత్యరంగాభివృద్ధికి,వ్యాపార లాభానికి, రావలసిన ధనం చేతికందుటకు, జరుగదగిన వ్యవహారాలు సుకరంగా పరిష్కరింపబడుటకు అవకాశం గల వత్సరం. అక్టోబరు 5 తా. వరకు షష్ఠమమందు సువర్ణమూర్తి తదుపరి వత్సరాంతం వరకు తామ్రమూర్తి. 'గురుగ్రహం'కూడా చాల అనుకూల ఫలాలు అందించగలడు. రాజకీయవాదులకు, సంఘ సేవకులకు, సాహితీపరులకు పర్యానుకూలమైన సంవత్సరం. తృతీయ 'రాహు' గ్రహం కూడా అనుకూలుడే. స్త్రీలకు: సుఖ, భోగ, భాగ్య, వస్తుసేకరణ,ఆదాయాభివృద్ధికి నిలయం'దుందుభి'

### వృషభం :

మీరాశికి నాల్గు విధాలా మేలు జరిగే సంవత్సరం. 'వత్సరమంతాబాగుంటుంది' అనడానికి వీలులేదు గాని గురుగ్రహం చాల విధాల అనుకూల ఫలితాలు ఇవ్వగలుగుట,ఇంట ఒకటి రెండు శుభకార్యాలు జరుగుట, కోర్టు వ్యవహారాలుంటే లాభ దాయకంగా నెరవేరుట, దావా తగాదాలు సుకరంగా, అనుకూల దాయకంగా నెరవేరగలవు. 'శనిగ్రహం' అక్టోబరు తరువాత నాల్గు విధాలా, నాల్గు రంగాలలో ఆదాయాభివృద్ధికి తోడ్పడగలడు. సాహితీ రంగంలో, సాంఘికరంగంలో, నాటకరంగంలో, చలన చిత్ర రంగంలో అనుభవంగలవారికి, సదవకాశాలు లభించనున్నాయని గ్రహించి, శ్రమించాలి. విద్యార్జనకు కొందరకు, విదేశ యానానికి కొందరకు చెప్పదగిన అవకాశాలున్నాయి. మరీ నవంబరు,డిసెంబరునెలలు సర్వవిధాలా యోగప్రదాలు, ఆరోగ్య భంగంలేని వత్సరం. స్త్రీలకు: యోగాభివృద్ధి, శుభ కార్యానుకూలత, ఆదాయం చేకూర్చే వత్సరం.

### మిథునం :

'సర్వ కార్యములూ నిర్విఘ్నంగా నెరవేరుతాయి' అని చెప్ప వీలులేదు గాని, కొంతలో కొంత మేలుగా కార్యానుకూలత చేకూరగల సంవత్సరం. ఒకానొక వ్యవహారమందు, అక్టోబరు నవంబరు మాసాలలో మీకు అనుకూలమైన తీర్పు రాగలదు. ఇంట శుభ కార్యం జరిగేఅవకాశమున్నది.స్త్రీలకు:నగలు,వస్త్రములు, విలువగల వస్తువులు సేకరించుకొనుట, ఉద్యోగంలో అభివృద్ధి సాధించుకొనుటకు, బంధు సమాగమానికి, అందంగా కాలం వ్యయించుటకు అనుకూలం ఈ 'దుందుభి'.

### కర్కాటకం :

మీ రాశికి 'అక్టోబరు 5తా' వరకు, తృతీయ శని తామ్రమూర్తి.బృహస్పతి నవంబరు 27వరకు చతుర్థమందు తామ్రమూర్తి. అందు మూలాన ఎక్కువ మేలు జరుగకపోయిన, అనర్థములకు దారితీసేవత్సరంగాదు. 'శని'వలన మధ్యమ ఫలములే సంప్రాప్తింప గలవని చెప్పవీలున్నది. విద్యార్జనాపరులకు మంచి ఫలితాలుంటాయి.ఉద్యోగ ప్రయత్నాలందుచాలమందికి అనుకూలవత్సరం చాలమంది వయసు మీరినవారు, దీర్ఘ వ్యాధులవారు ఆరోగ్య విషయంగా జాగ్రత్తపడాలి. ఔషధసేవ కూడా అత్యావశ్యకమనిపించుతుంది. ఏమైనా ఒక నెల బాగుంటే మరోనెల ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా, రచనా విధానంగా అంత ప్రోత్సాహకరంగాదు—గ్రహించాలి. స్త్రీలకు:రాబడికి, ఉద్యోగమందు ఉన్నతపదవి ఆశించుటకు,అధిక విద్యాప్రయత్నాలకు పూర్వార్థంకంటే ఉత్తరార్థం మేలు.

### సింహం :

చాల కాలం, రాశికి తృతీయమందు 'శని' గ్రహసంచారం,మూంట, ఆరింట పదునొకండవ యింటి రాశినుండి 'శని' యోగదాయకం కాగలడు. ఒకవేళ కొందర యింట శుభకార్యానుకూలత గలదనుటలో కూడా ఆశ్చర్యంలేదు. కొందరకు ఉద్యోగ ప్రయత్నాలు ఫలించి, మంచి ఉద్యోగాలందు కుదురుకొననున్నారు. కొందరకు ఈ వత్సరం నటనా చాకచక్యం ఫలింపనున్నది. 'సినీరంగా'వకాశాలు ఫలవంతం కాగలవు.ఉద్యోగాభివృద్ధి, బదిలీలు, 'ప్రమోషన్ను' కొందరపట్ల అందిపుచ్చుకొన్నట్టు లభిస్తాయి. చాలకాలంగా రాక నిలచిన ధనం సమయానికి చేతికందే అవకాశంగలదు.

స్త్రీలకు : అప్రయత్నంగా ధనలబ్ధి, అపూర్వానందం, బంధుప్రీతి, సులభంగా విద్యాప్రయత్నాలు ఫలవంతం కావటం చెప్పదగిన అంశాలు. విజయప్రద వత్సరమే.

### కన్య :

పోయిన వత్సరంలో, అంతకు ముందు పడిన శ్రమ,కష్టం,నష్టం క్రమంగా ఈ'దుందుభి'లో ఉత్తరార్థంలో, మీకు తొలగి పోనున్నది. ఆనందంగా, అందంగా అక్టోబరు నుండి వత్సరాంతం వరకు జరిగిపోతుంది. ఆరోగ్యలోపం కూడా అంతగా కనిపించదు, బాధించదు,వేధించదు. ప్రతిభ రాణించి నాల్గు రూకలు చిక్కి, నాల్గు విధాల అవకాశాలు ఏర్పడి ముఖ్యంగా కొందరకు కళాసాహితీపరంగా అవకాశాలు ఏర్పడి ఆనంద దాయకంగా ఉంటుంది 'దుందుభి'. స్త్రీలకు: ఆరోగ్యం, ఉద్యోగాభివృద్ధి నూతన విషయాలు తెలిసికొనట, వస్త్ర వస్తు నగలు సేకరించుకొనుటకు అవకాశం గల సంవత్సరమే!



## రాసే మర మనుషులు !

జపానులో వ్రాయడం నేర్చిన మరమనుషులను, కేకులను తయారుచేసే సంస్థలలో వుపయోగిస్తున్నారు. ఈ మరమనుషులు కేకులపై శలవు దిన శుభాకాంక్షలనో లేక జన్మదిన శుభాకాంక్షలనో వ్రాయగలరు. జపానులోని సన్ బిరన్ కంపెనీవారు 20 మంది మరమనుషులను తయారు చేసినట్లు ప్రకటించారు. ఇవి 20 సెకన్లలో కేకులపై "మెర్రీ క్రిస్మస్" అని 'హేపీ బర్త్‌డే" అని వ్రాయగలవు. ఒసాకా కంపెనీవారు మరమనుషులను డిజైన్లు చెక్కడానికి వుపయోగించవచ్చునని, అటువంటి మరమనుషులు ఒక్కొక్కటీ 54 వేల డాలర్లు కాగలదని తెలియజేశారు.

### తుల :

ఈ రాశి వారికి గోచార ప్రకారం వ్యయ శని. అక్టోబరు ప్రాంతాన్నుండి లగ్నశని, తామ్రమూర్తి. తదుపరి ద్వితీయ మండలి స్థితి కూడా మంచిది గాదు. బృహస్పతి పాత్రం రజితమూర్తి. శని గ్రహం మూలాన వ్యాపారంలో పెద్దగా లాభించక పోవటం, అన్ని వ్యవహారాలలో అనానుకూలత కనిపించటం, విద్యయందు ప్రగతి కనిపించక పోవటం, ఉద్యోగమందు పెద్దగా మేలు జరుగక పోవటం, నూతన వ్యవహారాలు ఫలించకపోవటం, చిత్రనిర్మాణ కార్యక్రమంలో విలంబనజరగటం— ఇత్యాది అనానుకూలమ్ములున్నను, సంవత్సరం కడపటి మాసాలు నాల్గు విధాలా మేలు చేకూర్చ గలవు. స్త్రీలకు: స్థిరాస్తి వ్యవహారాలలో, ఉద్యోగ విషయంలో, ఆరోగ్యంలో పెద్దగా మేలు జరిగేమార్గం లేదు. జపాదులు అవసరం.

### వృశ్చికం :

ఈ రాశికి, ఈ వత్సరం, అక్టోబరు 5 తా. నుండి ఏలినాటి శని ప్రారంభం. బృహస్పతి పాత్రము మేలు చేయుగలడు, ఉద్యోగవృత్తులు ప్రకాశింపగలవు. కొందరు గృహ నిర్మాణమందు, సఫలీకృతులు కాగలరు. కొందరు ఉద్యోగాలకై ప్రాకులాడే వారికి యోగదాయకం. ఆటపాటల్లో ప్రవేశం గల వారికి అనుకూలం. దూర ప్రాంతాలకు కొందరు పయనం చేయనున్నారు. స్త్రీలకు: అవివాహితలకు వివాహయోగంసిద్ధించ గలదు. చాలమందికి కళాసాహిత్యరంగాన ప్రగతి కనిపిస్తుంది. కొందరకు, ఈ రాశి జాతకులకు ఉద్యోగమందు 'ట్రాన్స్ఫరు' చెప్పదగిన విషయం. ఉన్నత స్థితితో 'ప్రమోషన్' లభిస్తుంది.

### ధనస్సు :

ఈ రాశికి, శనిగ్రహం అపకారిగా వత్సరమంతయు కనిపిస్తాడు. గురు గ్రహం వలన వ్యాపారములో అనుకూలత సంభవం. కొందరు నూతన వ్యాపారాలు ప్రారంభిస్తారు. కొందరు కళాకారులైనచో ప్రకాశమునకు కాలం. కొందరకు క్రీడా వనిలో విశేషంగా ఆదరం లభించే అవకాశంగలదు. చాలమందికి విశేషంగా పాడిపంటల వలన అనుకూలత చెప్పదగి యున్నది. క్రొత్తగా ఇంట శుభకార్యం జరిగేటందులకు అవకాశం గల సంవత్సరం. నూతన మిత్రులు చేరుతారు. బంధు వర్గంలో పేరు ప్రతిష్టలు, సభాగౌరవం, పత్రికా గౌరవం కొందరకు లభ్యం కాగలదు. స్త్రీలకు కళారంగంలో ప్రగతి, సాహితి పరులుగా కొందరు చలామణి కావటం, కొందరకు ఆటల్లో సంగీతపరంగా మంచి అవకాశాలు లభించి, తద్వారా ధనలబ్ధికి అవకాశం గల సంవత్సరం ఈ దుందుభి.

### మకరం :

శనిగ్రహం ఈ రాశికి, ఈ వత్సరం యోగదాయకం. అక్టోబరు 5 వరకూ భాగ్యమందు రజితమూర్తి. బృహస్పతి నవంబరు 27 వరకు రాజ్యమందు తామ్రమూర్తి. అందు చేత సంవత్సరంలో చాల భాగం శని. గురువుల వలన ఉద్యోగమందు ఆదరణ, వృత్తియందు అభివృద్ధి, శుభకార్యానుకూలత, చాలమందికి గృహ కార్యక్రమమందు నిమగ్నత సంభవం. వూహించని అనానుకూల సంఘటనలు జరుగనున్నాయి. రాజకీయముగా చాల మందికి అధికంగా లాభప్రదాయక సంవత్సరం. స్త్రీలకు అనుకూలమైన కొన్ని వ్యవహారాలు—జరిగేవి కొన్ని వ్యవహారాలు. ఆదాయం, అభిమానం, ఆదరణకు సర్వానుకూల వత్సరం.

### కుంభం :

ఒకటి రెండు సంవత్సరాలుగా పడిన శ్రమ కష్టం, నష్టం, ఈసంవత్సరాంతానికిసమసిపోతాయి. చాల విధాలుగా హాయి, ఆనందం, ప్రశాంతిపిర్పడ గల వత్సరం. నూతన వ్యవహారాలలో పాలుపంచుకోవటం, నూతన వస్తు సేకరణకు అవకాశం కల్గటం, మొదలుగాగల మంచి జరగటానికి సంవత్సర పూర్వార్ధానికన్నా ఉత్తరార్థం మేలు. సర్వవిధాలా మీ ప్రయత్నాలు విజయప్రదం కాగల అవకాశాలు పలురకాల సంభవం. స్త్రీలకు ఉద్యోగాభివృద్ధికి, కొందరకు నూతనోద్యోగప్రాప్తికి, కొందరకు అప్రయత్నంగా శుభం జరగటానికి అవకాశం గలగటం, విదేశయానానికి కొందరకు అవకాశాలుండటం గమనింపదగిన అంశాలు.

### మీనం :

ఈ రాశికి సప్తమంలో కొన్ని మాసాలు, అనంతరం అష్టమంలో శని గ్రహ సంచారం వలన శుభాశుభ మిశ్రమ ఫలాలుంటాయి. గురువు వలన కొన్ని మాసాలు శుభఫలితాలు అనుభవనీయం కాగలవు. ఇంట శుభకార్యానుకూలతకు, నూతనంగా గృహ నిర్మాణం గాని 'ఫ్లాటు' కొనటం గాని, చాలా మంది విషయంలో చెప్పదగిన అంశం. ఉన్నతోద్యోగాలకు చాల మంది యత్నించి మేలు పొందగలుగుతారు. చాలమందికి నూతనోద్యోగాలు లభించే మార్గం కనిపించే వత్సరం.

స్త్రీలకు: అభివృద్ధి, ఆదాయం, అప్రయత్న లాభం, నగలు, విలువగల వస్తువులు లభించే అవకాశమున్నది. ఉన్నత విద్యాభివృద్ధికి, క్రీడా రంగంలో ప్రయత్నించి కొందరు సఫలీకృతులవుతారు. మొత్తానికి ఈ రాశికి ఈ దుందుభి విజయ దుందుభి లాగే ఉంటుంది.



# మిట్టపల్లాలు

బి.రాధ




"మా యట్టి పేదోళ్లంటే దేవుని క్కూడా దయ లేదు. లేకుంటే వర్సాలేకుండా ఇట్టాగ సంపుతాడా ... ఓ గంగమ్మో! ... ఒక్క వాన గురిత్తే తిండి లేకుంటె మావె పిల్లోడిట్టా అన్యాయం గాకుండె గదా ... నా పిల్లగాడు నచిపోయి న్నాడోయ్ నానేంటి సేతున్రోయ్ దేవుడో!"... అని గుండెలు బాదుకుంటూ ఏడుస్తోంది బస్‌స్టాపు అనబడే ఒకచెట్టు కింద కూర్చున్న లచ్మక్క. రాయలసీమలో ఓ మారుమూలున్న లింగాపురం ఒక బస్‌స్టాండు వుండదగ్గంత ఊరు కాదు. అందుకనే ఓ మట్టిరోడ్డుని గవర్నమెంటువారు అతికష్టంమీద వేయించి ఆర్. టి. సి. వాళ్ల దయా ధర్మంతో ఏదో రెండు బస్సులు తోలుతున్నారు.

అప్పుడే బారెడు పొద్దెక్కింది. బస్సు రావడానికి సరిగ్గా అయితే గంట, ఆర్.టి.సి. వాళ్ల మూడ్స్ బావులేకపోతే రెండు గంటల పైనే పట్టొచ్చు. "ఏంటి చేత్తాం నోరుముయ్యే" అంటూ విసుక్కుంటున్నాడు చంద్రాయుడు. మధ్య మధ్య కళ్లు మూసుకుని ఒంటిమీద తెలివి లేకుండా పడున్న పిల్లాడిని చూస్తూ వచ్చే కన్నీళ్లని ఆపుకుంటూ "నీ యవ్వ యెదవ బండింగా రాదేంటి?" అనే మాటల కింద పైకి ఉబుకుతున్న బాధని నొక్కి పెట్టేస్తున్నాడు. చంద్రాయుడి విసుగు మాత్రం లచ్మక్కమీద ఏమీ పని చెయ్యడం లేదు ... "చక్కంగున్న పిల్లోని మీద ఎవరి గన్ను పడినాదో ఏందో సీమగల్లే పడిపోయినాడు ... ఎవారికేం కీడు సేసినాడని ఈడికిట్లాగైంది నాయనోయ్"... అంటూ ఎడతెరపి లేకుండా శోకాలాపన పెడుతోంది ... మధ్య మధ్యలో బుర్ర మీది కొంగు ముందుకి లాక్కుని అందులోనే చీదుకుంటూ ... ప్రక్కనే కూర్చున్న నాగమ్మ, రామక్క "ఏంటి జేత్తం వొదినా దినాలు బాగ లేకుంటే! ఊర్కోర్కో" అని ఓదారుస్తున్నారు. మరో నలుగురైదుగురు పెద్దలు, పది పదిహేను మంది పిల్లలు, కొంతమంది ఆడాళ్లతో రోడ్డంతా సందడిగా వుంది. ఎవరికి తోచినట్టు వాళ్ళు తలా ఒక మాటా అంటున్నారు. "ఏదీయాడదగిలింది?", "అబ్బో పెద్దంగ తగిల్నయే దెబ్బలూ?" అంటూ తోసుకు తోసుకు చూస్తున్నారు రాముణ్ణి.

మరో గంటకి బస్సు వచ్చింది. రాముణ్ణి తీసుకుని చంద్రాయుడు, లచ్మక్క దాంట్లో ఎక్కి పట్నానికి బయలుదేరారు. ప్రతిసారి పట్నం వెళ్లేటప్పుడు తీసుకెళ్లమని ఏడ్చి పెడబొబ్బలు పెట్టినా తీసుకెళ్లని వాళ్లు ఇవాళ రాముడు నోరు తెరిచి అడక్కుండానే తీసుకెళ్తున్నారు చంద్రాయుడు దంపతులు. బస్సు తలుపు లాగి వేస్తున్న కండెక్టరు విసుక్కుంటున్నా లెక్కచెయ్యకుండా తల ఇవతలికి పెట్టి "పిల్లోండ్లని జూసుకోండ్రక్కా ... మల్లా మేమొచ్చే తాల్కి ఏ పొద్దవుతదో ఏందో" అని రామక్కతో ఇంకా ఏదో చెప్ప బోతుండగా కండెక్టరు 'రైట్ రైట్' అనడంతో చంద్రాయుడి మాటల్ని మింగేసి దుమ్ము రేపుకుంటూ బస్సు వెళ్ళిపోయింది. ఇదేనుమీ నా సంపదన్నట్టు ఎర్రటి ధూళితో తుళ్లి పడుతున్నట్టుంది రోడ్డు.

బస్సులో దుమ్మే కదిలించారెవరో సంగతేంటని. దాంతో తిరిగి వర్షాలు కురిపించని దేవుణ్ణి, దయాదాక్షిణ్యాలు లేని మనుష్యుల్ని బస్సు ఊరు దాటింది గదా అనే ధైర్యంతో దుమ్మెత్తిపోసింది. కాండెక్టరు రెండుమూడు సార్లు గొడవ చెయ్యొద్దని చెప్పి చూసి మరి లాభం లేదని వూరుకున్నాడు. ఏంత గొడవ పెట్టేస్తోందో అని మొహం చిట్లిస్తూ

పేపర్లో, పుస్తకాల్లో అచ్చుపెట్టుకున్నారు నవనాగరికులం అనుకునేవాళ్లు. ఒకళ్లిద్దరు మాత్రం కురవని వానలకి తగిలిన దెబ్బలకీ ఎక్కడ చుట్టరికమా అని బుర్రగోక్కున్నారు. సరే...మళ్లీ చెప్పకపోతుందా కథాకమీషనా అనే ధైర్యంతో కూర్చున్నారు. తర్వాత నెమ్మది మీద లచ్చక్క స్వగతం కొంతా చంద్రాయుడి కథనం కొంతా కలిపి టూకీగా కథ ఇది ...

చంద్రాయుడూ, లచ్చక్క ఇంకా చాలా మంది గవర్నమెంటు వాళ్లిచ్చిన జాగాల్లో గుడిసెలు కట్టుకుని ఊరికి దూరంగా ఉంటున్నారు వాళ్లకున్నది ఒకే ఒక్క నీటి సదుపాయం పంచాయతీ వాళ్లు వేయించిన బోరింగు. అంతకు ముందు రెండు బావు లుండేవి ... అంటే ఇప్పుడు లేవని కాదు. ఉన్నాయి కాని వాటిలో నీళ్లు మాత్రం లేవు. రెండ్రోజులు కిందట ఆ వాడలో ఆడాళ్లందరి నోటా ఒకేమాట ... ఎదవనాయాండ్లెవరో బోరింగిరిపి పెట్టినారు. నీళ్లకి యాడికి పోవాల్నా. దొంగెదవలకి యారే పనేం చిక్కనట్టుండాది..." అంటూ...మాజంలో సమర్థత, పరపతి లేని జనాభా వాళ్లది. నెయ్యి గుళ్ళ పూజారి వి. డి శని పట్టు కోవడం వాళ్లతరం కాదు. ఒకవేళ పట్టినా వాడి జేబు పట్టేంత డబ్బు ఇవ్వటం కూడా వాళ్లకి చేతకాని పనే. అందుకని ఊళ్లో ఉన్న మోతుబరి ఒకతన్ని బతిమాలి దూరంగా ఉన్న తోటలో మిషన్ వేయించి కాలువ వెంట వచ్చే నీళ్లు తెచ్చుకుంటున్నారు. కూలి నాలికి వెళ్లకపోతే కూడు నోటికా రాదు. పిల్లల్ని పంపాలంటే తోట చాలా దూరం. అందుకని పూరు తెల్లారక ముందే ఆడాళ్లు బయలుదేరి నీళ్లు పట్టుకొచ్చుకుంటారు.

ఆ రోజు లచ్చక్క పొద్దున్నే నీళ్లు తెచ్చి కుండ నింపి, అన్నం వండి కూలికి బయల్దేరింది పోతూ పోతూ "ఓరే పిల్లా గంగుల్ని జూస్కో, పిన్నోడు భద్రంరా మామ నీళ్ళు బోర్లించేవోరే నరుకుతాను ..పటి దంక అయ్యే నీళ్లు..." అని ఎదురుగా గోలీ లాడు కుంటున్న ఎనిమిదేళ్ళ రాణ్ణి హెచ్చరిస్తూ కదిలింది. తల్లి కనుమరుగవగానే రాముడు ఐదేళ్ల గంగిని చెయ్యట్టి లాగుతూ, వంటిమీద గుడ్డముక్కన్నా లేని రెండేళ్ళ పిన్నోణ్ణి సంకనేసుకుని, కారు ముక్కుని చొక్కా చేతికి రాసుకుంటూ బడి వైపుకి నడిచాడు. వాడి జేబులో పొద్దున్న వాళ్లయ్య ఇచ్చిన పదిపైసల బిళ్ల కదులుతోంది. ఏం కొనుక్కోవాలా అన్న ఆలోచన బుర్రలో తొలిచేస్తుండటంచేత కాబోలు మధ్యమధ్యలో బుర్ర గోక్కుంటూ అడుగు లేస్తున్నాడు. బోలెడంత ఆలోచించేసి చివరికి స్కూలు చేరుకుని అవ్వ దగ్గర వేరుశనక్కాయలు కొనుక్కుని, కాస్సేపు అటూ ఇటూ తిరిగి తిండి వేళకి ఇల్లు చేరుకున్నాడు. తడికె కొక్కెం తీసి లోపలికి అడుగేసాడు. అంతే ఎక్కడినుంచో వాడి దోస్తు తిప్పన్న రొప్పుకుంటూ వచ్చి "ఓరే రామన్నా బిరీన బువ్వదిని రారా చిల్లాగట్టికి మన జత గాళ్ళంతా రెడీగున్నారు వస్తున్నావు గదా" అంటూ ఒక్క అరుపు అరిచి పరుగులంకించు కున్నాడు.

అందరూ రెడీగా ఉంటే తనదేగా ఆలశ్యం. చెల్లికీ తమ్ముడికి అన్నం పెట్టి తను తిని వెళ్ళాలి ...ఈ లోపున చిల్లాగట్టి తీసిపెట్టు కోవాలి...అనుకోవడమేమిటి వెంటనే చూరు లోంచి దాన్ని లాగి సిద్ధంగా ఉంచాడు. కుండలో నీళ్ళు ముంచి, పిల్లోరి చిప్పల్లో ఇద్దరికీ పెట్టి తనూ పెట్టుకుని ఆదరా బాదరాగా నోట కుక్కుకున్నాడు. పిల్లలిద్దరికీ పెట్టవలసినంత హడావుడి పెట్టాడు... మధ్యలో చిన్నవాడికి రెండు అంటించాడు కూడా ఏలాగైతేనేం తడికె చిలుకు వేసి తమ్ముణ్ణి చూస్తుండమని చెల్లికి అప్పగించి నాలుగిళ్ళ అవతలున్న చెట్టు కిందున్న మిత్ర బృందాన్ని చేరుకున్నాడు. ఆట మాంచి రసపట్టులో వుండగా బోర్‌వెల్ వేసేవాళ్ళు వచ్చారనే వార్త వాడంతా తెలిసిపోయింది. దాంతో రాముడు వాడి స్నేహితులూ ఆట కట్టేసి అక్కడికి చేరుకున్నారు. ఇంతలో వాడలోని ముసలి వాళ్లెవరో పాడైనబోరింగు రిపేరు గురించి వచ్చిన వాళ్లని అడిగారు. కాని దాని సంగతి మాకు తెలియదు, కొత్తది వెయ్యడమే మా డ్యూటీ అన్నారు వాళ్ళు. బోరింగు వేస్తుంటే వచ్చే శబ్దం పిల్లల చెవులకి శంకరాభరణం పాటలకంటే ఇంపుగా వుంది. సాయంకాలం ఎప్పుడైపోయిందీ రాముడికి తెలియలేదు. తల్లి తన కోసం కబురు చెయ్యడంతో స్పృహలోకి వచ్చి వాడు ఇంటికేసి దౌడు తీసాడు.

"ఓరి రాముడో యాడ సచ్చినావురా..." తల్లి తిట్లు అల్లంత దూరానికే వినబడు తున్నాయి. ఆ తిట్లన్నీ తనకేనని తెలుసు వాడికి. చెల్లిని, తమ్ముణ్ణి చూడకుండా పోయినందుకేమో అని బిక్కు బిక్కుమంటూ ఇంట్లో కాలు పెట్టాడో లేదో లచ్చక్క వాడి జుట్టు పట్టుకుని వంచి వీపుమీద నాలుగు వడ్డించింది ఊపిరి పీల్చుకోనీకుండా బాదేసింది. "ఎదవ నీళ్లంత ఇట్ల పారేసినావు రేతికి కూడెట్ట వతాదనుకుంటివిరా ఎదవ సచ్చినోడా! నిన్ను ఈ పొద్దు పరికేతాను రా ఎదవనాయలా!" అని దెబ్బలూ తిట్లూ ఏకధాటిగా పెడుతోంది లచ్చక్క. దెబ్బల



# పిట్ట పల్లాలు

ఉధృతం తగ్గాక రాముడు కుండ పక్కనే పడువ్న బొంగరాన్ని చూసి అయితే ఇది తమ్ముడి పనన్నమాట అనుకున్నాడు - వెంటనే తల్లితో ఏడుపుని ఆపుకుంటూ "నామ గాడే సిన్నోడు బొంగరంతో కడవ పగలేసివాడు" అని తన నిర్దోషిత్వాన్ని చెప్పుకున్నాడు. అసలే కోపంమీదున్న లచ్చక్క "ఏందిరా మచ్చ్య జేసింది గాక నోరు లేనోని మీదేసుతుండావురా? కడవనీల్లు కొండ్రాకుంటే నీకు కూడెట్టేది లేదు" అంటూ వాణ్ణి బయటికి తోసింది... అసహాయతతో వచ్చిన కోపం పట్టలేక.

కిందపడ్డ రాముడికి మోచెయ్యి డోక్కు పోయింది. కాని వాడిప్పుడు దాన్ని పట్టించుకునే స్థితిలో లేదు. పొద్దుట ఆదరా బాదరాగా నాలుగు మెతుకులు తిన్నాడు. ఆటల ధ్యాసలో పడి ఇంతసేపూ తెలియలేదు గాని కడుపులో ఆకలి మండుతోంది. వాడికి తల్లి కోపం సంగతి బాగా తెలుసు. నీళ్లు లేనిదే అన్నం పెట్టదు. ఇనప కడవ చేతో పట్టుకుని ఎక్కడి నుంచి తేవాలా అని ఆలోచించాడు. పొద్దుటవాడలో వాళ్ళు వెళ్లేతోటకి ఇప్పుడు వెళ్ళి లాభం లేదు. చీకటి పడ్డాక మిషను వెయ్యరు. ఇంకేం చెయ్యాలి? ఊళ్లో కెళ్ళి నాలుగైదు చోట్ల బావుల దగ్గర నీళ్ళు తోడుకుంటున్న వాళ్ళని అడిగాడు. కాని ఎవరూ వాడి మాట వినిపించుకోలేదు. ఏం చేస్తారు. వాళ్లే బావుల్లో నీళ్లారక వంతు ప్రకారం తోడుకోవడంతో దెబ్బలాడుకుంటున్నారు.పోనీ కరణంగారింటికి వెళితే అన్న ఆలోచన వచ్చింది రాముడికి. వూళ్లో బావులన్నీ ఎండిపోయినా వాళ్ళ బావిలో నీళ్ళుంటాయి. కాని అక్కడికి వెళ్ళాలంటే భయం. కరణంగారు గాని వాళ్ళావిడగాని తనని ఆ చుట్టుపక్కల చూస్తే అమ్మబాబోయ్ ఇంకేమైనా వుందా? చంపేస్తారు. లాభం లేదు అనుకున్నాడు.

బాగా చీకటి పడిపోయింది. ఏమైతే అదే అయింది ఇంటికెళ్ళిపోతేనో... అనుకుంటే తప్పతాగి వచ్చే తండ్రిగుర్తుకు రాగానే వాడికి నీరసం రెట్టింపు అయింది. ఒకపని చేస్తేసరి తను స్కూలు దగ్గర ఎప్పుడూ చూస్తుంటాడుగా కరణంగారి పిల్లలు చాలా మంచి వాళ్ళు. పెద్దవాళ్ళ కంట పడకుండా వాళ్ళని అడిగితే పోస్తారు అని నిశ్చయించుకున్నాడు. రాముడు అక్కడికి చేరుకునే సరికి పెరటి వైపున బాగా సందడిగా వుంది. భోజనాలవుతున్నందుకుసూచనగా కంచాలూ, గ్లాసులూ చప్పుడవుతున్నాయి పనివాళ్ళు కాబోలు బావి దగ్గర నీళ్ళు తోడుతున్నారు చీకట్లో కనబడంలేద దడికకిట్టిన తడికెని అనుకుని కూర్చున్నాడరాముడు. ఆకలి ఎక్కువగా వుండటంతో నీరసంగా అనిపించి కాసేపు కళ్ళు మూసిన్నాడో లేదో మగత కమ్మేసింది.

తెలివొచ్చి ఉలిక్కిపడి లేచాడు అప్పటికే రాత్రి బాగాపొద్దు పోయినట్టుంది టైము ఎంతైవుందో రాముడికి తెలియడంలేదు. ఎక్కడా చప్పుడూ లేదు. కరణం గారింట్లో అంతా పడుకున్నట్టున్నారు. హఠాత్తుగా మేలుకున్న రాముడికి కాస్సేపు తనెక్కడున్నది తెలియక భయపడ్డాడు. అంతా జ్ఞాపకం వచ్చి వాడికి దుఃఖం ముంచుకొచ్చి, ఆకలితో కడుపు నకనకలాడి పోతోందాహంతో నోరెండిపోతోంది. అసలు తను వచ్చినపని ఒకటి అయింది మరొకటి! ఈ వేళప్పుడు నీళ్ళెవరిని అడగడం? అప్పుడే ఇంటికి వుంటే తల్లి తిట్టో కొట్టో అన్నం పెట్టేది. ముందు గొంతుకలో గుక్కెడు నీళ్ళుపడందే అడుగు దూరం కూడా నడవలేననుకున్నాడు. ఎలాగో ధైర్యం చేసి తడికెతోసుకుని అడుగులో అడు

## చిట్కాలు!

1. గాజుగ్లాసులో స్పూను వుంచితే వేడిగా వున్న కాఫీగాని, టీగాని గ్లాసులో పోసినా గ్లాసు పగలదు.

2 బూట్ పాలిష్ గట్టి పడితే దానిలో టర్పన్టైన్ వెయ్యండి

3. వాటర్ కలర్సు గట్టిపడితే గ్లిజరిన్ వెయ్యాలి.

4 నెయ్యి తేటగా, కమ్మగా వుండాలంటె బెల్లం గెడ్డ వెయ్యండి.

5. వెండి వస్తువులమీద మరకలు పోవాలంటె వుప్పుతో శుభ్రం చెయ్యండి

6. కత్తుల తుప్పు వదలాలంటె వుల్లిపాయని రెండు, మూడు సారు కొయ్యాలి.

— జి. వి. ప్రసాద్

గేసూ బావి దగ్గరకు వెళ్ళాడు. గుడ్డి వెన్నెల్లో చాంతాడు కనబడుతోంది. ఊపిరి బిగబట్టి బిందెకి తాడు తగిలించి బావిలోకి అతి నెమ్మదిగా జారవిడిచాడు. సరిగ్గా రెండు బారలు లాగడో లేదో "ఎవడ్రా బావిదగ్గర?" అంటూ వినబడ్డ కరణంగారి కేకతో గుండె గుభేలు మంది రాముడికి! బిందె వదిలేసి విలా పారిపోవడమా అని ఒక్క క్షణం ఆలోచించే లోపునే పనివాడు రాముణ్ని ఒడిసిపట్టేసేడు. ఇంతలో కరణంగారు, తక్కిన పనివాళ్ళూ అక్కడికి చేరుకున్నారు దీపం పట్టుకున్న పనివాడు రాముణ్ని చూసి విభ్రాంతపోయి "మన మాదిగ చంద్రాయుడి కొడుకండయ్యా" అన్నాడు భయపడుతూ. "ఏంటీ! వింత ధైర్యంరా నీకు. బావి ముట్టుకుని మైల చేస్తావా దొంగ వెధవా! బుద్ధొచ్చేటట్టు బాదండ్రా లంజకొడుకుని... సున్నంలోకి విముక లేకుండా తన్నండి" అని ఆవేశం పట్టలేక చిందులేసారు కరణంగారు. "దొంగ నాయాలా నీకిట్టా బుద్దెట్టగ బుట్టిందిరా" అంటూ పనివాళు శక్తికొద్దీ తగల్నిచ్చారు. ఈ గొడవకి ఇంట్లో వాళ్ళందరూ లేచారు. ఇరుగు పొరుగు వాళ్ళు తొంగి చూసారు. కాని ఆ చిన్న కుర్రాణ్ని పశువును బాదినట్టు కొడుతుంటే వద్దనే ధైర్యం ఎవరికీ లేకపోయింది. ఉదయం నుంచీ తిండీ తిప్పలూ సరిగా లేని రాముడు తెలివితప్పి పడిపోయాడు. కాలితో వాణ్ని కదిపి చూసిన కరణం "వెధవ వేషాలేస్తున్నాడు బయట కీడ్చెయ్యండిరా" అని పని వాళ్ళకో ఆజ్ఞ పారేసి లోపలికి నడిచారు.

"అయినా ఆ వెధవకి ఇదేంపోయేకాలం... అంత ఆచారపరులింట్లో దూరి బావి మైల పెడతాడా? అయినా బ్రాహ్మణభక్తి బొత్తిగా లేకుండా పోతోంది. బరితెగించిపోతున్నారు." ఇలా సాగిపోతున్నాయి వ్యాఖ్యానాలు. కాస్సేపటికి "ఏవే బైమెంత!" కేకేసారు కరణంగారు రెండైందన్న శ్రీమతిగారి సమాధానం విని, "రేప్పొద్దున్నే లేవాలి, బ్రాహ్మణ్ని కనుక్కోవాలి, బావిలో నీళ్ళు అలాగే వాడుకుంటే పుణ్యానాళ్ళ ప్రాణాలు తోడేసారు" అని తను ఎందరి ప్రాణాల్ని తీస్తున్నారో తెలియని ఆయన నడుం వాల్చారు.

రాత్రి పొద్దుగూకిన దగ్గరనుంచీ లచ్చమ్మక్క కాస్సేపు తిట్టుకుని, ఇంతలో తాగొచ్చిన మొగుడిచేత నిష్కారణంగా తన్నులు తిని ఆ పైన పిల్లాడి గురించి బాధపడా దిల్లా చివరికి ఎవరి గుడిసెలోనో వుంటాడులే పొద్దుటే వస్తాడని సమాధానపడి కునుకు తీసింది. మర్నాడు రాముడి సంగతి వూరంతా గుప్పుమంది.

* * *

నాల్రోజుల తరవాత రాముణ్ని తీసుకుని చంద్రాయుడు, లచ్చమ్మక్క బస్సు దిగుతున్నారు. ఆ రోజు అక్టోబరు రెండని, తమలాంటి వాళ్ళ కోసం ఎంతో పాటుపడ్డ మహాత్ముడి పుట్టిన రోజనీగాని వాళ్ళకి తెలియదు. దోవలో పరామర్శచేస్తున్న వాళ్ళకి మెటికలు విరుస్తూ మరెన్నో రకాలుగా అభినయం చేస్తూ ఏదో చెప్పుకొస్తోంది. సరిగ్గా అదే సమయానికి బి. డి. ఓ., ఇదితరుల బలవంతంమీదమైకు ముందు నిలబడ్డ కరణంగారు ముందు అసందర్భ ప్రలాపంగా స్టేజి మీదున్న పెద్దల్ని పొగిడేసి "గాంధీగారు అంటే ఎవరు? మన జాతిపిత. ముఖ్యంగా గొప్ప మహనీయులు. అస్పృశ్యతని తొలగించాలన్నారు. అంటరాని వాళ్ళని హరిజనులన్నారు. వాళ్ళని బాగుపరచడం కోసం. వెలుగులోకి తీసుకు రావడం కోసం ఎన్నెన్నో పథకాలు ఆనాడు ఈనాడు కూడా మన గవర్నమెంటువాళ్ళు చేస్తున్నారు. మనం అందరం గాంధీగారి అడుగుజాడల్లో నడుచుకోవాలి. కాబట్టి ముఖ్యంగా నేనిప్పుడు చెప్పేదేమిటంటే..." ఇలా కొనసాగుతోంది కరణంగారి వాగ్ధోరణి. మొన్ననే చంద్రాయుడి కొడుకుని చావ గొట్టించి ఇంతలోనే గాంధీగారి ఆదర్శాలని వల్లించడం వినలేక కొన్ని కాకులు కదిలేనన్నాయేమో కరణం అని చెవులు కొరుక్కున్న వాళ్ళు జనంలో లేకపోలేదు.

చంద్రాయుడు దోవన పోయే వాళ్ళెవరినో "ఏందప్పా! ఇమ్మాళుకాడ" అని అడిగాడు. "మీటింగవుతుండాది. కరణం చెప్తాండప్పా మీటింగు" కదిలిపోయాడు. గుడిసె తలుపు తీసుకుని లోపలికెళ్ళిన లచ్చమ్మక్క కడవ చంక నేసుకుని "ఇదో నీకేనయ్యా చెప్తాండేది. సోములమామింటికిబోయి నూకలు కొండ్రా" అని మొగుడికి పురమాయించి ఏదో గొణుక్కుంటూ తోటకేసి నడిచింది. "ఆనాడు సత్యాగ్రహం సాగించి స్వరాజ్యం తెప్పించేను గాని ఇప్పుడుండి వుంటే ఈ మిట్టపల్లాలని సరిచెయ్యగలిగేవాడివా" అన్న ఆలోచనతో కాబోలు వణికినట్టుగా గాలికి వూగింది గుడిసెలో రాటకి రాముడెప్పుడో సంపాదించి వేలాడదీసిన గాంధీగారి క్యాలెండరు. ●



## రావ్. – హైదరాబాదు

ఒకరు తప్పు చేసే నేనూ చేసా నన్నట్టుంది మీ జవాబు. వాళ్లీ సిమ్మల్ని సమర్థించుకొంటూ సమాధాన మిచ్చేరు. మీరు ఇంకొకసారి ఆలోచించండి.

ఆలోచించాను. సంఘటిత శక్తికితప్ప గుర్తింపు లేని ఈ సమాజంలో ఇంకో దారి ఏముంది? పోనీ వాళ్ళు చేసిన తప్పుని ప్రతిఘటించడానికి దారి చూపిస్తారా? తప్పుని సమర్థించుకోవడం కాదు. ఇది తప్పు కాదు అంటున్నాను అంతే. ఇతర కులాలవారు— సంఘటితమై పనులు సాధించుకొంటున్నప్పుడు బ్రాహ్మణులు ఆ ప్రయత్నంచేస్తుంటే ఎందుకింత గగ్గోలు? నాకర్థం కావడం లేదు.

## టి. ఎస్. ఎస్. – వరదాయపల్లి

ఏదన్నా తప్పు చేసే పిల్లలని పెద్దలు దండించ తారు. మరి పెద్దలని?

వారి అంతరాత్మ దండిస్తుంది.

మనిషికి స్వార్థం ఎందుకు?

ఈ సంఘంలో బ్రతకడానికి.

## ఆర్. కె. ఎస్. – మంగళగిరి

ఒకావెను మొగుడు వదిలేశాడు. చిన్న ఉద్యోగం చేసుకుంటూంది. నేను తోడుగా ఉందామనుకొంటున్నాను. ఈ రోజుల్లో మగదిక్కు లేకుండా ఉంటే ఇబ్బందికదా?

బాగుంది— భర్త వదిలాడన్న జాలికాదు, ఉద్యోగం చేసుకుంటున్న ఆడదానికి మగదిక్కుగా ఉందామని! దీనే అవ్వా కావాలి బువ్వా కావాలి అనడం. మీకు ఆడతోడు దొరుకుతుంది. సంపాదించి పెట్టవలసిన బాధ్యత ఉండదు. ఎంత సుఖం... హాయిగా ఆవిడగారిని బ్రతకనివ్వండి!




## కె. డి. ఆర్. – బరంపురం

రూపాన్సీ లక్ష్మి, సీతారామరాజు ఆ కాలంలో ఉండేవారు. అలాంటివారు పదిమంది ఉంటే దేశం బాగుపడేది. కాని ఈనాడు మీలాంటి కె. రాలు పదిమంది ఉంటే— మన ఆడవాళ్ళు అమెరికా ఆడవారిలాగా బరితెగించి తిరుగుతారు. భారత స్త్రీకి ఉన్న ఆ కాస్త గౌరవం గంగపాలై పోతుందని నా కనుమానంగా ఉంది.

ఎంత పిరికివాండవయ్యా ఢిల్లీరాజూ!! ఉల్ఫి చూసి భయపడిపోతున్నావే!

## పిహెచ్. పి. ఆర్ – తాళ్ళూరు

ప్రతిసారి మీరిచ్చే సమాధానాలవల్ల ఆంధ్ర పత్రిక పాఠకులకు వచ్చే లాభం ఏమిటి?

ఏం ఉండకపోవచ్చు. కాని పనులు సరదాకి చేస్తాం. అంచేత నిరుపయోగం అనుకోనక్కరలేదు.

## వై. ఆర్. ఎమ్. – నెల్లూరు

నేను ఒక స్త్రీని నమ్మి కొన్ని వేల రూపాయల సహాయం చేశాను. కాని ఆ స్త్రీ నన్ను నమ్మలేనప్పుడు నా పరిస్థితి ఏమి?

గుణపాఠం చాలా ఖరీదుగా నేర్చుకొన్నా ననుకోవాలి మీరు. నమ్మడం చేతకానితనంగా నమ్మకద్రోహంగా బ్రతకడం నేర్పుగా పరిగణించే రోజులివి. మీకింకా తెలియదా?

## డి. కె. ఆర్. – శ్రీకాకుళం

మీకూ నాకూ దెబ్బలాట ఎప్పుడనుకో. మీరేమి చేస్తారు. నాతో పోరాడుతారా! నా ప్రశ తో పోరాడుతారా!

చిలిపిచిలిపి దెబ్బలాటలతో నా ఓర్పు వృధా చేసుకోను. ఓర్పు పట్టి పట్టి, చావుదెబ్బ కొట్టి చూపిస్తాను. సాధారణంగా నా ఓర్పుని, మంచి తనాన్ని— చేతకానితనంగా, ఏం చేయలేనితనంగా అనుకుంటారు. నాకేం బాధలేదు. కిలెరిగి వాతెయ్యడం నాకు ఉగ్గుతో పెట్టిన విద్య!

## కె. కె. డి. – మద్రాసు

ఇతరులతో ఎకాట్లాడినప్పుడు చూసి ఓర్వలేని మనుష్యుల రోగానికి మందేమిటి?

అసలు మనుష్యులతో ఎకాట్లాడే నేర్పు ఉన్న వాళ్లిలా— ఎదుటివారి గురించి బాధపడవలసిన అవసరంరాదు.

## కె. జి. ఎస్. కె. – కుసుం

శాశ్వత జీవనం అనేది?

నేనిమ్యును లేదు— పుస్తకాలలోలాగా బ్రతకాలని ప్రాప్రయత్నిస్తూ, వాస్తవ జీవితాన్ని అసహ్యించుకొంటూ — జీవించెయ్యడం!

## యు. యు. – ఎమ్మిగనూరు

వనితాజ్యోతిలో మీ ఫోటో చూశాను. ఆత్మీయులను చూసినంత ఆనందం కల్గింది.

చూశారా? నాకో స్నేహితురాలుంది. 'నీ ఫోటో చూసి నా కూతురు దడుసుకుంది. ఓ సారి వచ్చి ధైర్యం చెప్పెళ్ళు' అంటూ ఫోను చేసింది. మీలాటి వారుందేమిటి అలా ఎప్పుడుతయారయావు నాకు తెలియకుండ అంది ఆశ్చర్యంతో. మరి మీరేమో ఆత్మీయులను చూసినట్టుందంటు న్నారు. బహుశా— మీ సీ—నాది.....!

## పి. ఎస్. ఎల్. – యనమదుర్ర

మీకు ఎంతమంది పిల్లలు?

ముగ్గురమ్మాయిలు.

మా అభిమాన రచయిత్రి రంగనాయకమ్మ గారిపై మీ అభిప్రాయ మేమిటి?

నాకూ అభిమాన రచయిత్రే రంగనాయకమ్మ.

## డ. డి. బి. ఎస్. – రామాయింపేట

కళకోసం పెళ్లి చేసుకోకుండా నా జీవితాన్ని త్యాగం చేయాలనిపిస్తుంది. కాని లోకం?

లోకం కాకి సార్? మీ త్యాగం మానకండి!

## దిలీప్ – వరంగల్

పూలదండలో దారం దాగుందని తెలుసునా? ఆడ మనసులో ప్రేమ అసలుందని తెలుసునా? నవ్వినా ఏడ్చినా నగలేన్నో కనిపిస్తాయి ఆడదానిలో ఎంతెంతో కల్మషముందో తెలుసునా? కాన్వెంట్?

అబ్బబ్బ! మరీ ఇంత ఏడుపు బాజాఅయితే ఎలాగయ్యా? చూసేవాళ్ళ దృష్టి బట్టే కనిపిస్తుంది. ఎదుటివారి ముఖం! తెలుసా?






### ఫోర్‌హెన్స్ చిగుళ్లను రక్షిస్తుంది



చిగుళ్లు బలహీనంగా, మెత్తగా ఉంటే, మీ పళ్లు ఆరోగ్యంగా ఉన్నప్పటికీ అవి వదులై ఊడిపోవచ్చు. ఫోర్‌హెన్స్‌లోని ప్రత్యేకమైన పదార్థం (అస్ట్రింజెంట్) చిగుళ్లను గట్టి పరచి, చిగుళ్ల [illegible]

### ఫ్లోరైడ్ పళ్లను రక్షిస్తుంది



పిల్లలలో, ఫ్లోరైడ్ వంటి ఎనామెల్ పొరను గట్టి పరచి పిప్పి పళ్లు కాకుండా కాపాడుతుంది. పెద్దలలో, ఫోర్‌హెన్స్‌లోని ఫ్లోరైడ్ వంటి ఎనామెల్ పొర నిరోధక శక్తిని పెంచి, దంతక్షయాన్ని కల్గించే క్రిముల నుండి పళ్లను కాపాడుతుంది

## ఫ్లోరైడ్‌గల
# ఫోర్‌హెన్స్
## చిగుళ్లనూ, పళ్లనూ రెండిటినీ రక్షిస్తుంది




Regd. T.M.: Geoffrey Manners & Co. Ltd.



# ఒకే జాతి పక్షులు

"అన్నపూర్ణ"
(కె. వి. శాస్త్రి)

కృష్ణా ఎక్స్‌ప్రెస్ విజయవాడ స్టేషన్ నుంచి గంట ఆలస్యంగా బయలుదేరింది ఆ రోజు.

"ఇది సికింద్రాబాద్ స్టేషన్ చేరేసరికి రాత్రి పదకొండు దాటొచ్చు."

"ఆ టైమ్‌లో సిటీబస్‌లు దొరుకుతయ్యా?"

"దొరకవ్."

"టాక్సీల వాళ్ళను, ఆటోల వాళ్ళను — ఆఖరికి రిక్షావాళ్ళను కూడా మందలించే సీమటగా అక్కడ?"

"...అందుకని ఏం చేద్దాం?"

"ఈ రాత్రికి స్టేషన్‌కు దగ్గరగా వున్న ఏ హోటల్లోనో గది తీసుకొని..."

"ఏ రాయి అయితేనేం పళ్ళూడగొట్టుకోవటానికి... బాలానగరేగా — ఆటో మాట్లాడుకొంటే పావుగంటలో వెళ్తాం."

"అట్లాగే వెళ్దాం. సిటీకి బయలుదేరాక ఖర్చు తప్పుతుందా?"

"మవ్వట్లా ఖర్చు... ఖర్చు అనుకొంటే వేను మధ్యలోనే దిగిపోతారా అబ్బాయ్... ఏదో బ్రతుకు తెరువును గురించి — నోరు తెరిచి అడిగావుకదా అని బయలుదేరాను. రేవు చలపతిగాడి కంపెనీలో ఉద్యోగానికి చేరేది మవ్వా, నేనా?"

"నేనే అనుకో... అయినా ఖర్చును గురించి నేను ఝడవడంలేదు బాబాయి. కాకపోతే అర్ధరాత్రి వేళ వెళ్ళి చలపతి అన్నయ్యవాళ్ళ నిద్ర చెడగొట్టడం ఎందుకా అనే ఆలోచిస్తున్నాను... నువు మాత్రం చీటికి మాటికి కోపం తెచ్చుకోవద్దు బాబాయ్. ఏదో నాలుగుసార్లు హైదరాబాద్ వెళ్ళి వచ్చిన వాడివి, సిటీ బాగా తెలిసిన వాడివనే నిన్ను తోడు రమ్మన్నాను..."

"మవ్వు ఖర్చుల్ని గురించి వెనకముందు చూడవని నాకు మాత్రం తెలియదట్రా! ఏదో మాటవరుసకు అన్నాను... సరేగాని అబ్బాయ్, నీకు చదువు పెద్దగా లేదుగదా? చలపతిగాడి కంపెనీలో ఏం చేయగలుగుతావ్ మవ్వు?"

"మొన్న చలపతి అన్నయ్య మన ఊరు వచ్చినప్పుడు నేనూ ఆ మాటే అన్నాను బాబాయ్. చదువు సంధ్యలు ఎందుకురా తెలివితేటలు కావాలి గాని. నావాడు అనుకొనే మనిషి మా కంపెనీలో వుండాలి. అందుకే నీకు వుద్యోగం ఇవ్వాలనుకున్నాను. అనవసర విషయాలు ఆలోచించక నేను చెప్పినట్లు హైదరాబాద్ వచ్చెయ్. వచ్చేటప్పుడు సిటీ తెలిసినవాళ్ళను ఎవర్నైనా తోడుతెచ్చుకో. లేకపోతే యిబ్బంది పడగలవు' అని అన్నాడు అన్నయ్య.

— ఒకతనికి పాతికేళ్ళవరకూ ఉంటాయ్. రెండో అతడు పడీవయసులో వున్నాడు. కంపార్టుమెంటులో నా పక్కసీటులోనే కూర్చొని ఉన్నారు కనుక వాళ్ళ యిద్దరి సంభాషణ పొల్లుపోకుండా వినిపిస్తూనే వుంది నాకు. ఆ సంభాషణా సారాంశాన్ని అర్థం చేసుకున్నాను.

ఆ యువకుడి లాగానే నాకూ చలపతి లాంటి అన్నయ్య ఉండి, 'చదువు సంధ్యలు లేకపోతే మాత్రమేరా, నీకు మా కంపెనీలో ఉద్యోగం ఇస్తాను. వచ్చేసెయ్' అని బ్రతుకు భరోసా ఇస్తే...?...?!...!! — కొంత అసూయపడ్డాను అతడి అదృష్టాన్ని తలుచుకొని.

ఇక నా విషయానికొస్తే — డిగ్రీ సంపాదించాను. పేరు నమోదు చేయించుకొని సంవత్సరాల తరబడి ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజీ చుట్టూ తిరిగాను. అక్కడ నోట్లు తప్ప నోటి మాటలు పని చెయ్యవని అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. పోనీ,

్రైవేట్‌గా ఏదైనా ఉద్యోగం దొరుకుతుందేమోనని ప్రయత్నించాను. ఫలించలేదు.

ఈలోగా అనుకోని అదృష్టంగా మా బజార్లో - అదీ మా ఇంటికి ఎదురుగా కొత్తగా కట్టిన మేడలో ఒక ఆఫీసు వెలిసింది. అందులో ఏమైనా అవకాశం దొరుకుతుందేమోనని అక్కడి గుమాస్తాలను పరిచయం చేసుకున్నాను ఆఫీసరుగారు కనిపించినప్పుడల్లా 'గుడ్‌మార్నింగ్' చెప్పటం మొదలు పెట్టాను

రోజులో అధికభాగం ఆఫీసులోనే కూర్చోవటం అలవాటు చేసుకున్నాను. 'గ్రాడ్యుయేట్‌వి కద? అనుభవం వస్తుంది' అని నెమ్మది నెమ్మదిగా రికార్డు వర్కు చెప్పటం ప్రారంభించారు గుమాస్తా సోదరులు, వాళ్ళు పని చెప్పటం నాకెంతో ఆనందంగా ఉండేది ... నేను ఆఫీసులో కూర్చొని పని చేయటం అడపదడప ఆఫీసరుగారూ చూస్తూనే ఉన్నారు.

ఎలాంటి జీత భత్యాలు లేకుండా నా చేత పని చేయించుకుంటున్నందుకు అప్పుడప్పుడు బాధ పడుతూండేవాళ్ళు గుమాస్తా పెద్దలు. 'డెయిలీ వేజెస్ క్రింద ఎవర్నీ పెట్టుకొనే అవకాశం లేదు ఇక్కడ. లేకపోతే నీకు ఎంతో కొంత 'పేమెంట్' ఇస్తూనే ఉండేవాణ్ణి' ఇవి ఆఫీసరుగారి సానుభూతి వాక్యాలు.

అలా కొద్ది నెలలు గడిచాక ఆఫీసరుగారికి ప్రమోషన్ వచ్చింది. ఆయన ఇప్పుడు హెడ్ ఆఫీసు(హైదరాబాద్)లో ఉంటున్నారు. ప్రస్తుతం నేను హైదరాబాద్ వెళ్తున్నది ఆఫీసరుగారితో పని ఉండే ... ఉదయం గోల్కొండ ఎక్స్‌ప్రెస్ కొద్దిలో తప్పిపోయింది. ఎక్కడో వరదలవలన కోణార్క్ క్యాన్సిల్ అయింది... రేపు ఉదయమైనా నేను తప్పక ఆఫీసరుగార్ని కలుసుకు తీరాలి ... అందుకే కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరాను... ఈ రాత్రికి సికింద్రాబాద్ స్టేషన్‌లో కాలక్షేపం చేసి రేపు ఉదయం ఎలాగోలా ఖైరతాబాద్ చేరి - నా పని నెరవేర్చుకోవటంగా నిర్ణయించుకున్నాను కూడా.

ట్రెయిన్ డోర్నకల్‌లో ఆగినప్పుడు నేను సీటు మారాను. ముఖ్యంగా నా ప్రక్కన వాళ్ళ ఇద్దరి ధోరణి భరించలేకే అలా చేశాను ... బండి కదిలాక నా మనసు భవిష్యత్తును గురించిన తీయని ఆలోచనలతో నిండిపోయింది.

ఈలోగా పన్నెండు పదమూడేళ్ళ ఉంటాయ్, ఒక కుర్రవాడు గుడ్డపీలిక ఒకటి పట్టుకొని ఆ బెంచీక్రింద ఈ బెంచీ క్రింద దూరి దాంతో నేల (కంపార్ట్‌మెంట్) తుడవటం మొదలెశాడు.

ఆ కుర్రవాణ్ణి చూడగానే నాకు అనుమానం కలిగింది. వాడు ఏదో మాస్టరుప్లాన్ వేశాడనుకున్నాను కంపార్టుమెంట్ నిండా వేరుశనక్కాయతొక్కలు, బత్తాకాయ తొక్కలుతో నిండివున్న మాట యదార్థమే. అయినా దాన్ని శుభ్రపరచవలసిన అవసరం వాడికేమిటి? రైల్వే డిపార్టుమెంటువాళ్ళు నియమించిన స్వీపర్లు అంతమంది వుండగా వీడి దేంఖర్మ? ఏమైనా అపర గాంధీమహాత్ముడా! లేదు... లేదు... అందరికీ నమ్మకం కలిగించి ఏబ్యాగో సూటకేసో పట్టుకొని చక్కగా కంపార్టుమెంటు మారిపోతాడు. లేకపోతే ఏ ఆసామీ జేబో మెల్లగా కత్తిరించి గుట్టు చప్పుడు కాకుండా ఉడాయించేస్తాడు. నిజంగా ఇంత చిన్న వయసులో ఎంతటి తెలివితేటలు? వీడు పెద్దవాడైతే నట్వర్‌లాల్‌ను మించిపోగలడు! నాకు మాత్రం వాణ్ణి ఈ చెంప ఆ చెంప వాయించి కంపార్టుమెంటు నుంచి తరిమివెయ్యాలనిపించింది. కానీ, మిగతా ఎవరూ వాణ్ణి గురించి పట్టించుకున్నట్లే లేదు... కందకు లేని దురద కత్తిపీటకా? అయినా నా దగ్గర ఏమున్నయ్యని పోతయ్యని భయపడటానికి?

కంపార్టుమెంట్ ఆ చివరనుంచి ఈచివరి వరకు ఊడ్చి వచ్చి... లేచి నిలబడి అందరికీ నమస్కారం చేసి, "అయ్యా, అమ్మా... తల్లిదండ్రులు లేని అనాథను... మూడు రోజులనుంచీ అన్నం లేదు...ధర్మం చేయండి బాబూ." అని అందర్నీ అడగడం మొదలు పెట్టాడు.

నా మనసు చివుక్కుమన్నది. వీడు దొంగ మోసగాడు కాడన్నమాట... ఆలోచించకుండా తొందరపడి ఒక నిర్ణయానికి రావటం... అంతకన్నా బుద్ధితక్కువ పని మరొకటి లేదనుకున్నాను. ఇప్పుడు చూస్తుంటే... మా కంపార్ట్‌మెంట్ ఎంతో శుభ్రంగా వుంది. ఆ కుర్రవాడు కష్టపడి ప్రతిఫలం అడుగుతున్నాడు. తల్లిదండ్రులు లేరట, మూడు రోజులైందిట తిండిలేక! అతణ్ణి చూస్తుంటే ఏమిటో జాలి, సానుభూతి... నేనేమిటి నాలాగే అందరూ చూశారు అతడివైపు.

ప్రత్యేకత ఏమిటంటే నేను చూస్తుండగా ఒక్కళ్ళూ ఓ పది పైసలు అతడికి వేసిన పాపాన పోలేదు. ఆఖరికి చిల్లరలేని కారణంగా నేనూ అతడికి ఏమీ ఇవ్వలేకపోయాను.

మూడు రోజులుగా తిండి లేకపోయినా శారీరకంగా కష్టపడ్డాడు. కానీ, ఏమీ గిట్టుబాటు కాలేదు. ప్రక్కగా వెళ్లి దిగులుగా నిలబడిన అతణ్ణి చూస్తుంటే-నా మనసులో ఏమిటో అలజడి మొదలైంది. వాస్తవంగా ఆలోచిస్తే ఈ లోకంలో మంచితనానికి, నిజాయితీకి బొత్తిగా విలువ లేకుండా పోయిందేమో అనిపిస్తోంది. మనిషి సుఖంగా బ్రతకటానికి మోసం, దౌర్జన్యం తప్ప వేరు మార్గం లేనట్లే తోస్తోంది. యదార్థానికి ఆ కుర్రవాడు కంపార్టుమెంట్ ఆ చివర్నుంచి



## ఒకే జాతి పక్షులు

ఈ చివరికి ఊడ్చే కాకుండా ఏ కుంటివాడిగానో, గుడ్డివాడిగానో నటించినట్లయితే ఏంతో కొంత గిట్టుబాటయ్యేది. గప్‌చిప్‌గా ఎవరి జేబునో కత్తిరించినట్లయితే చేతినిండా డబ్బు... అయితే అతడు అలా చేయడు, చేయలేడు. కారణం— ఈ లోకంలో కొందరు అమాయకులలానే వాడూ మంచినీ,మనసునూ నమ్ముకున్నవాడు. అందుకే బ్రతకలేనివాడు.

మా కంపార్టుమెంటులో వచ్చిపోయిన తన ఆశలను తిరిగి పునర్నిర్మించుకోనే వ్యర్థ ప్రయత్నంలో పడ్డాడు గామలు— ప్రక్క కంపార్టుమెంటులోకి వెళ్ళాడు ఆ కుర్రవాడు.

అతడు వెళ్లిన దిక్కే కాసేపు చూసి తిరిగి నన్ను గురించి నేను ఆలోచించుకోవటం మొదలు పెట్టాను.

* * *

అనుకున్న ప్రకారమే మర్నాడు ఉదయం పదకొండు గంటల ప్రాంతంలో నేను ఆఫీసరు గార్ని కలుసుకోగలిగాను, ఖైరతాబాద్‌లోని వాళ్ళ ఆఫీసులో. ఎందుకంటే ఆయన ఇంటి అడ్రసు నాకు తెలియదు. అదృష్టం బాగుండబట్టి శలవు పెట్టటంగాని, టూర్‌కు వెళ్ళటంగాని చేయలేదు.

"విశ్వం, నువ్వా!... రావోయ్... రా... రా..." చూసి సాదరంగా లోపలికి పిలిచారు నన్ను. ఆ సమయంలో నా ఆనందానికి పట్టపగ్గాలేలేవు. తర్వాత, "ఏం చేస్తున్నావ్, ఎక్కడుంటున్నావ్?" అంటూ కుశల ప్రశ్నలు వేశారు. చివరికి, "ఏ పని అయినా సిన్సియర్‌గా చేసే నీకు ఉద్యోగం ఇంతవరకు దొరకలేదా!...ఓనమాలు రాని వాళ్ళు సైతం ఇట్టే ఉద్యోగాలు సంపాదించేస్తున్నారు?...ఉద్యోగం రాకపోవటం నీ బ్యాడ్‌లక్కే కాదు విశ్వం, ఈ దేశం దౌర్భాగ్యం కూడానోయ్"— అంటూ తన సానుభూతి తెలిపారు.

ఆఫీసరుగారే అలా మాట్లాడటంతో నాకెంతో గుండెధైర్యం వచ్చింది. వెంటనే నేను వచ్చిన పనేమిటో బయట పెట్టేశాను, అదే అదునుగా భావించి.

నేను చెప్పింది విన్న ఆఫీసరుగారి ముఖ కవళికలు చటుక్కున మారిపోయాయి.

"సారీ విశ్వం! మా డిపార్టుమెంట్‌లో— ఇన్ని రోజులుగా నువ్వు ఉచితార్థంగా పని చేస్తున్న ఆఫీసులోనే— ఉద్యోగం ఖాళీవచ్చిన మాట నిజమే. కానీ, అది ఎప్పుడో రిజర్వ్ అయిపోయింది ... మీ జిల్లా మినిష్టరుగారి రికమండేషన్ ఎవరో ముందే పట్టేశాడు ... ఇక, ఇంటర్వ్యూ భాగోతాలను గురించి నీకు తెలియందేముంది? షరా మామూలుగా జరిగిపోతయ్. ఒక్క నిజం చెప్పనా విశ్వం, న్యాయం, ధర్మం అంటూ మడి కట్టుకొని కూర్చోంటే పనులు కావయ్యా ఈ కాలంలో ...ఏ రాజకీయ నాయకుడినో పట్టుకోవాలి. అంతో ఇంతో సమర్పించుకోవాలి. అనుకున్నది సాధించాలి. ఏదో పెద్ద హోదాలో ఉన్నాను కదా అని కొండంత ఆశ పెట్టుకొని నా దగ్గిరికి వచ్చావ్ ... కాని, నేనేమీ చెయ్యగలిగే స్థితిలోలేను ప్రస్తుతం..."

—ఆఫీసరుగారు ఇంకా ఏమో చెబుతూనే ఉన్నారు. కానీ, నేనే ఆయన మాటలు వినలేక బయటికి వచ్చేశాను.

నాకే ఆర్థిక స్తోమత్తు ఉండి ఉంటే పోస్టు గ్రాడ్యుయేషన్ చేసే వాడిననీ, ఏ రాజకీయ నాయకుడి పలుకుబడో ఉంటే ఇంత కాలంపాటు ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసు చుట్టూ పిచ్చికుక్కలా తిరిగేవాణ్ణి కాననీ ఆఫీసరు గారికి తెలియదా? తెలుసు ... కేవలం తాను తప్పించుకోవటం కోసం ఏదో హితబోధ చేశారు. అంతే.

గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో విజయవాడ తిరిగివస్తుండగా నాకు రాత్రి ఆ కుర్రవాడు గుర్తువచ్చాడు.

నేను అతడంటే జాలిపడ్డాను, సానుభూతి వ్యక్తం చేశాను. కానీ, పైసా కూడా దానం చేయలేకపోయాను, చిల్లరలేని కారణంగా ... తర్వాత అతడు నీతి, న్యాయం వదులుకుంటే తప్ప ఈ లోకంలో హాయిగా బ్రతకలేడని అనుకున్నాను.

అలాగే ... నా గురించి ఆఫీసరుగారు ... ఆవేదన వ్యక్తం చేసి తన నిస్సహాయతను తెలిపారు. లంచాలు మేపి, ఇన్‌ఫ్లూయన్స్ చేయించితేగాని ఈ కాలంలో ఉద్యోగం దొరకదని సలహా యిచ్చారు.

ఆ కుర్రవాడి విషయంలో నేను. నా విషయంలో ఆఫీసరుగారు — మా ఆలోచనలు ఒకటే...

రాత్రి కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లో కుర్రవాడు కనిపిస్తాడేమోనని చూశాను ... ఎందుకంటే మేమిద్దరం నీతిని, న్యాయాన్ని నమ్ముకున్న వాళ్ళం—అంతకుమించి బ్రతకలేనివాళ్ళం.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

# వారఫలం

## 9-4-1982 శుక్రవారం మొదలు 15-4-1982 గురువారం వరకు

★మేషం:—సూర్యగమనం మీకు ఈ వారం శ్రేయోదాయకం. అలవాటు ప్రకారం చేసే పనులలో ఇబ్బంది రాకుండా చూచుకోవాలి. రావలసిన బాకీలు చాలా ఉన్నాయి గదా! వసూలు చేసుకోటం ఎంతైనా మేలు. స్త్రీలకు : గౌరవం, ఆదాయం క్రీడావనిలో అవకాశం లభ్యం.

★వృషభం—ఉత్తమమైన వారం. పదిమందిలో గౌరవం సంభవం. ఉత్తమ కళాకారులకు సదవకాశాలుండగలవు. పదిమందిలో మీకు పెంపు కనిపించే అవకాశం గలవారం. ఒకానొక విషయంలో మీకు వారాంతంలో మేలు చేకూరగల వారమే. స్త్రీలకు: సుఖశాంతులుండగలవు. వృత్తిలో అభివృద్ధిసూచక వారమే.

★మిథునం : ఆదాయం, అభివృద్ధి, అధికారాభివృద్ధి, క్రీడావనిలో మేలు, రాజకీయంగా అభివృద్ధికి పోయే మార్గం గల వారం. మీ సహాయం అర్థించే బంధు వర్గీయులున్నారు. వారికి మేలు చేయుటం న్యాయమే. మరలా మేలుపొందే అవకాశం కూడా లేక పోలేదు. స్త్రీలకు అప్రయత్న ధనలబ్ధి, రాజకీయంగా మేలు జరగటం చెప్పుకోవాలి.

★కర్కాటకం: దూరాలోచనతో అనేకపనులు నెరవేరగలవు. రావలసిన ధనం చేతికందే మార్గమున్నది. మీ ఇంట శుభం జరిగే సూచన గలదు. వయసుబాలబాలికలకు, ఉత్తమరీతిగా శుభప్రస్తావనలుండగలవు. స్త్రీలకు : వృత్తిలో అభివృద్ధి, ఉద్యోగంలో ఏదో మార్పు కూడా సంభవమే.

★సింహం: కళాసాహిత్యరంగంలో మీకు సదవకాశాలుండగలవు. క్రీడావనిలో కొందరకు అవకాశాలుండగలవు. అనుకూలపరిస్థితులుండటమేగాక, వృత్తిలో ఉద్యోగంలో, కార్మిక రంగంలో అభివృద్ధిసూచక దినాలే. స్త్రీలకు: సాహిత్యరంగంలో అపూర్వావకాశాలు లభించే మార్గం ఉంటుంది. నూతన విషయసేకరణకు అవకాశంగల వారము.

★కన్య: దూర బంధువుల నుండి శుభవార్తలు వినగలిగే అవకాశముంటుంది. చాల మందికి రావలసిన ధనం ఈ వారం అందే మార్గముంటుంది. ఉపాధ్యాయవృత్తి, రచనా వ్యాసంగం ఫలించే అవకాశంగలవారం. స్త్రీలకు : నూతన మార్గాల ధనాదాయం, వృత్తియందు అభివృద్ధి గలవారం.

★తుల: అనుకోకుండా దూర బంధువులు ఇంటికి రాగలరు. చాల కాలంగా విడిపడిన మిత్రులు, హఠాత్తుగా ఇంటికిరాగలరని గ్రహించాలి. భూవిషయంలో, గృహ విషయంలో ఏవో పేచీలు రానున్నవని గ్రహించాలి. స్త్రీలకు: రచనా వ్యాసంగం ఫలించటం, ఆదాయం లభ్యం కావటం గమనించగలరు.

★వృశ్చికం : గ్రహానుకూల్యత వలన ధనలబ్ధికి, క్రొత్త వ్యాపారం ఏదైనా ప్రారంభించటానికి క్షేమమైనవారం. అవసరాలకు ధనం చిక్కుతుంది. మీ ఇంట శుభం జరిగే అవకాశమున్నది. స్త్రీలకు: విలువగల వస్తువులు కొనడం, ఉద్యోగం చేసేవారైతే 'ప్రమోషన్'కు అవకాశం లభించగలదు.

★ధనుస్సు : చాల దినాలుగా, మరీ చెప్పాలంటే వారాలుగా ఒకటిరెండు విషయాలు ఎటూ తేలలేదు. అందు మీద చికాకు చాలా జాస్తి కావటం గమనించనున్నారు. ఇంట్లో సంతానాన్ని గూర్చిన చింతకు చోటు గల వారం. అంతే కాకుండా వస్తువులు పోతాయేమో! జాగ్రత్త! స్త్రీలకు: నాల్గు విధాలా మేలైన వారమే.

★మకరం: చాల పనులు ఎటూ తెమలకున్నవి క్రమంగా ఒక రేవునకు రాగలవు. మీకు మంచి జరిగే సూచన ఉన్నది. పనుల తొందరలో, ఏది ముందు చేయాలో, ఏది వెనుకనో గ్రహించాలి. స్త్రీలకు: ఆదాయముంటుంది. బంధువులను కలిసికోవటం, కులాసాగా కాలక్షేపం చేయుటం జరుగుతుంది.

★కుంభం : దూర దేశాన్నుండి బంధువులు మీ ఇంటికి రానున్నారు. మీ పనులు నిరభ్యంతరంగా జరిగిపోయే అవకాశమున్నది. చాలాకాలంగా చేతికందని రొఖ్ఖం ఎలాగో అందే సూచన లేకపోలేదు. స్త్రీలకు వయసు వచ్చినవారికి శుభం జరగటానికి అన్నివిధాలా అనుకూలమే. క్రీడావనిలో కొందరకు అప్రయత్నంగా అవకాశాలుంటాయి.

★మీనం: చేసే పనిలో, వృత్తిలో, ఉద్యోగంలో, మీకు అభివృద్ధికరమైన వారమే. అడుగడుగునా అంతరాయాలు ఉండే ప్రమాదం లేదు గాని, తలచిన ఒకానొకవ్యాపారకార్యం మాత్రం జరిగే మార్గం లేదు. రాజకీయరంగాన పరిశ్రమించే వారికి, యత్నించే వారికి మేలు జరిగే మార్గం గలవారం. స్త్రీలకు వృత్తిలో అభివృద్ధి, ప్రయాణం చేయవలసి రావటం కూడా చెప్పదగిన అంశమే.

—విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# ఊహల ఉయ్యాల - 2

రంగుల బొమ్మల కథ

బాపు
































# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "శ్రీనాథ కవి సార్వభౌముడు" ఎన్. టి. ఆర్

"తెలుగు కళామతల్లికి గొప్ప సేవచేసిన శ్రీనాథ కవి సార్వభౌముడు చమత్కారి, దాత కూడానూ కళాత్మకంగా రూపొందే ఆ మహా కవి చిత్రాన్ని విజయదశమినాడు ప్రారంభిస్తాం," అన్నారు ప్రధాన పాత్ర ధరిస్తూ, దర్శకత్వం నెఱపే ఎన్. టి. ఆర్ సి నారాయణరెడ్డి మాటలు, పాటలు సమకూరుస్తున్నారు ఈ చిత్రంతోపాటు "పుణ్యదంపతులు" చిత్రం కూడా సెప్టెంబర్ నుంచి నవంబర్ వరకు ప్రతినెలా 1 నుంచి 15, 26 నుంచి నెలాఖరు వరకు హైద్రాబాద్‌లో చిత్రీకరణ జరుపుకుంటుంది

ఎన్ టి ఆర్ సినీ ఎంటర్‌ప్రైసెస్ 'చండశాసనుడు" చిత్రం మార్చి ర్‌న మొదలైంది

'అల్లుళ్లొస్తున్నారు' లో చంద్రమోహన్, స్మిత, చిరంజీవి మేనమామ, మేనల్లుడుగా ద్విపాత్రాభినయం చేసే ఎన్ టి. ఆర్ తోపాటు జగ్గయ్య, సత్యనారాయణ, రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్, శారద, జయమాలిని, కొత్తనటి రాధ పాల్గొంటున్నారు పరుచూరి గోపాలకృష్ణ కథ, మాటలు రాశారు సి నారాయణరెడ్డి గీతాలకు చక్రవర్తి స్వరకల్పన చేశారు నందమూరి మోహనకృష్ణ ఛాయాగ్రాహకుడు తొలి షెడ్యూల్ మార్చి 15 వరకు జరిగింది. రెండవ షెడ్యూల్ ఏప్రిల్ 1 నుంచి 20 వరకు అమలాపురం దగ్గరున్న లక్కవరంలో జరుగుతుంది మూడవ షెడ్యూల్ మే 1 నుంచి 20 వరకు హైద్రాబాద్‌లో జరుగుతుంది

"సింహం నవ్వింది" చిత్రం మార్చి 24న హైదరాబాద్‌లో సెట్స్‌కు వెళ్లింది బాలకృష్ణ సరసన కళారంజని అనే కొత్తనటి నాయిక నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్యతోపాటు ఓ సింహం కూడా పాల్గొంటుంది "చండశాసనుడు" చిత్ర సాంకేతిక నిపుణులే ఈ చిత్రానికి కూడా పని చేస్తారు ఈ చిత్రానికి ఓ బెంగాలీ కథ మాతృక యోగానంద్ దర్శకుడు

మే 28న ఎన్ టి ఆర్ షష్ట్యబ్ది సంవత్సరారంభంలో "పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి చరిత్ర" చిత్రం విడుదలవుతుంది

## విశ్వచిత్ర సినీ ఎంటర్‌ప్రైసెస్ చిత్రం

"ఫిబ్రవరి 28 నుంచి మార్చి 10 వరకు తొలి షెడ్యూల్ జరిగింది," అన్నారు పై సంస్థ చిత్రం గురించి డైరెక్టర్ ఎ కోదండరామిరెడ్డి ముచ్చటిస్తూ కృష్ణంరాజు, జయప్రద, మోహన్‌బాబు, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, హరిబాబు, పుష్పలత పాత్రధారులు సత్యానంద్ సంభాషణలకర్త చక్రవర్తి స్వరకల్పనలో ఆరుద్ర, వేటూరి గీతాలు రాశారు నవకాంత్ ఛాయ, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం, డి వెంకటరత్నం కూర్పు, కె నాగేశ్వరరావు ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు కోటేశ్వరరావు, కృష్ణమోహన్‌రెడ్డి సహకార దర్శకత్వంతో ఎం రవిశేఖర్‌రాజు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు "ఏప్రిల్, మే నెలల్లో 1–10 తేదీల మధ్య జరిగే షూటింగ్‌తో చిత్రం పూర్తవుతుంది,' అన్నారు నిర్మాత జి రామకృష్ణంరాజు



'కోరుకున్న మొగుడు' లో
జయసుధ, శోభన్‌బాబు

## పగబట్టిన సింహం

"లాయర్‌గా, ఉగ్రవాదిగా, పోలీస్ ఆఫీసర్‌గా కృష్ణ మూడు విభిన్నమైన యువతరం పాత్రలను అసమాన చాతుర్యంతో పోషించారు," అన్నారు ఎన్ వి సుబ్బరాజు ఈయన కథ, నిర్మాణ సారథ్యం, సమర్పణలో చంద్ర సినీ ఆర్ట్స్ "పగబట్టిన సింహం" చిత్రం మూడు షెడ్యూల్స్‌తో చిత్రీకరణ ముగిసింది "హొగెనకల్, ఏర్కాడ్‌లలో ఫైట్స్‌ను సరికొత్త పద్ధతుల్లో ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని, ఎంతో రిస్క్‌తో చిత్రీకరించాం హొగెనకల్‌లోని ఓ జలపాతంలో ఛేజింగ్ సంఘటనలను షూట్ చేస్తున్నప్పుడు కృష్ణ, సుబ్బరాజు, ఇతర ఆర్టిస్టులతో ఉన్న పడవ ప్రవాహానికి తట్టుకోలేక మునిగిపోబోతూండగా ఒడ్డున ఉన్న నేను కేకలెట్టడంతో కొందరు నీళ్ళలోకి దూకి ఆ పడవలోని వారందర్నీ సురక్షితంగా ఒడ్డుకు చేర్చడం జరిగింది ఔట్‌డోర్స్‌లో ఇలాంటి అపాయాలెన్నింటి నుంచో అదృష్టవశాత్తు బయటపడగలిగాం ప్రత్యేకంగా పేర్కొనవలసిన ఇబ్బంది ఏమిటంటే — మన రాష్ట్రంలో చిత్రీకరణ జరపడానికి మన రాష్ట్ర ప్రభుత్వం అనుమతి ఇవ్వడంలో చేసే జాప్యం ఓ వంక మన రాష్ట్రంలో చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి ఎంతో ప్రోత్సాహమిస్తు న్నట్టు నే మరో వంక ఇలా ఔట్‌డోర్ షూటింగ్‌లకు వెంటనే వీలు కలిగించకుండా తాత్సారం కలిగించడం వల్ల నిర్మాతలు ఎన్ని ఇబ్బందులకు గురి కావలసి వస్తుందో ప్రభుత్వం ఎప్పటికి గుర్తిస్తుందో? ఈ విషయంలో తమిళనాడు ప్రభుత్వాన్ని ఎంతైనా ప్రశంసించక తప్పదు హొగెనకల్, ఏర్కాడ్‌లలో షూటింగ్స్‌కు అధికారుల అనుమతి ఇట్టే లభించింది వారి సహాయ సహకారాలకు ఎంతైనా కృతజ్ఞులం," అన్నారు. ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే పి చంద్రశేఖరరెడ్డి జయప్రద, ప్రభ, గీత నాయికలు సత్యనారాయణ, నాగభూషణం, అల్లు రామలింగయ్య, ప్రసాద్‌బాబు, సారథి, గరగ, భీమరాజు, రమణమూర్తి, జగ్గారావు, సి హెచ్ కృష్ణమూర్తి, జ్యోతిలక్ష్మి, పుష్పలత ఇతర పాత్రధారులు మోదుకూరి జాన్సన్ సంభాషణలకర్త సత్యం సంగీతం, ఎస్ ఎస్ లాల్ ఛాయ, నాయని మహేశ్వరరావు కూర్పు, బి చలం శిల్పం, ధ్రువకుమార్ ప్రొడక్షన్ నిర్వహించారు రాధారెడ్డి, నాగేశ్వరరావు, నరసింహరాజు సహకార దర్శకులు "నెల్లూరు వాస్తవ్యులు, థియేటర్ యజమాని ఆనం గోపాలకృష్ణారెడ్డి నైజాం ప్రాంతంలో నూతనంగా నెలకొల్పిన శ్రీ వెంకట కృష్ణా ఫిలిమ్స్ పంపిణీ సంస్థ ద్వారా విడుదలయ్యే తొలి చిత్రం మా 'పగబట్టిన సింహం' అవడం మాకెంతో ఆనందదాయకం," అన్నారు ఈ చిత్ర నిర్మాత కలిదిండి విశ్వనాథరాజు

●●●●●●●●●●●●●●●●●●●●●●●●●●●●●

## "పట్నం మొగుడు — పల్లెటూరి పెళ్ళాం"గా "సంసారంలో సరాగాలు" చిత్రం పేరు మార్పిడి

"పట్నం యువకుడికి పల్లెటూరి అమాయకపు యువతి భార్యగావస్తే, ఆ సంసారంలో ఎలాంటి మలుపులు వస్తాయనే విచిత్రమైన కథాంశం అందుచేత 'పట్నం మొగుడు పల్లెటూరి పెళ్ళాం'గా నిర్ణయించాం," అన్నారు మహేంద్ర ఈయన మౌళి దర్శకత్వంలో నిర్మించే టి వి ఇంటర్నేషనల్ వారి పై చిత్రంలో ప్రతాప్‌పోతన్, ఉమ, పూర్ణిమ వగైరా నటవర్గం మాటలను వసంతకుమార్, పాటలను గోపి రాశారు శ్యామ్, ఎ ఎ రాజ్ సంగీత దర్శకులు శ్రీరామ్ ఛాయ, నాయని మహేశ్వరరావు కూర్పుతో రాజు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు

## విడుదలకు సిద్ధమవుతూన్న "భక్త ధ్రువ – మార్కండేయ"

"ఈ వంశీకి ఎంత ధైర్యమండీ! చెట్లు, గుట్టలు అన్నీ చకచకా ఎక్కేస్తుంది. విష సర్పాలతో నిర్భయంగా నటిస్తుంది. 'రత్నమాల' చిత్రీకరణ సమయంలో మా హర సన్నిలాగే పాముల మధ్య నటింపచేశారు కొండలెక్కించారు," అన్నారు భానుమతి రామకృష్ణ మందహాసంతో ధ్రువుడు (వంశీ) కాకులు దూరని కారడవుల్లో తపస్సు చేసే సన్నివేశాలను, ఆ తపస్సును భగ్నం చేయడానికి ఇంద్రుడు రాళ్ళవాన, అగ్నివర్షం కురిపించడం – వగైరా ట్రిక్ షాట్స్‌ను కె. ఎస్ ప్రసాద్ విస్మయం గొలిపే రీతిలో తీశారు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, సంగీత పర్యవేక్షణ, దర్శకత్వ భారాలు వహించే భానుమతి రామకృష్ణ ఈ సన్నివేశం గురించి వివరిస్తూ, "మార్కండేయుడు పదేళ్ళ వయస్సులో అకాల మృత్యువాత పడతాడని అతడి తల్లిదండ్రులు క్షోభ పడుతూన్న విషయం తెలిసి మార్కండేయుడు ఆవేశం చెందిన సమయంలో నారద మహర్షి వచ్చి, ధ్రువుని చరిత్రను మార్కండేయునికి వివరిస్తాడు," అన్నారు. ఈమె బాలలతో ఈ చిత్రాన్ని రూపొందిస్తున్నారన్న విషయం తెలిసి విఖ్యాత దర్శక నిర్మాత వి శాంతారాం ఈమెను ఎంతో అభినందిస్తూ ఓ లేఖ రాశారు. వంశీ, రోహిణి, శోభన, రాణి, సుధ, కవిత, వాణి, శ్యామల, హీరా, భాగ్యలక్ష్మి, బాబు, రవిశంకర్, సురేష్, మూర్తి, చంద్రశేఖర్, ఆనంద్ అత్యద్భుతంగా నటించిన ఈ భరణీ పిక్చర్స్ పౌరాణిక చిత్రం అన్ని తరగతుల ప్రేక్షకులనూ విశేషంగా ఆకర్షించి, గొప్ప సంచలనం కలిగిస్తుందని రష్‌న్ చూసిన పలువురు అభిప్రాయాలను వెలిబుచ్చారు. ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, కొసరాజు, వేటూరి, సీటూరి, శారదా అశోకవర్ధన్ గీతాలకు ఎస్. రాజేశ్వరరావు బాణీలు కూర్చారు పెండ్యాల వెంకటేశ్వరరావు సహకార దర్శకత్వం, ఆత్మా కూర్పు, గీత నృత్య దర్శకత్వం తెరవెనుక హంగులు.



"మీ అభిమాన నటుడెవరూ అవడిగాడు పెళ్ళికొడుకు చెప్పాను. అంతే! ఆ సంబంధం కుదరలేదు"



"ప్రేమ [illegible]" లో కీర్తి

## రేలంగి నరసింహారావు కొత్త చిత్రాలు

దాసరి దర్శక పర్యవేక్షణలో కాకర్ల కృష్ణ సమర్పకుడుగా యలవర్తి బాబూరావు నిర్మించే వీరరాణి పిక్చర్స్‌వారి చిత్రానికి కథ తయారౌతోంది

"ఏమండోయ్ శ్రీమతిగారు" అనంతరం చంద్రమోహన్ హీరోగా రాజలక్ష్మి కంబైన్స్ అధినేత యు. ఎస్ ఆర్ మోహనరావు మరో హాస్య చిత్రాన్ని ఏప్రిల్ 15న మొదలెడ్తారు

## మాధవిని అభినందించిన గవాస్కర్

"ఇటీవల మద్రాసు క్రికెట్ టెస్ట్‌లో పాల్గొనడానికి వచ్చిన సునీల్ గవాస్కర్‌ను ఒక పార్టీలో అనుకోకుండా కలుసుకోగలిగాను," అంది మాధవి. 'ఏక్ దుజేకేలియే''లో ఆమె నటనను గవాస్కర్ మెచ్చుకుంటూ, "నేను కూడా ఒక మరాఠీ చిత్రం, కొన్ని అడ్వర్టయిజ్‌మెంట్ షార్ట్స్‌లో నటించాను డబ్బింగ్ చెప్పేటప్పుడే నానా అవస్థలు పడవలసి వచ్చేది," అన్నాడట

## నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

పెవెన్‌హిల్ ఇంటర్నేషనల్ "పూలమందిరం", అన్నపూర్ణ పిక్చర్స్ ప్రైవేట్ లిమిటెడ్ "సన్నజాజి సంపెంగ", రేణుకా సినీ ఆర్ట్స్ "చెల్లెమ్మ", శ్రీ లలితా మూవీస్ "పాణిగ్రహణం", ఎ. వి. ఎం మురుగన్ అండ్ కో "మన ఊరి కృష్ణ", భవాని ఇంటర్నేషనల్ "కలెక్టర్ కృష్ణ", న్యూ ఇరా ఫిలిమ్స్ "డిస్కోనైట్ ఫీవర్", రమణ ఆర్ట్ ఫిలిమ్స్ "దొంగలొస్తున్నారు జాగ్రత్త", లక్ష్మీ ప్రకాష్ ప్రొడక్షన్స్ "గీతోపదేశం", సుందర్ ఆర్ట్ థియేటర్స్ "కాబోయే శ్రీమతి", ఉషశ్రీ ఫిలిమ్స్ "కలి రాజ్యం", డి వి ఎస్. ప్రొడక్షన్స్ "కుశలవ", వంశీకృష్ణ సినీ కంబైన్స్ "ప్రేమ కిరీటాలు", భవాని ఇంటర్నేషనల్ "శ్రీ సత్య నారాయణ వైభవం", సరోజినీదేవి ఆర్ట్స్ "త్రివేణీ సంగమం", స్నేహచిత్ర ప్రొడక్షన్స్ "భూదేవి", భానోదయా ఫిలిమ్స్ "దేవుని రూపాలు"

# "కేర్‌ఫ్రీ రక్షణ
# –దానిలా మరొకటి లేదిక!"



మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుని తయారుచేసారు కేర్‌ఫ్రీ. ఇబ్బందైన ఆ 5 రోజుల్లో ఆధునిక యువతికి కావలసిన శుభ్రత కూడిన ఆ సంరక్షణని యిస్తుంది.

మీకు అధిక రక్షణ యివ్వడానికి దీనిలో మరింతగా పీల్చుకునే గుణం.

కేర్‌ఫ్రీ శాస్త్రీయంగా రూపొందించబడినది. దీని లోపల భాగంలో గల మెత్తని పొరలు, ప్రత్యేకమైన రీతిలో పీల్చుకోగలిగే పదార్థంతో చేయబడ్డాయి. కేర్‌ఫ్రీ మీకు యిప్పటి దాకా వాడిన వాటి అన్నిటి కన్నా చెమ్మను నిలుపుకోగలుగుతూ, మీకు మరింతగా రక్షణని యిస్తుంది. అయినా యిది ఎంతో సన్నగా, సున్నితంగా, యిమిడికగా ఉంటుంది.

అద్వితీయమైన దీనికిగల ప్లాస్టిక్ కవచం మరకలు పడటాన్ని నిరోధిస్తుంది.

కేవలం కేర్‌ఫ్రీలోనే, క్రింది భాగం చుట్టూరా, నేప్‌కిన్‌కి



రెండు వైపులా గల 3. వైపుల గల నీలి ప్లాస్టిక్ కవచం మధ్యన అడ్డుగా నిలవడం కోసం ఉంది. అందుకే యిది తడిసి పోతుందని గాని, మరకలు పడుతుందని గాని భయం లేదు

ఎంతో సౌకర్యం, మరెంతో వీలు.

కేర్‌ఫ్రీ మీకు పూర్తిగా సౌకర్యాన్నిస్తుంది దీన్ని వాడటం, పారెయ్యడం ఎంతో తేలిక...దీన్ని ఫ్లష్ చేసెయ్యండి, అంతే. మార్చుకోవడం కూడా వీలు- మీరెప్పుడు మార్చవలసివచ్చినా మీకెంతో సౌకర్యం

అవును కేర్‌ఫ్రీతో మీరెంతో భద్రంగా, ఎంతో సౌకర్యంగా ఉంటారిక, అసలు నెలలో అది ఏ రోజూ అనే ధ్యాసే ఉండదు. మీరిక ఏం చెయ్యదలుచుకున్నా చేఫికరుగా చేయగలరు మరి...ఎందుకంటే మరేదీ యివ్వలేని రక్షణను యిస్తుంది కేర్‌ఫ్రీ!

ఇది 10 మరియు 20 నేప్‌కిన్స్ ప్యాక్‌ల్లో దొరుకుతుంది.




Johnson & Johnson*



## కేర్‌ఫ్రీ* – కాలం మారుతున్నయీ రోజుల్లో పూర్తి రక్షణ.



'మల్లె పందిరి'లో జ్యోతి, విజ్జిబాబు

## సినిమా

### మల్లె పందిరిలో వెంకు వైరాగ్యం

వెంకు (విజ్జిబాబు) డాబా మీద దీనంగా ఉన్నాడు. భార్య శ్యామల (జ్యోతి) బట్టలు ఆరేస్తోంది. వెంకు తన మనసులోని భయం, బాధ భార్య ముందు వెళ్లగక్కాడు. "మన చేతుల్లో ఏమీలేదు. ఆ దేవుడు నాకు అర్ధాయుష్షు పోశాడేమో! శ్యామూ, ఒకవేళ జరగరానిదేదైనా జరిగి, నేను జండా ఎత్తేస్తే —"

"ఛ, ఛ! పొద్దునే తీరిక్కూర్చొని ఏమిటండీ?" అంది శ్యామల.

"శ్యామూ! కీడెంచి మేలెంచుదాం. ఒకవేళ నేను టిక్కెట్టు తీసేసుకుంటే — నన్ను క్షమించు, శ్యామూ! ఆంధ్రా బాంకులో నా అక్కౌంట్‌లో పదకొండు రూపాయలున్నాయి. మా ఊళ్లో నా పేర రెండు కుంటల పొలముంది. పోతే — ఇంటి ఓనర్‌కి ఓ నెల అద్దె బాకీ – చిల్లర బాకీలన్నీ కలుపుకుంటే, ఆరొందల ఇరవై రూపాయలు పద్దు రాసే ఉంచాను"

"మీరూరుకోండి. మీరేం కంగారు పడకండి"

వెంకు ఆకాశం వంక చూస్తూ, "భగవంతుడా! నీకు నేను కావాలంటే నన్ను తీసుకెళ్లిపో! కాని, నా భార్య తాళిబొట్టును మాత్రం కాపాడు," అని సూర్యభగవానుణ్ని ప్రార్థించుకున్నాడు.

కాంతి పిలిమ్స్ "మల్లె పందిరి" చిత్రానికి జంధ్యాల రచయిత, దర్శకుడు.



'ఏసో ప్రస్థానం'లో ఒక దృశ్యం

### కమలహాసన్ ప్రేక్షకుడుగా

"బొంబాయి బాంద్రాలోని ఒక థియేటర్‌లో నేను 'ఏక్ దుజే కేలియే' చిత్రాన్ని మారువేషంలో టిక్కెట్ కొని, ప్రేక్షకుల మధ్య కూర్చొని చూశాను," అన్నారు కమలహాసన్. ఆయన పక్కన ఎవరో బొంబాయివాలా కూర్చున్నాడట. పిక్చర్ ఆరంభమై, తెరమీద తను కనబడగానే "ఎవరండీ ఆ హీరో? కొత్తవాడా?" అని కమల్ అమాయకం నటిస్తూ అడిగాడట. పక్కనున్న వ్యక్తి "అతగాడు కమలహాసన్ అని – ఏ వన్ నటుడు. యమస్పీడ్‌గా టాప్‌కి వచ్చేస్తున్నాడు," అని జవాబిచ్చాడట. "అమితాబ్‌బచ్చన్‌లా అవుతాడా?" అని కమల్ రెండో ప్రశ్న. బొంబాయివాలా విసుక్కుంటూ, "ఊర్కోవయ్యా - నీకేం తెలీదు. అమితాబ్ స్టయిల్ వేరు. ఇతగాడి స్టయిల్ వేరు," అన్నాడట. కమల్ అంతటితో ఊరుకోలేదు. "ఇంతకీ, ఇతను ఏ ప్రాంతంవాడు?" అని మళ్ళీ అడిగాడు. "మద్రాస్. ఐతే, ఇతగాడి తండ్రి పంజాబీ. అటు తల్లిది మద్రాసు," అని బొంబాయివాలా చెప్పేసరికి కమల్ నవ్వాపుకోడానికి నానా అవస్థ పడ్డాడట. "ఉష్! ఇక మాట్లాడకు. అలా చూడు - కమలహాసన్ ఎంత బాగా డాన్స్ చేస్తున్నాడో. చప్పట్లు కొట్టవయ్యా!" అని కమల్‌చేత కూడ చప్పట్లు కొట్టించాక "వెరీ గుడ్! నాతోపాటు నువ్వుకూడా కమలహాసన్ ఫాన్‌వి" అంటూ బొంబాయివాలా మురిసిపోయాడట కూడా. [ఇక్కడ అప్రస్తుతమైనా – ఒక విషయం. ఈజిప్టియన్ విదేశాంగ మంత్రి పేరు కమల్‌హాసన్ అలీ]

### శ్రీ క్రాంతి చిత్ర 4వ చిత్రం

మహిళల సమస్యలే ఇతివృత్తాలుగా, స్త్రీ కన్నీరే కథాంశంగా కనువిప్పు కల్గించే చిత్రాల నిర్మించే క్రాంతికుమార్ ఈ మారు కేవలం మాంగల్యధారణ, మంత్రాక్షతలే మనువు కాదని పెళ్ళి అనే మాటకు సరికొత్త నిర్వచనమిచ్చే చిత్రాన్ని నిర్మిస్తున్నారు. చిరంజీవి, రాధిక నాయక నాయికలు. సత్యానంద్, చక్రవర్తి, వెంకట్ భాస్కరరాజా, కృష్ణ తెరవెనుక కృషి చేస్తున్నారు. "ఫుల్ ఔట్‌డోర్ పిక్చర్. ఫిబ్రవరి 28 నుంచి మార్చి 15 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది. ఏప్రిల్ 1 నుంచి 15 వరకు జరిగే మలి షెడ్యూల్‌తో చిత్రం పూర్తవుతుంది," అన్నారు డైరెక్టర్ విజయభాస్కర్. ఈయన లోగడ ఒరియా భాషలో విజయవంతమైన "శ్రీ జగన్నాథ్" చిత్రానికి ప్రతిభావంతంగా దర్శకత్వం నెరపి ప్రశంసలందుకున్నారు.

### తరంగిణిలో చిరంజీవి, గొల్లపూడి

ప్రతాప్ ఆర్ట్స్ అధినేత కె. రాఘవ "ఇంట్లో రామయ్య–వీధిలో కృష్ణయ్య" చిత్రానికి అప్పగించిన దర్శకత్వ బాధ్యతను కోడి రామకృష్ణ చక్కగా నిర్వహించాడు. అంచేత తదుపరి 'తరంగిణి' చిత్రాన్ని కూడా అతనికే ఇస్తున్నాను. చిరంజీవి, గొల్లపూడి, జె. వి. రాఘవులు, సి. నారాయణరెడ్డి కూడా ఈ కొత్త చిత్రంలో పనిచేస్తారు," అని తెలియజేశారు.

'పెదబాబు'లో లక్ష్మీకళ

## సినిమా

### పెదబాబు

"ప్రేమకు కులాలు, మతాలు, ఆచారాలు, కట్టుబాట్లు లేవు — అనే ప్రాతిపదికమీద నేను అనేక మలుపులతో రాసిన కథకు మా కామాక్షితాయ్ పిక్చర్స్ యూనిట్ స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వ బాధ్యతలు వహించింది తడ ప్రాంతంలో ఔట్‌డోర్‌లో పూర్తిగా చిత్రీకరించాం మార్చి నెలాఖరులోగా రీరికార్డింగ్, మిక్సింగ్ అన్నీ పూర్తి చేసి, ఏప్రిల్‌లో విడుదల చేయాలనుకుంటున్నాం," అన్నారు నిర్మాత బి కె మోహన్ "పెదబాబు" చిత్రంలో లక్ష్మీకళ, కృష్ణమోహన్ నూతన నాయికా నాయకులు ప్రసాద్‌బాబు, గంగ, డాక్టర్ శివప్రసాద్ పొట్టి వీరయ్య, పి కె రెడ్డి, శ్రీలక్ష్మి, శ్రీలేఖ, సుమంగళి, గిరిజారాణి, జానకి, ఓ గంభీర మైన పాత్రలో జగ్గయ్య కనిపిస్తారు సత్యం స్వరకల్పనలో పి నారాయణరెడ్డి గీతాలు రాశారు. విజయ్ ఛాయ, రంగారావు శిల్పం, సి హెచ్. వెంకటేశ్వరరావు కూర్పుతో బయ్యపు రంగారెడ్డి నిర్వహణ బాధ్యతలు వహించారు గణపం రాజారాం రెడ్డి సహ నిర్మాత.

### న్యాయ నిర్ణయం

'ప్రతిచోట జరిగే అక్రమాలకు అద్దం పట్టి చూపించే ఇతివృత్తం అనువుగా ఉన్న 'న్యాయ నిర్ణయం' టైటిల్‌ను నిర్ణయించాం," అన్నారు కేదారి సూరిబాబు ఈయన రచన, దర్శకత్వ బాధ్యతలు వహించే జనరంజని ఆర్ట్స్‌వారి ఈ చిత్రంలో మురళీమోహన్, రాధిక, నూతన్ ప్రసాద్, హేమసుందర్, రాళ్ళపల్లి, మాడా, సుభాషిణి ముఖ్య భూమికలు ధరిస్తారు ఆత్రేయ, గోపి, కేదారి రాసిన ఐదు గీతాలు చక్రవర్తి స్వరకల్పనలో రికార్డయ్యాయి సెల్వం ఛాయాగ్రాహకుడు ఏప్రిల్ 20న గుంటూరులో షూటింగ్ మొదలై, నాగార్జునసాగర్, విజయవాడ ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుందని నిర్మాతలు టి రామారావు, కె నాగరాజా తెలిపారు జి రమేష్‌బాబు సహ నిర్మాత

'కలహాల కాపురం'లో సరిత



### అమితాబ్‌కు అపూర్వమైన అవకాశం

నిరుడు డిసెంబర్‌లో గోవా నుంచి ఢిల్లీ వెళ్ళే రాజీవ్‌గాంధీ బొంబాయి విమానాశ్రయంలో రెండు గంటలకు పైగా ఆగవలసి వచ్చింది - అక్కడ్నుంచి ఢిల్లీ బయలుదేరే విమానం లేటవడం వల్ల ఈ విషయం అమితాబ్‌బచ్చన్‌కు తెలియగానే ఏకాయెకీన విమానాశ్రయానికి వెళ్ళి, అందరూ 'ఛోటా సాహెబ్'గా ముద్దుగా పిలిచే రాజీవ్‌గాంధీని తన గృహానికి తీసుకెళ్ళి, తేనీటి విందు ఇచ్చాడట సరాసరి విమానం దగ్గరికి కారును తీసుకెళ్ళేందుకు ఇతరులెవ్వరికీ అనుమతి ఉండదు కాని, ఛోటా సాహెబ్ కోసం అమితాబ్‌బచ్చన్‌కు మాత్రం ఆ అవకాశం కలిగిందట

### హిందీ నటుడు ఫెరోజ్‌ఖాన్‌కు కోర్టు సమన్

కోయంబత్తూరులో ఇటీవల జరిగిన "ఖుర్బానీ" హిందీ చిత్రం విజయోత్సవంలో ఫెరోజ్‌ఖాన్, జీనత్ అమన్‌లు హాజరవుతారని థియేటర్ యజమాని బహుళ ప్రచారం చేశాడు కాని ఆ నటీనటులు రాకపోవడంతో సుందరరాజ్ అనే ప్రేక్షకుడు ఆగ్రహం చెంది, పోలీసులకు ఫిర్యాదు చేశాడు ఆ థియేటర్ యజమాని మీద కేసు పెట్టడం జరిగింది ఫిబ్రవరి 10న ఈ కేసు స్థానిక జ్యుడిషియల్ మేజిస్ట్రేటు సమక్షంలో విచారణకు వచ్చింది ఫెరోజ్‌ఖాన్ ఆ కోర్టులో హాజరవ్వాలని సమన్ పంపబడింది ★

తోట సుబ్బారావు సమర్పించు

నరనారాయణ కంబైన్స్

# డాక్టర్ సినీయాక్టర్

స్క్రీన్ ప్లే దర్శకత్వం

విజయనిర్మల

నిర్మాతలు

కె. శ్రీరామచంద్రమూర్తి

కె.ఎల్.నరసింహులు

VEEKAY

---

వై. కన్నయ్య సమర్పించు

రమణ ఆర్ట్ ఫిలింస్

# దొంగలున్నారు జాగ్రత్త

దర్శకత్వం: ఆర్.త్యాగరాజన్ B.Sc.

నిర్మాత: వై.వి.రమణమ్మ

మాటలు: వసంత్‌కుమార్ పాటలు: వేటూరి

సంగీతం: శంకర్ గణేష్, వి.వి.రాజ్




(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ - 6 :** ఢిల్లీ కాన్ఫరెన్స్‌కని వెళ్ళిన శివప్రసాద్ అక్కడికి వెళ్ళకుండానే తన ఫ్రెండ్ శరత్‌బాబుతో తిరిగొచ్చిన భర్తను చూసి ఆశ్చర్యపోతుంది సుజాత. తను కాన్ఫరెన్సుకు వెళ్ళి తిరిగొచ్చే వరకు శరత్ ఇక్కడే వుంటాడని చెప్తే ఏం చెప్పాలో తోచక ఆలోచన్లో పడిపోతుంది. ప్రసాద్ ఢిల్లీ వెళ్ళకపోవడానికి గల కారణమేమిటో చెప్పకపోవడంతో, ఏమేమో వూహించుకొంటుంటుంది నిద్రపట్టక వెర్రి ఆలోచనలను చేస్తున్న సుజాతతో కాంపోజ్ టాబ్లెట్ మింగించి నిద్రపుచ్చుతాడు శరత్ ఇంట్లో జరిగిన కొన్ని సంఘటనలవల్ల న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్స్‌ను కూడా శరత్‌బాబే పేల్చి వేశాడన్న అనుమానంతో అతన్ని పోలీసులకి పట్టివ్వాలని నిర్ణయించుకొంటుంది. తను వేసుకున్న ప్లాన్ అడ్డం తిరగటంతో చేసేదిలేక తన స్నేహితురాలు సునీత రాకకోసం ఎదురు చూస్తుంటుంది. పరిచయాలయ్యాక సునీతను తన గదిలోకి తీసుకువెళ్తుంది సుజాత.

సునీత గాభరా పడింది.

ఆయోమయంగా సుజాతకేసి చూసింది.

ఆత్రుతగా చూసింది.

ఉత్కంఠతో చూసింది.

"ఏమిటే అలా ఉన్నావ్? డాక్టర్‌కు చూపించుకున్నావా ?" ఆత్రుతతో అడిగింది సునీత.

"డాక్టరా ? నా కెందుకే ? నా ఆరోగ్యం బాగానే ఉంది."

"ఏం బాగుండటమే సుజీ ! నీ ముఖం చూస్తే తెలియడంలా ? అద్దంలో సరిగా చూసుకో ఎంత మారిపోయావో తెలుస్తుంది. ఎనిమిక్ పేషెంటులా ఆ రెప్పల కింద చారలేమిటి? ఇంతకూ ఎన్నో నెల ?"

"అబ్బే అదేంలేదే సునీ !"

"అయితే రియల్లీ సమ్‌థింగ్ ఈజ్ రాంగ్ విత్ యూ !"

"సంథింగ్ ఏం ఖర్మ ! అంతా గొడవగానే ఉందే ఈ ఇంట్లో. ప్రాణాలు బిగబట్టుకొని నీ కోసం చూస్తున్నానే తల్లీ !"

"మీ ఆయన చాలా మంచివారనుకున్నాను సుజీ !"

"ఆయన కాదే. ఇప్పుడు అక్కడ కూర్చున్నాడే అతడు శనిలా దాపరించాడు ఈ కొంపకు."

"ఎవరూ ? డాక్టరుగారా ?"

"ఏం డాక్టరే ? అసలు డాక్టరు కాదు."

"అంటే ?"

"న్యూక్లియర్ సైన్సులో డాక్టరేట్ తీసుకున్నాడట"

"ఓ ! ఐసీ ! అయితే ఇప్పుడు నీ కొచ్చిన ఇబ్బంది ఏమిటే ?"

"జాగ్రత్తగా విను. మీ ఆయనకు చెప్పి తెల్లవారేసరికి ఆయనను అరెస్టు చేయించాలి"

"అరెస్టా ?" ఆశ్చర్యపోయింది సునీత

"పెద్దగా అరవకే తల్లీ ! వింటాడు అతనివి పాము చెవులు" గొంతు తగ్గించి నొక్కి నొక్కి అన్నది సుజాత

"అసలు ఇంతకూ ఏమైంది ?"

"రాత్రి పిల్లిని చంపాడు !"

సునీత బిత్తరపోయింది.

స్నేహితురాలి కళ్ళలోకి అయోమయంగా చూసింది.

"ఏమిటే నువ్వంటున్నది ?"

"అదేనే పిల్లిని చంపాడు. పిల్లిని ?"

"అయితే నువ్వెళ్ళి ఆ చచ్చిన పిల్లి తల గొంగవే సరిపోతుంది."

'సునీ ! వేళాకోళానికి ఇది సమయం కాదు సరిగా విను నేను పెద్ద ఆపదలో ఉన్నాను అతను నా గొంతు నులిమి చంపినా చంపొచ్చును."

సునీతకు వెన్నెముకలో ఏదో జరజర పాకినట్లు అయింది.

సుజాత కళ్ళల్లో పరుగులు తీస్తున్న చీకటి నీడల్ని చూసింది. సునీతకు ఏదో గుబులు పుట్టుకొచ్చింది.

"సుజీ ! నీ కెందుకే భయం ? నేను ఉన్నా ! మా ఆయన ఉన్నారు కావాలంటే ఈ రాత్రి మాతో వచ్చెయ్. గాభరాపడకు. జరిగిందేదో సరిగా గుర్తు చేసుకొని చెప్పు. ఈ, మీ వారి స్నేహితుడు పిల్లిని చంపడానికే ఇక్కడకు వచ్చాడంటే బుర్ర ఉన్న వాడెవడూ నమ్మడు. అతనిమీద నీకున్న అనుమానం ఏమిటో సరిగా చెప్పు !" సునీత సుజాత చుట్టూ చేతులువేసి అనునయంగా అడిగింది

"సుజీ! సుజీ!" ప్రసాదు బయటనుంచి తలుపులు కొట్టాడు.

సుజాత తలుపులు తెరిచింది.

ఎదురుగా నిలబడి ఉన్న భర్తను చూసింది.

"ఏమిటి స్నేహితురాళ్ళిద్దరూ కబుర్లలో పడిపోయారు ? ఇంతకూ మాకేమైనా టిఫిన్, టీ, ఇచ్చేది ఉందా ?" అన్నాడు ప్రసాదు.

"ఐదు నిముషాల్లో తయారుచేస్తాను. మీరు వెళ్ళి మాట్లాడుతూ ఉండండి. రావే సునీ !" అంటూ సుజాత, సునీతను వెంటబెట్టుకొని వంటింటి వైపుకు నడిచింది.

## 8

ఖాళీ కప్పు ముందున్న టీపాయ్ మీద పెట్టి మూర్తి టైం చూసుకున్నాడు.

"ఏం ? అప్పుడే టైం చూస్తున్నారు ? ఇంకెక్కడికైనా వెళ్ళాలా ? భోజనం చేసి వెళ్ళొచ్చుగా ?" అన్నది సుజాత మూర్తితో.

"ఈ రోజు మా క్లబ్‌లో డిన్నరుంది. మరోసారి వస్తాం లెండి" అన్నాడు మూర్తి.

సుజాత, సునీత ముఖంలోకి నిస్పృహాయంగా చూసింది.

"ఇప్పుడు ఆరుంబావే అయింది డిన్నర్ తొమ్మిదింటికి కదండీ ?" అన్నది సునీత భర్తను మందలిస్తున్నట్టు.

"ప్రాంతీయ వార్తలువచ్చే టైం అయిందేమో నని టైం చూశానోయ్. నాలుగు గంటలకు ఇచ్చిన న్యూస్ ఇప్పుడు రావచ్చు !"

"అంత ముఖ్యమైన వార్తలేమైనా ఉన్నాయా ఈ రోజు ?" అడిగాడు శరత్‌బాబు.

"అంత ముఖ్యం కాదనుకోండి ! నిన్నరాత్రి న్యూక్లియర్ లాబ్‌లో అగ్ని ప్రమాదం జరిగింది ఆ ఇన్వెస్టిగేషన్ నేనే చేశాను."

"ఓ ఐసీ ! ఏమైంది ? వాట్ ఈజ్ ద రీజన్ ?" అడిగాడు శరత్‌బాబు.

సుజాత శరత్‌బాబుకేసి చూసింది.

ఆమె గుండెలు గుబగుబలాడాయి.

"సెబటేజ్ జరిగింది కదూ ?" మూర్తికేసి తిరిగి గబుక్కున అనేసింది సుజాత

"ముందు మేమూ అలాగే అనుకున్నాం. కాని- కాదు" మూర్తి తల అడ్డంగా తిప్పుతూ అన్నాడు

ఈలోపల ట్రాన్సిస్టర్ ఆన్‌చేసి పట్టుకొచ్చాడు ప్రసాదు.

అప్పటికే వార్తలు మొదలైనాయి

మూర్తి మాటల్ని మధ్యలో ఆపి వార్తలు వినసాగాడు

"గత రాత్రి అణు పరిశోధనా సంస్థ పరిశోధనాలయంలో జరిగిన ప్రేలుడు, విద్యుత్ సరఫరా లోపం వల్లనే జరిగిందనీ — అంతేకాని - అది ఏ రకమైన విధ్వంసక చర్యకాదనీ — విచారణలో తేలినట్టు మా విలేఖరి తెలియజేస్తున్నాడు

ప్రేలుడు సామాగ్రి నిపుణుడు శ్రీ సి. వి రావూ, విద్యుత్‌శాఖ ఛీఫ్ ఇంజనీరు శ్రీ నాగన్నగారూ, పోలీసుశాఖ డిప్యూటీ కమిషనర్ శ్రీ పి వి. కె మూర్తి విచారణ జరిపి, ఇలా తమ అభిప్రాయాన్ని

## సహగమనంకన్నా క్రూరమైన ఆచారం

# జౌహారు

విన్నకోట సుశీలాదేవి

జౌహారు రాజ కుటుంబ స్త్రీలకు సంబంధించిన సమస్య! సహగమనం ఎంత క్రూరమైన ఆచారామో అందరికీ తెలుసు! ఈ జౌహారు కూడా అంతటి క్రూరమైన ఆచారం! కానీ ఇది సహగమన మంత ప్రాముఖ్యాన్నీ, ప్రచారాన్నీ పొందలేదు. అయినా ఒకప్పుడు కొన్ని కొన్ని ప్రాంతాలలో ఎక్కువగానే వుండేది

జౌహారు, సహగమనం — ఈ రెండూ దురాచారాలు ఒక నాణేనికి వుండే రెండు ముఖాల లాటివి!

సహగమనం భర్త చనిపోయాక జరిగేది!

జౌహారు భర్త మరణానికి ముందు జరిగేది! చనిపోయిన భర్తతో చావని భార్యను చంపేది సహగమనం! భర్త తాను చచ్చిపోతాననే భయంతో ముందు భార్యను చంపేది జౌహారు

శత్రువుల చేతిలో తాను చనిపోయే అవకాశ మున్నదని భర్త అనుకున్నప్పుడు భార్యని అగ్నిలో దూకించేవాడు!

సహగమనం దేశీయమైన ఆచారం! జౌహారు విదేశీయమైనది!

"రసపుత్రులలో గల జౌహారుని అనుకరిస్తూ ముస్లిము యుగములో, ముస్లిము సర్దారులు, యుద్ధ సమయాల్లో ముందుగా జనానా స్త్రీలను వధించేవారు!" అని ఒక చరిత్రకారుడు వ్రాశాడు అంటే ఈ ఆచారం రాజపుత్రులతో ప్రారంభ మైందన్నమాట!




ఈ రాజపుత్రులు విదేశీయులు! భారతదేశం మీదికి దండెత్తి వచ్చి ఇక్కడ స్థిరపడిపోయిన సిథియన్, పహ్లవ, ఘూర్జర, హూణ మొదలైన జాతుల సంతతివారు.

ఈ విదేశీయ జాతులు, దేశీయులైన పర్వతారణ్య జాతులతో వివాహ సంబంధాలు జరుపుకుని క్రమంగా హిందూమతాన్ని అవలంభించి భారతీయులు కావడంతో ఈ కొత్త తెగ ఏర్పడింది.

ఈ జాతుల్లో యూరోపియను రక్తం సగం; మంగోలియను రక్తం సగం వుంది. వీరు యుద్ధ వీరులు. శత్రువుల రక్తం తాగి దానితో దాహం తీర్చుకునే క్రూరులు! వీరి దృష్టిలో స్త్రీ ఒక భోగ్య వస్తువు!

రసపుత్రులలోని ఆచారాలు కూడా విదేశీయ మైనవి! అందులో జౌహారు ఒకటి! వీరు తాము చనిపోయేముందు తమ భార్యని చంపేవారు!

విజయనగర చరిత్ర వ్రాసిన 'స్యూయిజ్' విజయనగర యుగంలో తెలుగువారిలో సహగమనం వుందని చెప్పాడేకానీ జౌహారు వున్నట్టు వ్రాయలేదు!

కానీ 1757 సం.లో ఆంధ్రదేశ చరిత్ర ప్రసిద్ధిచెందిన బొబ్బిలి యుద్ధం జరిగింది. బొబ్బిలి కోట నాశనమైంది. రాజయిన రంగారావు, ఇతర వీరులు మరణించడానికి ముందు అంతఃపుర స్త్రీలందరూ అగ్నిప్రవేశం చేశారు.

అయితే ఈ జౌహార్ భర్త ప్రేరణవల్ల జరగ లేదు. భార్యలు తమంతట తాము, పాతివ్రత్యాన్ని నిరూపించుకోడానికి అలా చేశారని కొందరు వాదించారు.

కానీ అది నిజం కాదు!

ఆ పురుషులు, తమ దౌర్బల్యానికీ, అవివేకానికీ, క్రూరత్వానికీ అమాయకులైన భార్యలను బలిచేశారు

బొబ్బిలి యుద్ధ కథనే పరిశీలిస్తే ఈ విషయం బోధపడుతుంది.

అసలు బొబ్బిలి రాజా యుద్ధానికి ముందే తామందరూ మరణిస్తారని ఎలా వూహించగలిగాడు! ఒకవేళ కొందరు వీరులు బ్రతికితే అగ్నికి ఆహుతైన వాళ్ల భార్యలు తిరిగివస్తారా? బహుశ మళ్లీ పెళ్లి చేసుకోవచ్చనే ధైర్యమేమో!

సాధారణంగా రాజు తనకి చావు నిశ్చయమైతే అవతలి రాజాతో సంధి చేసుకుని, ఆ తర్వాత శత్రువు బలహీనమయ్యాక తిరిగి దండెత్తుతాడు.

వెలమ వీరులు ఈ యుద్ధనీతిని అవలంభించ లేదు.

బొబ్బిలి వీరులని మనం గొప్పగా ప్రశంసిస్తాం గానీ వీళ్లు ఎంతో మూర్ఖులు, అవివేకులు! బొబ్బిలి పులిగా పేరు పొందిన పాపారాయుడు విజయనగర సైన్యాన్ని మధ్యదారిలో ముట్టడించాలని రాజమండ్రి దగ్గర కూర్చుంటాడు. ఫ్రెంచివారు ఈ విషయం తెలుసుకుని, దారి తప్పించి బొబ్బిలిని ముట్టడించారు. బొబ్బిలి సర్వనాశనమైపోయినా ఈ వార్త పాపారాయుడికి తెలీలేదు.

చివరికెప్పుడో జౌహారు చితిలో మరణించిన మల్లమదేవి అతనికి కలలో కనబడి బొబ్బిలి నాశనాన్ని గూర్చి చెప్పిందిట! చాలా విచారించతగ్గ విషయం ఇది!

అనాడు వెలమలకి శత్రు రహస్యాలను తెలుసుకునే గూఢచారి బలం లేదు! వార్తలను త్వరగా పంపించే రవాణా సౌకర్యాలు లేవు! శత్రువుల




ఆయుధాలకంటె శక్తివంతమైన ఆయుధాలు లేవు! సరైన వ్యూహ రచన చేసే తెలివితేటలు లేవు.

ఇంత అప్రయోజకులైన రాజులు తమ భార్యలను జౌహారు చితికి అంకితం చెయ్యడంలో మాత్రం ఎంతో తెలివితేటలను ప్రదర్శించారు

రసపుత్రుల రాణులు, బొబ్బిలి స్త్రీలు చాలా సౌందర్యవంతులు ఈ సౌందర్యం అగ్నికి ఆహుతై చివరికి బూడిదని మిగిల్చింది.

తాము మరణించాక తమ భార్యలు బ్రతికుండ కూడదనే పురుషులు శీలం పేరిట భార్యలను ఇలా సంహరించారు.

ఎంత క్రూరమైన స్వార్థం!

"కరణేషు మంత్రి"గా స్త్రీని గౌరవించినంత కాలం పురుషుడు బాగుపడ్డాడు! ఆ పదవినుండి స్త్రీని పడద్రోసి, తాముకూడా పడిపోయాడు

ఇది పురుషులకు చరిత్ర చెప్పే నీతి! ★




# తల్లినేల

మధురాంతకం నరేంద్ర

గడ్డి దుప్పటిని కప్పుకుని గొర్రెల కాపరుల్లా నిల్చున్న కొండచరియలు..

ఈటెలు చేతబట్టుకుని యుద్ధానికి సిద్ధమయిన ఆదిమ వాసుల్లా కనిపిస్తున్న తాటితోపులు..

ఆకుపచ్చని వేరుశెనగ చేన్లు...

చేన్లలో కలుపుమొక్కల్ని లాగిపడేస్తూ కూలీ జనం .

అక్కడక్కడా లేడిపిల్లల్లా చెంగున గంతులేస్తూ కొండనారవలు...

రైలు కిటికీ సినిమా తెరలా తయారయ్యినట్టుంది.

సాయంకాలపు పిల్లతెమ్మెరలు కంపార్టుమెంటులోకి దూసుకొస్తున్నాయ్.

ఎదుటి బెంచీలో కూర్చున్న పడుచు జంట కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

ఆ తోటలూ, కొండలూ, నేలా, కాలువలూ, గాలీ, భాష వెరసి ఆ సాయంకాలపు రైలు ప్రయాణం కరుణాకరరావును అనిర్వచనీయమైన ఆనందంలో ముంచిపారేసింది

తలపైన మిగిలిన నాలుగు వెరకలూ తమాషాగా నాట్యం చేస్తున్నాయి ఎండకు యెండీ, వానకు తడిసీ సైల్మాన్లా తయారయిన శరీరం అతడిది ముఖంలో మాత్రం వయస్సు కనబడుతోంది

ఆ నేలకూ, వొకరకమైన యాసతోకూడిన ఆ తెలుగు భాషకూ అతడు దూరమై దాదాపు పాతికేళ్లు గడిచాయి

'ఇది తన నేల !' – అతడి శరీరం పులకించిపోతోంది.

'ఇది తన భాష !' - అతడు మైమరచిపోతున్నాడు.

పాతికేళ్ల క్రితం ఈ నేలే అతణ్ణి వెక్కిరించింది – "వొక్క సెంటు భూముంటే నేలపైన నిలిచే రకమేనా వీడు !" మామయ్య హేళన చేశాడు.

పాతికేళ్ల క్రితం ఈ భాషే అతణ్ణి కసిరికొట్టింది – "పెద్ద భడాయి! వొళ్లంతా పొగ్గరమే !" అత్తయ్య గొంతు చించుకొంది.

కానీ యిప్పుడా సంగతులేవీ అతడికి గుర్తుకు రావడంలేదు.

అవును మరి ! ఈ నేలపైన మామయ్యే కాదు, నాన్న గూడా బ్రతికాడు. 'మావాడు కలెక్టరవుతాడు !' అనేవాడు నాన్న. ఆ మాట అనేటప్పుడు ఆయన కళ్లల్లో యెంత కాంతి !

ఈ నేలపైన అత్తయ్యే కాదు, అమ్మ గూడా బ్రతికింది. "నా కొడుకు బంగారు కొండ!" అంటూ హృదయానికి హత్తుకొనేది !

మామయ్య పుట్టినచోటే నాన్న గూడా పుట్టాడు. అత్తయ్య జీవించినచోటే అమ్మ గూడా జీవించింది. ఎంత చిత్రం ! ఇక్కడ లేడిపిల్లలేగాదు సింహాలు కూడా వున్నాయి. అందుకే అన్నారు దీన్ని జనారణ్యమని !

కడుపులో దాచుకుని కాపాడవలసినవాళ్లు అర్జెంటు పనేదో వున్నట్టు హఠాత్తుగా కన్ను మూస్తే, మిగిలినవాళ్లు "నువ్వు అనాధవిరా !" అంటూ నిరూపించి చూపించారు.

ఇరవయ్యేళ్ల పడుచుదనం బుసలుకొట్టింది.

ఆవేశంతో వొళ్లు వొణికిపోయింది.

నూనూగు మీసాల మొదళ్లలో చెమట బిందువులు పొటమరించాయి.

ఈ నేలనూ, ఈ భాషనూ విడిచిపెట్టి దూరంగా పారిపోయాను.

కొన్నాళ్లు తిరగడమే ధ్యేయంగా పెట్టుకున్నాడు

ఎక్కడో పరాయిచోట యెవరో వొక అపరిచితుడు తనను ఆదరించగలడని అతడెప్పుడూ వూహించలేదు. ఆ మహానుభావుడు నిర్మించిన పునాదిపైన తాను ఆకాశమంతగా యెదగగలనని అతడికప్పుడు తెలియదు పెళ్లీ .. పిల్లలూ .. సంసారం . జీవితం మళ్లీ వొకదారిన పడింది సంపాదన పెరిగింది. సంఘంలో మంచి స్టేటస్ వచ్చింది.

అయినా అంత ఆనందంలోనూ వొక విషాద వీచిక తొంగి చూస్తూనేవుంది. తన వూరికివెళ్లాలి.. తన వాళ్ల మధ్య బ్రతకాలి ...

'పిల్లల చదువులూ, పెండ్లిండ్లూ ముగిశాక తన వూరికి వెళ్లి, వొక చిన్న యిల్లు కట్టుకుని చివరి రోజుల్నంతా అక్కడే గడపాలి' – అదే అతడి జీవితాశయం !

"మీ పిచ్చిగానీ, ఆ వూళ్లో మనమెలా బ్రతకగలమండీ !" అంటూ నవ్వేసింది భార్య.

"మాకా భాషగూడా రాదు" అన్నారు పిల్లలు

అయినా అతడు తన ప్రయత్నాల్ని మానుకోలేదు. 'చేతిలో డబ్బులున్నప్పుడు నిలుపూమానుకుని అక్కడే వో యిల్లు కొనుక్కోవాలి ! భూముల్ని సంపాదించుకోవాలి !' పగలూ రేయీ అదే ధ్యాస !

"ముందుగా వోసారి మా వూరికి వెళ్లిరావాలి" అన్నాడు. భార్యని గూడా రమ్మని బ్రతిమాలాడు "పిల్లల్ని వొదిలిపెట్టి అంత దూరం రాలేము. అంతగా కావలిస్తే మీరొక్కరే వెళ్లి తొందరగా తిరిగొచ్చేయండి" అంది ఆమె.

కరుణాకరరావు వొంటరిగానే బయల్దేరాడు.



కేంద్రప్రభుత్వాధికారులకు తెలియజేశారని విశ్వసనీయంగా తెలుస్తోంది.

ముఖ్యమంత్రి నేడు మెదక్‌లో మాట్లాడుతూ శ్రీమతి ఇందిరాగాంధీ ఇరవై అంశాల కార్యక్రమం, సంజయ్ గాంధీ ఐదు అంశాల కార్యక్రమం, అమలు పర్చడంలో జరుగుతున్న జాప్యాన్ని ప్రస్తావించి, దానికి బాధ్యులైన అధికారులను సహించేదిలేదని –''

ట్రాన్సిస్టర్ ఆగిపోయింది

ప్రసాదు ట్రాన్సిస్టర్‌ను కిందికీ పైకీ ఊపి దాన్ని పలికించడానికి ప్రయత్నిస్తున్నాడు.

''ట్రాన్సిస్టర్ బాగానే పనిచేస్తున్నదే? ఏమిటో సడన్‌గా ఆగిపోయింది'' అంటూ ప్రసాద్ దాన్ని తిరగా బోర్లావేసి చూశాడు.

''క్షమించాలి. విద్యుత్ ప్రసారంలో లోపం వల్ల, రెండు నిముషాలు మా ప్రసారంలో అంతరాయం కలిగింది.''

''— వారం రోజులుగా నగర శివార్లలో జరుగుతున్న దోపిడీలు తగ్గిపోయాయనీ, గత ఇరవై నాలుగు గంటల్లో ఒక్క దోపిడీ కూడా జరిగినట్లు పోలీసు నిఘా విభాగానికి ఇంతవరకు వర్తమానం ఏదీ అందలేదని, నగర పోలీసు కమిషనర్ తెలియ జేస్తున్నారు ...''

మళ్ళీ రేడియో ఆగిపోయింది.

''ఇహ ఆ రేడియో కట్టేయండి బాబూ మీకు పుణ్యం ఉంటుంది. ఒక్కటే బోర్!'' ప్రసాదుతో అన్నది సునీత.

''సుజీ రావే మనం లోపలకు పోదాం!''

అంటూ లేచి నిల్చుంది సునీత.



సుజాత ఖాళీ ప్లేట్లూ, కప్పులూ, ట్రేలో పెట్టుకొని సునీత వెనకే నడిచింది.

''సుజీ! ఇప్పటికైనా నీ అనుమానాలన్నీ తీరాయా?'' సునీత అడిగింది.

ట్రే సింక్‌లో పడేసి చేతులు కడుక్కుని తుడుచుకుంటూ –

''మరి పిల్లి చావో?'' అన్నది సుజాత.

''అదీ యాక్సిడెంటే అయి ఉంటుంది వెర్రిమొర్రి ఆలోచనలు మానేసి నింపాదిగా ఉండు.''

''అయితే మావారెందుకు ఢిల్లీ ప్రయాణం మానుకున్నారంటావు?''

''అది మీవారినే అడుగు. ఏదో కారణం ఉండే ఉంటుంది. అనవసరంగా నువ్వు ఖంగారుపడి, మీ ఆయన్ని ఖంగారుపెట్టకు. తెలిసిందా?'' కసిరినట్లు చెప్పింది సునీత.

''నీటి తొట్టిమీద – అదే పిల్లి నీళ్ళలో పడిన తర్వాత మూత ఎవరు వేసినట్లు?'' సుజాత పిల్లి చావును సాగదీస్తుంటే సునీతకు చిరాకు వేసింది.

''అదే వేసి ఉంటుంది.''

పొడిపొడిగా అన్నది సునీత.

'పిల్లేనా?''



''కాదు. మీ పనిమనిషి!''

''నాకూ అదే అనుమానం వచ్చింది ముందు చెప్పొద్దూ! ఆ తర్వాత ఏదేదో ఆలోచించానే సునీ!''

''మనకార్యం చేశావులేగానీ ఇకనుంచి అలాంటి తిక్క తిక్క ఆలోచనలు పెట్టుకోకు''

''థ్యాంక్సు!''

''నాకు థ్యాంక్సు ఏమిటే?''

''మళ్ళీ ఎప్పుడొస్తావ్?''

''ఈసారి నువ్వే రావాలి. మీవారిని తీసుకొని ఓ రోజు డిన్నర్‌కు రా! రేపు మావారు క్యాంపు వెళ్తున్నారు. ఆయన బహుశా ఎల్లుండి తిరిగొస్తారు రాగానే నేనే ఫోన్ చేస్తాను. వస్తావుగా?''

''అలాగే!'' తల ఊపింది సుజాత.

''అప్పటివరకు డాక్టర్‌గారుంటారా?''

''ఏమో ఉంటాడేమో!''

''ఉంటే ఆయనను కూడా భోజనానికి తీసుకురండి. మావారు కూడా ఆయనను ఇన్వైట్ చేస్తారులే.''

సుజాత మౌనంగా తల ఊపింది.

''ఇక మేం వెళ్తాం?''

''అంత తొందరేమిటే?''

''ఇంటికి వెళ్ళి తయారై డిన్నర్‌కు వెళ్ళాలి.'

సుజాతా, ప్రసాదూ గేటువరకూ వచ్చి మూర్తినీ, సునీతనూ సాగనంపారు.

# మనసు కథ

రాత్రి భోజనాలు అయ్యాక సుజాత వంటిల్లు సర్దుకొని డాబామీదకు వెళ్ళింది

ప్రసాదూ, శరత్‌బాబూ డాబామీద పచార్లు చేస్తూ కన్పించారు.

ఇద్దరూ పిట్టగోడ దగ్గిర ఆగారు

"అలా చెయ్యడంవల్ల ఉపయోగంకంటే నష్టమే ఎక్కువేమో ?" ప్రసాదు అనడం విన్పించింది

సుజాత మధ్యలోనే నిలబడిపోయింది

"బాగా ఆలోచించే చెబుతున్నాను ఒక ప్రయత్నం చేసి చూద్దాం!" శరత్‌బాబు అన్నాడు

"ఊం కానియ్!" అంటూ పక్కకు తిరిగి సుజాతను చూసి ఆగిపోయాడు ప్రసాదు

"సుజాతా ఎంత సేపయింది వచ్చి ? రా ? అక్కడే ఆగిపోయావేం ?"

"ఇప్పుడే!" అంటూ సుజాత వాళ్ళ దగ్గిరకు వెళ్ళింది

"చాలా హాయిగా ఉంది. మీ హైదరాబాద్ వాతావరణం చాలా బాగుంటుంది ఈవేళప్పుడు మాకు ఉక్కపోసి చిరాకెత్తిపోతుంది." అన్నాడు శరత్‌బాబు

కావాలనే మాట మారుస్తున్నాడు

వాళ్ళు మాట్లాడుకున్నది తను విన్నదేమోనని గాభరాపడుతున్నాడు

వాళ్ళమధ్య ఏ రహస్యాలూ లేకపోతే తనను చూసి మాట మార్చాల్సిన పనిలేదు

తనకు తెలియకూడని రహస్యాలేవో వాళ్ళిద్దరి మధ్యా ఉన్నాయి

అది మాత్రం నిజం!

సందేహం లేదు!

సునీత తను అనుకున్నదంతా తన ఊహలకింద కొట్టిపారేసింది. వాళ్ళాయన మాటలు నమ్మింది తనను నమ్మించింది.

వీళ్ళు పోలీసోళ్ళని కూడా కట్టుకొని ఉంటారు

అణు పరిశోధనాలయంలో జరిగింది విధ్వంసక చర్యే! వీళ్ళు ముందుగానే మూర్తిని పట్టుకొని, విద్యుత్ ప్రసార లోపంవల్ల ప్రేలుడు సంభవించిందని రిపోర్టు ఇచ్చేలా చేసి ఉంటారు

ఆలోచిస్తుంటే తనకు ఇప్పుడు అర్థమౌతున్నది

ఈరోజే సునీత భర్తలో ఇక్కడకెందుకొచ్చింది ?

వచ్చినవాడు పనికట్టుకొని ఆ సంగతి ఎందుకు మాట్లాడాలి ?

పైగా రేడియో కూడా పెట్టమన్నాడు

వీళ్ళంతా కలిసి తనను నమ్మించడానికే ఈ పన్నాగం పన్నారు! సందేహం లేదు!

ఈ నాటకం ఆడారు ?

కంచే చేను మేస్తే ఇక రక్షించేదెవరు ?

సునీతను తను తెలివైంది అనుకుంది ఇంత కాలం దాని తెలివి మండినట్టే ఉంది ఆమె నమ్మింది పైగా తననుకూడా నమ్మించింది

## మినీ రంగుల టెలివిజన్

జపానులోని మిట్సుషితా ఎలక్ట్రిక్ కంపెనీవారు ప్రపంచంలోకెల్లా అతి చిన్నదైన రంగుల టెలివిజన్ను తయారుచేశారు ఇందులో పిక్చర్ ట్యూబ్ పొడవు మూడు అంగుళాలు మాత్రమే వుంటుంది దీని సైజు 115 x 86 x 232 మిల్లిమీటర్లు మాత్రమే వుంటుంది. దీని బరువు ఒకటిన్నర కిలోలు మాత్రమే వుంటుంది. ఇంతకు ముందు సోని కంపెనీవారు నాలుగు అంగుళాల అతి చిన్న రంగుల టెలివిజన్ను తయారు చేశారు. అయితే యీ క్రొత్త టెలివిజన్ దానికంటె సైజులో నలభై శాతం, బరువులో యాభై శాతం చిన్నదిగా వుంటుంది ఈ క్రొత్త టెలివిజన్ ఎ సి విద్యుత్తుతో, కారు బ్యాటరీలతో, లేక మరేయితర బ్యాటరీలతో కూడా పనిచేస్తుంది. ఇందులో విద్యుత్తు వాడకం 9.5 వాట్లు వుంటుంది.

ఈ విషయం న్యూక్లియర్ లాబ్ అధికారులకు తెలియజేస్తే సరి! వాళ్ళే సి బి ఐ ద్వారా ఎన్‌క్వైరీ చేస్తారు స్థానిక పోలీసు అధికారులు విచ్ఛిన్నకారులతో కుమ్మక్కై, కేసును తేల్చివేశారు పత్రికలకు ఇస్తే సరి! తాటికాయలంత అక్షరాల్తో వేస్తారు

పత్రికలు ఈ కుంభకోణం బయటపెట్టి దీని అంతు తేలుస్తాయి

"బ్యూటిఫుల్! ఇక్కడ్నుంచి ఆ దేవాలయం ఎంత అందంగా కన్పిస్తోందో ? ఎంత హుందాగా ఉంది ? మీరు వాస్నే చూస్తున్నారు గదూ ?" శరత్ సుజాత దగ్గిరగా వచ్చి అన్నాడు

సుజాత గిర్రున తిరిగి, చివ్వున తలెత్తి శరత్‌బాబుకేసి చూసింది

"ఆహాం దెయ్యాలు వేదాలు వల్లిస్తున్నాయ్ దేవుణ్ని కాదు దెయ్యాలను చూస్తున్నాను నీ మాయ మాటలు నాకు అర్థం కావనుకోకు నేను నీ నేరాలను గురించే ఆలోచిస్తున్నాను మిమ్మల్ని న్యాయస్థానం బోనులో ఎలా నిలబెట్టాలా అని ఆలోచిస్తున్నాను పిల్లిని చంపినదానికి కూడా శిక్ష ఉంది క్రూయల్టీ టు యనిమల్స్! అదీ నేరమే!" సుజాత కసికసిగా మనసులోనే అనుకున్నది

"అది బిర్లా కట్టించాడటగా ?" శరత్‌బాబే మళ్ళీ అడిగాడు

"అవును! రాజస్థాన్ నుంచి పలువరాయి తెప్పించారు" శివప్రసాదు కల్పించుకొని చెప్పాడు

అన్నీ కాలక్షేపం కబుర్లు! ఉబుసుపోక ఊకదంపు! చెత్త మాటలు! వీళ్ళకు తనను చూడగానే గుండెలు కదబడ్డాయి వాళ్ళ మాటలు తను విన్నదేమోనని వాళ్ళ అనుమానం

తను ఇంకొంచెం ముందొస్తే ఎంత బాగుండేది ?

అప్పటికే కొన్ని మాటలు వినేవిన్నది

ఏమిటా మాటలూ ?

సుజాత గుర్తు చేసుకోవడానికి ప్రయత్నం చేసింది

"ఆం అవును! అలా చేస్తే ఉపయోగం కంటే నష్టమే ఎక్కువట ఏంచేస్తే ? ప్రయత్నం చేసి చూద్దాం!"

ఏం ప్రయత్నం చేస్తారు ?

వీళ్ళ పథకం ఇంకా ఉంది

# తాజాదనాన్ని అనుభవించండి

FRESHNESS YOU CAN FEEL

Binaca® Top

toothpaste

## నిదర్శనాన్ని చూడండి.



### సులభమైన ఈ పరీక్ష చేయండి.

నీళ్ల మీద బొగ్గుపొడిని చల్లండి. దాని మధ్య ఒక చుక్క బినాకా టాప్ ద్రవాన్ని చల్లండి. బినాకా టాప్ ఎంత త్వరగా అన్ని వైపులకి వ్యాపించి నీళ్లలోని మురికినంతా పక్కపక్కకి నెట్టుతూ నీటిని స్వచ్ఛంగా. తేటగా ఎలా చేస్తుందో మీరే చూడండి.

మీ నోటిలో కూడా బినాకా టాప్ సరిగ్గా ఇలాగే పని చేస్తుంది. దానిలోని చెదిరి వ్యాప్తిచెందే ప్రత్యేకమైన పదార్థం నోటిలో నలుమూలలా ఇట్టే వ్యాపించి దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మ క్రిములను నిర్మూలిస్తుంది. నోటినుండి దుర్వాసన రాకుండా కాపాడి, మీకు తాజాదనపు హాయిని ఇస్తుంది.

## బినాకా టాప్ టూత్‌పేస్ట్ —
## మీకు సంపూర్ణ నోటి రక్షణనిస్తుంది

ARMS-CBT-1-140-TL-82

అది నిశ్చయం! సందేహం ఎంత మాత్రం లేదు.

"పొద్దు పోయింది. కిందకు వెళ్దామా?" సుజాత దగ్గరకు వచ్చి అన్నాడు ప్రసాదు.

"నేను కాసేపుండి వస్తాను. ఇక్కడ హాయిగా ఉంది. మీరు వెళ్ళండి. మీ ఆవిడకు నిద్ర ముంచు కొస్తున్నట్టుంది" అన్నాడు శరత్‌బాబు.

అధిక ప్రసంగం!

తనకు నిద్ర ముంచుకొస్తోందా?

అది అతగాడికి ఎవరు చెప్పారు?

ఆఁ ఆఁ అవును!

ఇదో సజెషన్!

ఆటో సజెషన్!

బోడి సజెషన్!

క్రితం రాత్రి నిద్రమాత్రలిచ్చి నిద్రపుచ్చాడు.

ఈరోజు మళ్లీ అదే ట్రిక్కు పని చెయ్యదని అతడికి తెలుసు!

అందుకే త్వరగా వెళ్ళి పడుకోమని సలహా ఇస్తున్నాడు.

తను ఈ రాత్రి చచ్చినా నిద్రపోదు!

నిద్రపోయినట్టు నటిస్తుంది!

అతడు చేసేదంతా గమనిస్తుంది

రెడ్ హాండెడ్‌గా పట్టుకోబోతుంది

"సుజాతా రా!" అంటూ ప్రసాదు కదిలాడు.

ఈ పెద్దమనిషేమిటి? అతనికెందుకిలా భయపడుతున్నాడు? అలిడి అడుగులకు మడుగు లొత్తుతూ తిరుగుతున్నాడు. అతను చేస్తున్న నేరాలలో ఇతని భాగమెంతో?

## మ న సు క థ

ఈ రాత్రే ఈయనగారి సంగతి కూడా తేల్చివెయ్యాలి.

అసలు విషయం ఈయనముందే బయటకు లాగాలి.

తాడో పేడో తేల్చుకోవాలి.

ఈ టెన్షన్‌కి తను ఇంకెంతో కాలం తట్టుకోలేదు. ఈ సస్పెన్సును భరించలేదు.

ఆలోచిస్తూ భర్త వెనకే సుజాత మేడ మెట్లు దిగింది.

### జనం, జనం!

జనం జనం, ఏమి జనం!
పెరుగుతున్న ప్రభంజనం!
"వీరందరికీ ఎక్కడిది
భోజనం? జనం పెరుగుదలకు
'జనగణమన'పాడ"మంటున్నారు –
పుట్టి, మా దుంప తెంపనీకుండా
ఇప్పుడే, మీ దుంప తెంపుకోమంటున్నార!

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి

సుజాత వంట గదిలో పాలు తోడుపెట్టి, పడక గదిలోకి వచ్చేసరికి, ప్రసాదు మంచంమీద పడుకొని ఉన్నాడు.

"ఏమండీ? మెమ్మళ్ళ?"

ప్రసాదు పలకలేదు. ఉలకలేదు.

ఏమిటీ? అప్పుడే ఇంత నిద్రా?

"ఏమండీ! మెమ్మళ్ళ!" కుదిపి కుదిపి పిల్చింది.

ప్రసాదు పక్కకు తిరిగి పడుకున్నాడు

అంతా నటన!

నిద్రపోతున్నట్టు నటిస్తున్నాడు.

ఇదంతా చూస్తే తన అనుమానం నిజమేననిపిస్తున్నది. ఆయన ఎక్కడ ఉన్నాడో? ఇంకా మేడమీదే ఉన్నాడా?

అయితే వీళ్ల నాటకంలో ఈ రాత్రి మరో రంగానికి తెర లేస్తుందన్న మాటే!

క్రితం రాత్రి శరత్‌బాబు గదిలోకి వెళ్ళి చూసింది తను.

అందుకే అతను ఈరోజు పైన బిచాణా వేశాడు.

అప్రయత్నంగా సుజాత పక్కమీద నడుం వాల్చింది.

భారంగా ఆవలించి వళ్ళు విరుచుకున్నది.

రెప్పలు బరువుగా కళ్ళమీదకు వాలిపోతున్నాయి

(ఇంకా వుంది)




అది 1800 సంవత్సరం ' అవాటికి భారత దేశంలో ఆంగ్లపాలన స్థిరపడింది ఆ తర్వాత ఆంగ్లేయులు దాదాపు 150 సంవత్సరాలు ఈ దేశాన్ని పాలించారు వాళ్ళ పరిపాలనవలన భారత దేశానికి మేలు చేకూరిందా ! కీడు కలిగిందా ? అనే విషయంలో మాత్రం ఎన్నో వాదోపవాదాలు వున్నాయి.

అయినా అందరూ ఒప్పుకునే విషయం మాత్రం ఒకటుంది ! అదేమిటంటే — పూర్వం మౌర్యులు ఆ తర్వాత మొగలు చక్రవర్తులు, ఈ దేశాన్ని ఒక పాలన క్రిందకు తేవాలని చాలా ప్రయత్నించి విఫలులైపోయారు. కానీ ఆంగ్లేయుల కాలంలో భారతదేశమంతా ఏకఛత్రాధిపత్యం క్రిందకు వచ్చింది.

అప్పుడప్పుడు క్షోభ పరిస్థితులు ఏర్పడినా 1857 లో జరిగిన సిపాయిల తిరుగుబాటు తర్వాత దేశంలో సుఖశాంతులు నెలకొన్నాయి

యూరోపియను జాతుల్లో ఆంగ్లేయులు ఉత్తమ మానవతాధర్మములు గల జాతి ! వారి ఆదర్శాలు, పాశ్చాత్య సంస్కృతి, ఆంగ్లభాష ద్వారా భారతదేశంలో ప్రవేశించి, హిందూ నాగరికతలో కలిసిపోయాయి

పాశ్చాత్య నాగరికత అంటే ఒక్క ఆంగ్ల సంస్కృతే కాదు, యూరోపియను జాతి మొత్తం సాధించిన నాగరికత అని అర్థం ! 16వ శతాబ్ది నుండి న్యూటను అనే శాస్త్రజ్ఞుడితో ప్రారంభమైన ఈ నాగరికతను "క్రైస్తవ శాస్త్రీయ నాగరికత" అంటారు 'క్రైస్తవ' మని మత సంబంధి పేరును తగిలించుకున్నా, ఇది ప్రధానంగా శాస్త్ర నాగరికత !

దీని ప్రధాన లక్షణం — ప్రకృతి యొక్క ప్రతి చర్యకు గల కార్యకారణ సంబంధాన్ని గూర్చి ప్రశ్నించి, అన్వేషించడం, హేతువులను తెలుసుకోడం; దీనితో ఇంతవరకూ భయంకర రూపంతో మానవునికి ప్రత్యక్షమైన ప్రకృతి, ఈ రోజు అతడికి సహచరుడిలా సేవ చేస్తోంది.

ఈ కొత్త నాగరికత తాకిడికి ప్రపంచంలోని మూడు ప్రధాన మతాలు మొదలంటా కంపించి పోయాయి. కానీ చివరికి ఈ నాగరికతా సంఘర్షణ వలన ఈ మూడు మతాలే కాక, ప్రపంచమే ఎలా మారిపోతుందో వేచిచూడాలి.

భారతదేశంలో ఈ నూతన సంస్కృతిచే కలిగిన నవచైతన్యంతో రాజారామమోహన్‌రాయ్ మొదలైన విద్యాధికులు ఈ హిందూ సంఘాన్ని నూతన దృష్టితో పరిశీలించడం మొదలెట్టారు. అప్పుడు వారికి బాగా కొట్టొచ్చినట్లుగా కనబడింది— ఈ సంఘంలో సగం జనాభా కలిగిన హిందూ స్త్రీల దుస్థితి.

హిందూ స్త్రీలకు సంబంధించిన పెక్కు సాంఘిక దురాచారాలు గుర్తించి వాటిని ఖండించడం మొదలెట్టారు. అంతేకాక, ఈ దురాచారాలను నిర్మూలించడానికి కూడా తీవ్ర కృషి చేయడం మొదలెట్టారు.

అవాటికి — స్త్రీలకున్న సాంఘిక సమస్యలు ఇవి —

1. సహగమనం.
2. స్త్రీకి విద్య లేకపోవుట.
3. పర్దా పద్ధతి.
4. బహు భార్యాత్వం.
5. బాల్య వివాహాలు — తత్ఫలితంగా ఏర్పడిన బాల వితంతువుల సమస్య.
6. వితంతు వివాహాలు.
7. దేవదాసి పద్ధతి — వేశ్యావ్యవస్థ.
8. ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవుట
9. వరకట్నం లేక కన్యాశుల్కం.
10. స్త్రీ భోగ్య వస్తువుగా చూడబడటం
11. ఆస్తి హక్కు లేకపోవుట.
12 కుటుంబ సమస్యలు.
13. స్త్రీల మానభంగాలు

### "మంచి జీవితం" ప్రదర్శన !

ఈ సంవత్సరం ఏప్రిల్ 28వ తేదీ నుండి 5వ తేదీవరకూ టోక్యోలో 'మంచి జీవితం' ప్రదర్శన జరగనున్నది. ప్రజలకు ఎక్కువ విశ్రాంతి లభించడం, జీవన విధానాల పట్ల అనేక రకములైన అభిరుచులేర్పడటం వలన క్రొత్త కోరికలు, వాటిని తీర్చవలసిన అవసరం ఏర్పడుచున్నది. ప్రజలు మరింత సమగ్రమైన, మెరుగైన జీవితం కావాలని అభిలషిస్తున్నారు. ఈ సందర్భంగా టోక్యోలో జరగనున్న యీ అంతర్జాతీయ ప్రదర్శనలో క్రొత్త రకాల యిండ్ల నమూనాలు, గృహోపకరణ సామాగ్రి, మొదలగువానిని ప్రదర్శించగలరు. దేశ విదేశాలలోని అనేకమంది వుత్పత్తిదారులు యీ ప్రదర్శనలో పాల్గొంటారు. అమెరికా, యూరప్, ఆసియాదేశాల నుండి ప్రజలు ఈ ప్రదర్శనను సందర్శించగలరు

పై వానిలో ప్రతి సమస్య తీసికొని, దాని పుట్టుకకు గల కారణాలు, క్రమక్రమాన అది చెందిన పరిణామాలు, వాటివలన ఏర్పడిన దుష్ఫలితాలు, వాటి నివారణోపాయాలు అన్వేషించినట్లయితే, ఈనాటి ఆధునిక స్త్రీలకు ఎంతో వుపయోగంగా వుంటుందని నా అభిప్రాయం ★





# స్వార్థమాకళ్ళు



శ్రీమతి మీనా జనార్ధన్

చిరంజీవి రమణారావుకి మీ నాన్న అనేక ఆశీస్సులతో వ్రాయునది. నీవు, కోడలు, చి. పిల్లలు అంతా క్షేమమని తలుస్తాను. చాలా దినములైంది మీ క్షేమ సమాచారములు తెలియనందున మీ అమ్మ చాల ఆందోళన పడుచున్నది. ఈ మధ్య ఆమె ఆరోగ్యము కొద్దిగా దెబ్బతిన్నది. ఆ కారణంగా ఆమె మరీ మరీ మిమ్మల్ని చూడాలని కలవరించుచున్నది. కాబట్టి ఈ సారి సంక్రాంతికి, మీరు మీ అత్తవారి ఊరికి కాకుండ నేరుగా ఇక్కడికి బయలుదేరి రావలయును. తరువాత తిరుగు ప్రయాణములో అక్కడికి వెళ్ళవచ్చును. మీ అమ్మ మరీ మరీ రమ్మని వ్రాయమని చెప్పినది. సుందరంకి, హరికృష్ణకి, భారతికికూడ వ్రాసాను. మీరందరు ఒక్కసారి వచ్చి మీ అమ్మను సంతోషపరచవలయును. మమ్మల్ని నిరాశ పరచవద్దు. పది రోజులు ఉండేటట్టు రండి. చి. సౌ కోడలుకి, చి. పిల్లలకి నా ఆశీస్సులు. మీ రాకకోసం ఎదురు చూస్తూ ఉంటాము

ఇట్లు, మీ నాన్న
పరంధామయ్య.

ఉత్తరం పూర్తిచేసి, కాగితం మడచి కవర్లో పెట్టారు నాలుగు కవర్లు గమ్‌తో అంటించారు. అడ్రసులు ముందే రాసేయటంవలన కవర్లన్నీ దొంతుగా పెట్టేరు. మంచంపై పడుకుని ఆయన్నే గమనిస్తున్న అన్నపూర్ణమ్మ .. అప్పుడే రాశేసారా ? అని ప్రశ్నించింది నీర్సంగా.

"ఆ ..అయిపోయింది" పెన్ను మూసేస్తూ సమాధానం ఇచ్చేరు.

"ఏం రాశారు? రమ్మని రాసేరా ?"

"ఆ ..నువ్వు చెప్పినట్టే రాసేను."

"వస్తారంటారా ?"...నిరాశగా ప్రశ్నిస్తున్న ఆమెని చూసి చిన్నగా నవ్వేరు పరంధామయ్యగారు.

"ఎందుకు రారు ... తప్పకుండా వస్తారు. వస్తారో .. రారోనని బెంగపడి .. మనసు పాడు చేసుకోకు"

ఏదీ ఆ ఉత్తరాలిటివ్వండి . అన్నపూర్ణమ్మ కుడిచేతిని ముందుకి చాస్తూ అడిగింది. ఆయన లేచి కవర్లు ఆమె చేతిలో పెట్టేరు.

ఆ కవర్లమీద చిరునామాలు ఒకదానితరువాత ఒకటి చూసి . తృప్తిగా నిట్టూర్చి తిరిగి భర్త చేతిలో పెట్టేసింది.

"త్వరగా వెళ్ళి పోస్టు చేసేయండి. రెండు రోజుల్లో వాళ్ళకి అందిపోదూ...?"

"తప్పకుండా అందుతుంది. నేనిప్పుడే పది నిముషాల్లో వచ్చేస్తాను." అంటూ ఆయన ఉత్తరీయం భుజంమీద వేసుకుని బయటకు వెళ్ళిపోయారు

అన్నపూర్ణమ్మ దీర్ఘంగా నిట్టూర్చింది.

ఈసారైన పిల్లలు వస్తే బాగుండును. భారతి ఆర్నెల్లకి ఒకసారైన వస్తుంటుంది. కానీ మగ పిల్లలకి ఏడాదైనా తల్లిని, తండ్రిని చూద్దామన్న ధ్యాస ఉండదు. మూన్నెల్ల క్రితం రమ్మని రాస్తే సెలవు దొరకలేదంటూ ముగ్గురి దగ్గర్నుంచి ఉత్తరాలు వచ్చేయి. ప్రతి సంక్రాంతికి మాత్రం వాళ్ళు తప్పనిసరిగా సెలవులు పెట్టి అత్తవారిళ్ళకు వెళ్తారు. పండగ నాలుగురోజులు గడిచాక, వాళ్ళు వీలువిబట్టి ఇక్కడకి వచ్చి ఒకరోజో, రెండురోజులో ఉండి వెళ్తారు. అందుకే ఈసారి పండక్కి సరాసరి ఇక్కడికే రమ్మని వ్రాయమంది.

రమణ, సుందరం, హరికృష్ణ ఒక్కొక్కరే ఆమె కళ్ళముందు మెదులుతుంటే ఆ రూపాలను మసక చేస్తూ ఆమె కళ్ళల్లో కన్నీటిపొర దట్టంగా కమ్మేసింది. పాతరోజులు మళ్ళీవస్తే ఎంత బాగుండునో! పిల్లలు చిన్నవాళ్ళప్పుడు తనకి క్షణం తీరిక ఉండేదికాదు. తెల్లవారి లేచింది మొదలు రాత్రి పడుకొనేవరకు ఊపిరి సలిపేదికాదు. "అమ్మా నా పెన్సిలు కనిపించటంలేదు, అమ్మా నా పుస్తకం ఎక్కడైనా చూసావా. అమ్మా నా చొక్కాకి అట్ట వేసిపెట్టవూ ..." అంటూ పిల్లలు తనని ఊపిరి పీల్చనివ్వకుండా చేసేస్తుంటే- ఆ మధ్య నేనూ ఉన్నానంటూ పరంధామయ్యగారు తన చొక్కా పట్టుకుని వచ్చేవారు, చొక్కాకి గుండీలు కుట్టిపెట్టమంటూ. అన్నపూర్ణ చిరునవ్వులో ఆ చొక్కా అందుకునేది. పిల్లల చిన్న చిన్న పనులను ఎంతో శాంతంగా నేర్పుతో చకచక పనిచేసి పెట్టేది. ముందుగా ఎలిమెంటరీ స్కూలుకి వెళ్ళవలసిన హరికృష్ణని, భారతిని తయారుచేసి పంపాక, పెద్దవాళ్ళిద్దరూ తొమ్మిది గంటలకు హైస్కూలుకి వెళ్ళేవారు. అప్పటికి అరగంట ముందునుంచి పరంధామయ్యగారు 'వంటయిపోయిందా ...' అని క్షణానికోసారి అడిగిన దానికి, ఆఖరి తాలింపులు వేస్తూ ... 'ఆ .. అయింది భోజనానికి రండి' అని పిలిచేది. ఆయన భోంచేసి ఆఫీసుకి వెళ్ళేసరికి పావుతక్కువ పది అయేది పిల్లలు స్నానాలుచేసి విడిచేసిన బట్టలకు సబ్బురాసి ఉతికేసరికి చిన్నవాళ్ళిద్దరూ ... స్కూలు నుంచి పరుగులు పెట్టుకుని వస్తుంటే అప్పుడే పదకొండు అయిపోయిందా ? అని ఆశ్చర్యపోయేది. వాళ్ళు భోంచేసాక పాఠాలు అప్పజెప్పుకోవటమో, వర్కు చేయించటమో చేసేది. ఈలోగా పెద్ద వాళ్ళిద్దరూ వచ్చేసేవారు వాళ్ళతోపాటు తను భోంచేసేది. తిరిగి పిల్లలంతా స్కూళ్ళకి కదిలేసరికి రెండు గంటలయ్యేది. కాసేపు నడుం వాలుద్దామని అనుకుంటుండగా అవతల కొంపలేవో మునిగిపోతున్నట్టు తలుపు దబదబా బాదేది పని మనిషి. గిన్నెలు తోమి, ఇల్లూ గుమ్మాలు ఊడ్చి అది వెళ్ళగానే పాలమ్మాయి తయారయేది. పాలు అందుకుని టైము చూస్తే నాలుగు దాటిపోయేది ఇంకేం చేరబడుతుంది. పిల్లలు స్కూళ్ళ నుంచి ఆకలితో వస్తారు. వాళ్ళు వచ్చేసరికి కాస్త ఉప్మా తిప్పేస్తే .. అనుకుని వంటింట్లో దొరబడుతుంది.

అయిదున్నర లోపు పరంధామయ్యగారితో సహా అందరూ ఇల్లు చేరిపోతారు. వాళ్ళ కాఫీ ఫలహారాలు ముగించాక, తిరిగి వంటప్రయత్నం మొదలుపెట్టేది. పిల్లలకి పక్కలు పరచి, తన పడకపై తను నడుం వాల్చేసరికి గడియారం పదిగంటలు కొట్టేది. పడక మీద వాలగానే ఉప్పెనలా నిద్ర ముంచుకువచ్చేసేది అలా మత్తుతో అరగంటో, గంటో గడిచేసరికి హరికృష్ణో భారతో లేచి కూర్చునేవారు దగ్గుతునో, తుమ్ముతునో ఊపిరాడక అమ్మా ... అని ఏడుపు లంకించుకునేసరికి, ఎవరో తరిమినట్టు చప్పున లేచి కూర్చునేది. దగ్గు మందు ఇచ్చి, అమృతాంజనం గుండెకి మర్దనా చేస్తూ కూర్చునేది తరువాత కళ్ళు మూద్దామంటే ఆ నిద్రాదేవి అలిగినట్టు మరి దగ్గరకు వచ్చేది కాదు నిద్రరాక పక్కమీద అశాంతిగా కదులుతున్న ఆమెని చూసి ఆ నిద్రాదేవి ఏ వేకువనో కరుణించేది. కానీ తొలికోడి కూతకి అలవాటుగా మెలకువవచ్చి లేచి కూర్చునేది ఆనాటి చురుకుతనం, బలం ఏమయ్యేయో ఏమో ! తలచుకుంటేనే ఆశ్చర్యంగా ఉంటుంది

* * *

ఆదివారాలు వస్తే ఎక్కడికైనా వెళ్ళటమంటే







భారతి, హరికృష్ణ ఎక్కువగా మక్కువ చూపించేవారు. పిల్లలందరు ఫలానా చోటకి వెళ్తే బాగుంటుందని తనతో సమాలోచనలు జరిపి తన ద్వారా తండ్రికి సిఫారసు చేయించేవారు. అది ఓ.కె అయ్యేసరికి ఒక ఆదివారం గడిచిపోయేది. సాయంత్రం వెళ్దామనుకుంటే ఆ రోజు ఉదయంనుంచే కట్టుకోబోయే బట్టలగురించి ఆలోచించేవారు ఇదా ... అదా అంటూ తనకి పనిమధ్యలో పదిసార్లు అడ్డు తగిలేవారు. వాళ్లకి ఇష్టమయినవి ఏవో కనిపెట్టి అవే చూపించేది తను దానికి వాళ్ళు బ్రహ్మానందపడిపోతూ

కాస్త నలిగిఉంటే లాండ్రీకివెళ్ళి ఇస్త్రీ చేయించుకుని వచ్చేవారు. భారతి అయితే మరీను. తన పెట్లో చీరె దొంతరలు నాలుగయిదుసార్లు తిరగేసి ఒక చీర బయటకులాగి "అమ్మా ... ఇది కట్టుకో" అనేది. మరో పావుగంటకి ఏమాలోచించేదో అది పెట్టేసి ఇంకోచీర బయటకు లాగేది. ఆఖరికి వెళ్ళటానికి తయారయేటప్పుడు మొదట తీసిన చీరే తెచ్చిఇచ్చేది. తను నవ్వుతూ అందుకునేది. రెండు గంటల్నుంచి వంట మొదలుపెట్టి, హడావిడిగా పిల్లల్ని తయారు చేసి, తను సిద్ధమయ్యేసరికి ఏవాడూ రాని దూరపు బంధువులో, ఎన్నాళ్ళనుంచో వచ్చి రెండురోజులుండాలనుకునే దగ్గర చుట్టాలో హఠాత్తుగా దిగబడేవారు వాళ్ళని చూడగానే వెలిగి వెలిగి ఆరిపోయిన దీపపు సెమ్మెల్లా పిల్లల ముఖాలు నల్లబడిపోయేవి పిల్లలతోపాటు అన్నపూర్ణకూడ నీరుకారిపోయేది ప్రయాణం ఆగిపోయినందుకు చిన్నవాళ్ళు ఏడుస్తుంటే ... పెద్దవాళ్ళు అలిగి సాధించేవారు. వాళ్ళని సముదాయించేసరికి తల్లిప్రాణం తోకకివచ్చేది. అలా అనుకున్నప్పుడంతా బయటకు వెళ్ళే వీలు కలిగేదికాదు. ఏ ఆటంకం లేకుండా వెళ్ళేరోజు పిల్లల ఆనందానికి అంతుండేది కాదు. వెళ్ళివచ్చిన ఆనందం రెండు రోజులవరకు పిల్లల ముఖాల్లో తాండవించేది వేసవి శెలవలు వస్తే తాతగారింటికో, మేనత్తల ఇళ్ళకో వెళ్తామని పట్టుపట్టేవారు. ఒంటరిగా వాళ్ళని ఎప్పుడూ పంపలేదు. వెళ్ళవలసి వస్తే అందరూ కలసి వెళ్ళి ఒక వారం రోజులుండి వచ్చేవారు. అలాగే ఒక సంవత్సరం... తాతగారింటికి పంపించమని పెద్దవాళ్ళిద్దరూ మరీ పట్టుపట్టేరు. పరంధామయ్యగారు వినిపించుకోలేదు. సరిగ్గా ఆ సమయంలోనే ఆ ఊర్లో పనిపడి అన్నపూర్ణ అన్నయ్య ముకుందరావు వచ్చేడు. మేనమామని చూడగానే పిల్లలు మళ్ళీ వెళ్తామని సణుగుడం మొదలుపెట్టేరు. "వాళ్ళు మరీ అంత సరదాపడుతుంటే.. ,కాదనటం ఏంబాగులేదు. నాతో తీసుకువెళ్ళి పదిహేను రోజుల తర్వాత తెచ్చిదిగబెట్టేస్తాను." అన్నాడు ముకుందరావు కొంతసేపువాదనలు జరిగాక పరంధామయ్యగారు రాజీకి వచ్చి పది రోజులుంచి పంపేయాలనితీర్మానించారు. పెద్దవాళ్ళిద్దరూ పరమానందభరితులై బట్టలు సర్దుకుంటుంటే హరికృష్ణ, భారతీ తాము కూడా వెళ్తామని పేచీపెట్టటం మొదలుపెట్టేరు. వాళ్ళని ఎంత సమాధానపరచి సముదాయించినా వాళ్ళు పట్టు విడువలేదు. మరీమొండిగా వెళ్తామని ఏడవటం. అన్నం తినకుండా సాధించటం మొదలుపెట్టేరు.

"పోనీలేమ్మా... రానీ... పదిరోజులేగా. నలుగుర్ని తీసుకువెళ్ళి పదిరోజుల్లో జాగ్రత్తగా నీకప్పజెప్తాను," అన్నాడు ముకుందరావు నవ్వుతూ.

"అమ్మో... ఎవరూలేకుండా నేనుండలేను అన్నయ్యా... చిన్నవాళ్ళిద్దరూ.. ఎందుకులే. తరువాత వాళ్ళేవూరకుంటారు."

"పోనీ... అన్నపూర్ణని కూడా నాతో తీసుకువెళ్తాము... బావగారు..."

భార్యాభర్తలు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

"ఇప్పుడు కుదరదులే... పిల్లల్నితీసుకువెళ్ళు." అన్నారు పరంధామయ్యగారు.

హరికృష్ణ, భారతి ఎగిరిగంతేసారు. నలుగురూ వెళ్ళటానికి నిర్ణయమయేసరికి పెద్దవాడు రమణ చప్పున తల్లి దగ్గరకు వచ్చాడు.

"అమ్మా. . నేను వెళ్ళను, మళ్లీసారివెళ్తాను" అన్నపూర్ణ అర్థంకానట్లే చూసింది. "మేమెవ్వరం దగరలేకుండా నువ్వు ఉండలేవమ్మా .. పాపం హరికృష్ణ, భారతి సరదా పడుతున్నారుగా వాళ్ళు ముగ్గురూ వెళ్ళనీ... ఈసారి దసరా శలవులకి నేను వెళ్తాను" అన్నపూర్ణ కళ్ళు చెమ్మగిల్లాయి. చప్పున వాడ్ని పొదవిపట్టుకుని దగ్గరకులాక్కుంది. ప్రేమతో వాడి తల నిమురుతూ "అసలు సరదా పడినవాడివి నువ్వేగా. వెళ్ళు... పదిరోజులే కదా" అంది ఆర్తిగా రమణ అడ్డంగా తలాడించాడు. "లేదమ్మా... మా నలుగుర్లో ఆటకి వెళ్ళి ఒకరు ఆలస్యంగా వస్తేనే ఇంట్లో ఒకచోట నీకాళ్ళు నిలవ్వు. ఇంట్లోకి వరండాలోకి పదిసార్లు తిరుగుతుంటావు. మేమందరం వెళ్ళపోతే.. పదిరోజులు నువ్వుండలేవు నేనువెళ్ళినా నామనసంతా నీమీదే ఉంటుంది. అక్కడ ఒక్క రోజుకూడా ఉండలేను." అంటూ స్టడీరూమ్‌లోనికి వెళ్లిపోతున్న రమణని చూసి పరంధామయ్యగారు, ముకుందరావు సంభ్రమాశ్చర్యాలతో విభ్రాంతులయ్యారు. అన్నపూర్ణ కళ్ళు ఏకధారగా వర్షించసాగేయి అవి అశ్రువులు కాదు... ఆనందభాష్పాలు. తనని, తన మనసుని అర్థం చేసుకున్న తనయుడు తనకుండగా తనకేమిలోటు? తనెంత అదృష్టవంతురాలు !

కన్నమనసుని, కన్నకొడుకు అర్థం చేసుకున్న ఆ క్షణాలు ఎంత మధురమైనవి. అనాటి ఆ అనుభూతి ఒక తియ్యటి జ్ఞాపకంగా మాత్రమే మిగిలింది. అనాటి రమణ, రమణారావుగా మారిపోయాక కన్నవాళ్ళు బ్రతికే ఉన్నారన్న సంగతి మరిచిపోతుంటాడు. తండ్రి ఉత్తరం అందినప్పుడే బ్రతికే ఉన్నారని గుర్తువస్తుంది. వృద్ధాప్యంలో ఒంటరిగా ఎలా కాలక్షేపం చేస్తున్నారో ... అని ఒక్కనాడు అతను ఆలోచించలేదు. అలా ఆలోచిస్తే ఒక్కనాడయినా తమని రమ్మని పిలిచి ఉండేవాడు.

* * *

పిల్లలు పెద్దవాళ్ళు అవుతున్నకొలది, ఏడాదికో మెట్టు చొప్పున పై చదువుల్లోకి అడుగుపెడుతున్నకొలది ... అడపాదడపా అప్పులు చెయ్యటం తప్పటం లేదు పరంధామయ్యగారికి. పిల్లలు బుద్ధిమంతులు. ఒక్కక్లాసులో కూడ తప్పకుండాపైకి వచ్చారు. అందరగా క్లాసు తెచ్చుకునే పిల్లలే. అయితే వాళ్ళు మనస్ఫూర్తిగా తాము కోరిన చదువులు చెప్పించటం తన స్తోమతకు మించిన పనే అయినా పరంధామయ్యగారు ముందంజ వేసారు. తత్ఫలితంగా ఉన్న రెండెకరాల పొలం అమ్ముడుపోగా, వడ్డీతో సహా పదివేలు అప్పు మిగిలింది. ముగ్గురు కొడుకులూ ఈనాడు ఉన్నత పదవుల్లోనే ఉన్నారు. వాళ్ళకు వచ్చిన కట్న కానుకలతోనే, భారతి పెళ్ళి ఘనంగా జరిపించేసి, అప్పులన్నీ తీర్చేసారు. మొదట సుందరంకి ఒక ప్రైవేటు కంపెనీలో ఉద్యోగంకోసం నాలుగువేలు ఇవ్వవలసి వచ్చింది. అప్పటికే పెద్ద మొత్తం అప్పు ఉండటం వలన మరెక్కడ అప్పు పుట్టలేదు అన్నపూర్ణ ... తన చేతుల్లో మిగిలిన ఒక జత

గాజులు, మంగళసూత్రం తాడుతీసి భర్త చేతుల్లో పెట్టింది. బాధపడుతునే తప్పనిసరిగా అందుకున్నారు పరంధామయ్యగారు. అది చూసిన మందరం చప్పున తల్లి దగ్గరకు వచ్చాడు. "అమ్మా...నాకు ఉద్యోగం వచ్చాక నీకు ఒక జతకాదు. రెండు జతల గాజులు, మంగళసూత్రం తాడు చేయిస్తానమ్మా ..." అన్నాడు. అన్నపూర్ణ ... ఆప్యాయంగా మందరం చేతుల్ని పట్టుకుంది

"మందరం ... నువ్వామాట అన్నావు ... అదే నాకు పదివేలు. నగలు ఇవ్వవలసి వచ్చినందుకు నేను బాధపడుతున్నాననుకున్నావా ? లేదు...పైగా చాలా సంతోషిస్తున్నాను, ఈ నగల వల్లనైనా వివాహ్య గట్టెక్కినందుకు. నాకు నగలు...నాణ్యాలు అవసరం లేదు బంగారాన్ని మించిన ... రత్నాలాంటి నా బిడ్డలే ... నా ధనరాశులు. మీరే నా నిధి. మీరు చల్లగా వెయ్యేళ్ళు వర్ధిల్లాలి. అంతే...నా జీవితంలో ఇంకే కోరికాలేదు" తల్లి మాటలు విన్న మందరం విపరీతంగా చలించిపోయాడు. అమ్మకు తప్పకుండా ఆ నగలు చేయించి తీరులానని మనసులో శపథం పూనాడు కానీ అతనికి పెళ్ళయి భార్య కాపురానికి రాగానే స్వార్థం అతని కన్నులు కప్పేసింది. ఆ శపథం .. ఆవిరిగా మారి అంతరిక్షానికి చేరుకుంది.

* * *

ఒకరోజు అన్నపూర్ణకి చాలాజ్వరం వచ్చేసింది. దానికితోడు తలతిప్పు, వాంతులు. మంచంమీద నుంచి లేవబోతున్న తల్లిని వారించి బకెట్ తెచ్చి ముందు పెట్టాడు హరికృష్ణ.

"ఏమిట్రా ఇది ... నేను మెల్లగా లేచి బాత్‌రూమ్‌కి వెళ్తాను."

"వద్దు. .వద్దు నువ్వసలు కదలొద్దు. వాంతి చేసేయ్. ఫరవాలేదు." బకెట్ పైకెత్తి సిద్ధంగా పట్టుకున్న కొడుకునిచూసి చెమ్మగిల్లినకళ్ల వత్తేసుకున్నది. తల్లి సందేహమేమిటో అర్థమయినట్టు "ఏమిటమ్మా...నేనెక్కడ అసహ్యపడతాననేకదూ... నీ ఆలోచన. మాకింద నువ్వెన్ని విధాలుగా బాధపడలేదు! అసహ్యించుకున్నావా? . . ఇదీ...అంతే" అన్నాడు. నిన్న మొన్నటివరకు లాగులు వేసుకుని తిరిగే హరికృష్ణ ఎంత ఎదిగిపోయాడు ?!

తరువాత రెండు రోజులవరకు హరికృష్ణ,

## స్వార్థమా కళ్లు తెరచి చూడు

భారతి వంతులవారిగా మంచందగ్గరే కాచుకుని ఉన్నారు. టైముకి మందులివ్వటం, బార్లీ కాచి ఇవ్వటం, బ్రతిమాలి రొట్టె తినిపించటం, తల నొప్పి విపరీతంగా వస్తే, నుదుట అమృతాంజనం మర్దన చేయటం ఈ పనులన్నీ హరికృష్ణ చేసేవాడు. భారతి వంటపని చేసేది. జ్వరం తగ్గేక తల్లి బట్టలు ఉతకటం లాంటివి చూసిన హరికృష్ణ మందలించేవాడు రెస్టుగా ఉండమని. ఆ యింటి పిల్లల్ని చూసి ఇరుగు పొరుగూ ముచ్చట పడేవారు. అప్పుడు హరికృష్ణ ఇంటర్ చదువుతున్నాడు. అటువంటి హరికృష్ణ ... తల్లికి టైఫాయిడ్ వచ్చి చిన్నవాడ్ని చూస్తానని కలవరిస్తే, తండ్రి రాసిన ఉత్తరానికి...శలవు దొరకలేద ..రావటం కుదరదని వ్రాసేసాడు.

* * *

పిల్లలకోసమని తరచు ఏదో ఒక పిండివంట చేస్తుండేది అన్నపూర్ణ. కూరలు ఒకరికిష్టమయినా మరొకరు తినేవారుకాదు. అందుకోసం ఎలాలేదన్నా పూటకి రెండు కూరలు, ఒక పచ్చడి చెయ్యాలంసి వచ్చేది. అప్పుడే ఎదుగుతున్న భారతి ఇది కనిపెట్టి "ఏమిటమ్మా... అన్నన్ని కూరలెందుకు? ఒక్కటి చేస్తే పోయేదిగా. అసలే నాన్నగారికి అప్పులు పెరిగిపోతున్నాయి." అనేది. ఏది చేసినా...ఇప్పుడెందుకు అనవసరంగా చేసావు, అది అనవసరపు ఖర్చు...ఇది దండగ ... అన్నపదాలతో ఖండిస్తుండే భారతి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళగానే మారిపోయింది. భర్తతో కలసి కన్నవారింటికి వచ్చినప్పుడు జీవితమంతా ఒక్క తిండికోసమే అన్నట్టు ప్రవర్తిస్తుంది. భర్తకి ప్రొద్దుట టిఫెనుతో రెండు ఉడకపెట్టిన గుడ్లు ఉండాలి. నేతి ఉప్మాలో, పకోడిలలో జీడిపప్పు తప్పక ఉండితీరాలి. జీడిపప్పు లేకపోతే... అతను అసలు ముట్టనేముట్టడట. లిస్టులో ఒక కేజీ జీడిపప్పు రాసి తండ్రికి అందించేస్తుంది. ఇక అల్లుడు... సరేసరి. ఎంత తిన్నా, ఎంత పుచ్చుకున్నా ఇక్కడ ఉన్నన్నాళ్ళు ముఖం గంటు పెట్టుకునే ఉంటాడు. పూర్వజన్మలో తన లక్షల ఆస్తిని కాజేసిన వ్యక్తులు ఈ అత్తమామలే అన్నట్టు, ఆనాటి ఆస్తి రాబట్టటమే తన జన్మ హక్కయినట్టు ఆ యింటి అల్లుడయ్యాడు. అతనికి ప్రతి సంవత్సరం ఒక కొత్త కోరిక పుట్టుకువస్తుంది అది అత్తమామలే తీర్చాలి అత్తమామల్ని పీడించి వాళ్ల ఇస్తేనేగాని తనకి గతిలేనట్టు ప్రవర్తిస్తుంటాడు. పదివేలు కట్నం ఇచ్చుకుని, సారె చీర బాగానే ముట్టజెప్పినా, ఉత్తపుణ్యానికి పెళ్ళాడినట్టు మాటల్లో ఎరిలిస్తుంటాడు. పరంధామయ్యగారు కూతురికి పదివేలు ఇచ్చినా, కొడుకులకి ఇంతకావాలని ఎవరికీ అడగలేదు ఏదో వాళ్ళకు తోచింది ఇచ్చేరు. అప్పులు తీరగా భారతి పెళ్ళి సలక్షణంగా చెయ్యగలిగారు పిల్లల రెక్కలువచ్చి ఎవరిదారిని వాళ్ళు వెళ్ళిపోయాక, అద్దెకొంపలో, పెన్షను డబ్బులతో కాలక్షేపం చేస్తున్నారు. ఒక్కకొడుకూ పదిరూపాయలైనా పంపలేదింతవరకు. రమణ కాస్త పెద్దపని చేస్తుండటం వలన ఒకసారి ఉత్తరం వ్రాసార, 'రమణా .. పెన్షను డబ్బు సరిపోవటం లేదు. మీ అమ్మకి మందులు, ఇన్జక్షనులు అవుతున్నాయి నెలకి వదో, వరకో నువ్వు పంపితే బాగుండు'నని కొద్దిరోజులయిన తరువాత జవాబు వచ్చింది —

"నాన్నా .. పట్నంలో ఎంత వచ్చినా మాకు పిల్లలతో సరిపోవటంలేదు డబ్బు పంపటం కష్టం. కావాలంటే ... మీరు, అమ్మ మా దగ్గరికి వచ్చేసి జీవితకాలం ఉన్నా ఫరవాలేదుగానీ డబ్బు మాత్రం పంపటం కుదరదు" అని వ్రాసాడు రమణ పరంధామయ్యగారు విరక్తిగా నవ్వుకున్నారు కన్నతల్లిని తండ్రిని జీవితకాలం పోషించటం కూడ ఒక ఉపకారమయిందా ఈ రోజుల్లో ... అనుకుంటే ఎప్పుడూ తడి ఎరుగని కళ్ళు చప్పున చెమ్మగిల్లాయి ఉత్తరం అన్నపూర్ణకి చూపించలేదాయన బిడ్డల పట్ల ఆమెకి ఉన్న ప్రగాఢ నమ్మకాల్ని వమ్ము చెయ్యటం ఆయనకి ఇష్టం లేకపోయింది

* * *

ఉత్తరాలు పోస్టుచేసి తిరిగి వచ్చిన పరంధామయ్యగారు పిల్లల్ని తలచుకుని కంటనీరు పెడుతున్న భార్య దగ్గరకు వచ్చారు మందలింపుగా చూస్తూ, ఓదార్పుగా ఆమె తల నిమురుతూ — "ఎందుకు పూర్ణా...నువ్విలా ఏడుస్తుంటే నా కెంత బాధగా ఉంటుందో తెల్సా? ఊరుకో. వాళ్ళు






వస్తారో రారో అనేకదూ నీ ఆరాటం...తప్పకుండా వస్తారు. వాళ్ళు రాకపోయినా ... నీ కన్నప్రేమ వాళ్ళ కాళ్ళూ చేతులు కట్టిపడేసి ... నీ ముందుకి లాక్కువస్తుంది. చూస్తుండు'' అన్నారు. ఆయన అన్నట్టే వారంరోజులు గడిచేసరికి నలుగురు దగ్గర్నుంచి ఉత్తరాలు వచ్చాయి. తప్పక వస్తున్నామని రాశారు. ఆ ఉత్తరాలు చూడగానే అన్నపూర్ణమ్మకి సగం శక్తి వచ్చేసింది. లేచి నెమ్మదిగా తిరుగు లాడటం ప్రారంభించింది. పనిమనిషితో ఇల్లు బూజులు దులిపించి, ఇల్లూ గుమ్మాలు కడిగించింది. ఇత్తడిసామాను తోమించింది. లేని ఓపిక తెచ్చుకుని పప్పులు, బియ్యం బాగుచేసి, మిల్లుకి పంపి మర పట్టించింది. పండగ నాలుగురోజులుందనగానే, ఒక్కొక్కరోజు వ్యవధిలో నాలుగు కుటుంబాలవాళ్ళు దిగేరు. రమణకి ఇద్దరు పిల్లలు, సుందరంకి ఇద్దరు, హరికృష్ణకి ఒక కొడుకు, భారతికి ఒక కూతురు కొడుకులు, కోడళ్ళు,కూతురు, అల్లుడు, మనుమలు, మనుమరాళ్ళతో ఆ యిల్లు కళకళలాడి పోతూంది వారంరోజులు ముందునుంచి కాస్త అటూ ఇటూ తిరిగేయటం వలన అన్నపూర్ణమ్మకి చెప్పలేనంత నీరసంగా ఉంది. ఒంట్లో ఉన్న కొద్దిపాటి శక్తి ఊదేసినట్టు హరించుకుపోయింది. వంటింట్లో కోడళ్ళు వెతకటానికి ఓపిక లేనివారిలా ''అత్తయ్యా . కందిపప్పు ఎక్కడుంది? పంచదార ఏ డబ్బాలో ఉంది . అవాలు కనిపించటంలేదు .. అసలు ఉన్నయ్యా'' అని చెవులు కోసిన మేకల్లాఅరచి అరిచి అడుగుతున్నారు. చేసేదిలేక ఇక తప్పదన్నట్టు ఒళ్ళుబిగువునా ఓపికతెచ్చుకుంటూ లేచి వంటింట్లోకి వెళ్ళింది అన్నపూర్ణమ్మ. ఎక్కడ ఏది ఉందో చూపిద్దామని వంటింట్లోకి వెళ్ళిన ఆమెని మంచి మాటల్తో అందులో ఆమెని బందీనిచేసి కోడళ్ళు ముగ్గురూ బయటకుజారుకున్నారు. అంతే! వండటం, వడ్డించటం ఆమె స్పెషల్ డ్యూటీగా మారింది. పండుగ మూడురోజులూ వండి వడ్డించటమేగానీ, ఆమె తిన్నదో లేదో ఎవరూ కనుక్కోలేదు. అయితే ఆ సంగతి, తాళికట్టిన భర్త కనుక ఒక్క పరంధామయ్యగారికే తెలుసు. ఆఖరికి కన్నకూతురు భారతి కూడ తల్లికి సహాయ పడదామని రాలేదు. ఆమె అనారోగ్యం గురించిగానీ, తింటోందో లేదోనని గానీ కనుక్కోలేదు. ఎన్నో సంవత్సరాలుగా భర్త ఎడబాటు నొంది ... అతడికి వాచిపోయినట్టు, ఇప్పుడే ఈ క్షణంలోనే కలుసుకున్నట్టు . అస్తమానం భర్త ఎదుటకూర్చునే కాలక్షేపం చేస్తుంది భారతి. పట్టుమని పదినిముషాలు తల్లిదగ్గరగానీ, తండ్రి దగ్గరగానీ కూర్చుని మనసు విప్పి మాట్లాడలేదు పండగ మూడురోజులు గడిచేసరికి అన్నపూర్ణమ్మ కడుపులో విపరీతంగా నొప్పివచ్చేసింది. నొప్పిరాగానే వేసుకునే మాత్రవలన ఆ నొప్పి ఉపశమనం పొంద లేదు సరికదా మరీ ఉధృతం అయిపోయింది. ఏ కొడుకూ డాక్టరు దగ్గరకు వెళ్ళాలని ముందుకి రాలేదు. పరంధామయ్యగారే ఆదరాబాదరా చెప్పులు వేసుకుని బయటకు వెళ్ళారు. కొడుకులు, కోడళ్ళు, అల్లుడూ, కూతురు, పిల్లలతో సహా అంతా మంచం చుట్టూ మూగిపోయారు. భారతి తల్లి పక్కలో కూర్చుని కంటనీరు పెట్టుకుంటోంది. 'ఇలా

## స్వార్థమా కళ్ళు తెరచి చూడు

ఎప్పట్నుంచి వస్తోంది' అని అందరూ కలసికట్టుగా ప్రశ్నిస్తుంటే నోటితో చెప్పటానికి శక్తిలేక చేతితో సంజ్ఞ చేసింది అన్నపూర్ణమ్మ. పావుగంటలో డాక్టరు వచ్చి ఇంజక్షనుచేసి వెళ్ళాక, చూస్తుండగనే గాఢనిద్ర ఆవరించేసింది అన్నపూర్ణమ్మకి. ఆమె నిద్రపోగానే ''అమ్మకి ఇలా ఎప్పట్నుంచి నాన్నా?'' అని ప్రశ్నించాడు సుందరం. వాలుకుర్చీలో కూర్చొని ఉన్న పరంధామయ్యగారు మెల్లగా వెనక్కి వాలి చేరబడ్డారు. ''నాలుగు నెలల నుంచి'' అన్నారు గంభీరంగా.

''మాకు తెలియపరచలేదు ఎందుకు?'' విస్మాయంగా ప్రశ్నించాడు రమణారావు.

''మీ అమ్మ తెలియపరచ వద్దంది దూర ప్రాంతాలలో ఉన్న మీరు ఈ విషయం తెలిసి, ఎక్కడ తల్లడిల్లిపోతారోనని ఆమె భయం. అయితే ఇప్పుడు మిమ్మల్ని పిలిపించింది ముఖ్యంగా ఈ విషయం చెప్పటానికే.''

శ్రోతలందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. పరంధామయ్యగారు ఒక్క క్షణం ఆగి అందరి ముఖాలు చూసి తిరిగి చెప్పటం మొదలు పెట్టారు.

''మీ అమ్మని స్పెషలిస్టు దగ్గరకి తీసుకు వెళ్ళాను. ఆమె చెక్ చేసి, టెస్టులన్నీ ముగిసాక ప్రారంభ దశలో ఉన్న కాన్సరు అని తేల్చింది.''

''కేన్సరా ? .'' శ్రోతలందరూ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు.

''అవును... ఆపరేషను చేస్తే తప్పకుండా బ్రతుకుతుందన్నారు. కానీ ఆపరేషనుకి ఆరు వేల రూపాయలు అవసరం ''

ఆరు వేలే !! అందరి చేతులు గుండెలమీదకి వెళ్ళటం ఆయన దృష్టిని దాటిపోలేదు

''అవును... ప్రాణంకన్నా ఆరు వేలు ముఖ్యం కాదు కదా. . ముఖ పరిచయం ఉన్న ప్రతి వ్యక్తిని అప్పు అడిగాను. అందరూ మొండి చెయ్యే చూపించారు. అయితే అలా మొండిచెయ్యి చూపించిన వ్యక్తులే ఒక ఉచిత సలహా మాత్రం ఇచ్చేరు అదేమిటంటే ''పెద్ద ఉద్యోగాలు చేస్తున్న ముగ్గురు కొడుకులు ఉండగా మీకేం లోటండీ అప్పుకోసం కాళ్ళు అరిగేటట్టు తిరగటం ఎందుకు? వాళ్ళని పిలిపించి ఈ సంగతి చెప్పండి వాళ్ళమ్మని వాళ్ళే రక్షించుకుంటారు ..'' అని. అందుకే అందర్నీ ఒక్కసారి రమ్మని రాసాను ఈ విషయం మీ అమ్మకు మాత్రం తెలియదు.''

ఈ మాటలు వింటూనే కొడుకులు, కోడళ్ళ ముఖాలు కాంతి విహీనమయ్యాయి అల్లుడు తనని ఎక్కడ అడుగుతారోనని. . ఏదో అర్జంటు పని గుర్తుకు వచ్చినవాడిలా తనకి కేటాయించిన గదిలోని వెళ్ళిపోయాడు ఇనుమును ఆకర్షించిన అయస్కాంతంలా అతని వెనకనే వెళ్ళిపోయింది భారతి. ముగ్గురు కొడుకులు, భార్యల ముఖాల్లోనికి చూస్తున్నారు భార్యామణుల కన్నుల్లో భావాలను చకచక చదివి అర్థం చేసుకున్నవారిలా ముగ్గురూ తలలు విదిలించారు

''ఆరు వేలు . అంత డబ్బు మాకు మాత్రం ఎలా వస్తుంది నాన్నా.'' అన్నాడు హరికృష్ణ. ''ఆరు వేలు .. ఒక్కడినే సర్దమనలేదు నేను ఒక్కొక్కరూ రెండేసి వేలు సర్దుబాటు చేస్తే ఆపై ఖర్చులకు నేనేవో పాట్లు పడతాను ''

''రెండు వేలు మాత్రం ఎలా వస్తాయి? ఏదో రెండు వందలు మూడు వందలయితే సర్దగలం గానీ '' పరంధామయ్యగారిలో ఉప్పెనలా పొంగుకు వస్తున్న కోపాన్ని బలవంతంగా అణచిపెట్టుకుంటూ లేచినిల్చున్నారు

''అడగటం నాదే బుద్ధితక్కువ. ఇవ్వాలంటే ఏ లోనో తీసి ఇవ్వలేరా ?''

రమణరావు చప్పునఅన్నాడు 'ఎన్ని విధాల తియ్యాల్లో అన్ని లోన్లు తీసేగా సెకండ్ హాండ్ స్కూటరు నేను కొన్నది.'

''క్రిందటి నెలలోనే రెండు వేలు లోను తీసి ఉమకి గాజులు చేయించాను.'' అన్నాడు సుందరం.

''మా ఆఫీసులో లోన్లు దొరకటం కష్టం నాన్నా .. '' అన్నాడు హరికృష్ణ తన తప్పేమి లేదన్నట్టు ఆయన మరేమి మాట్లాడలేదు. వాళ్ళ ఎదుట ఇంకాసేపు ఉంటే తనని తాను నిగ్రహించుకో లేక, ఆవేశంలో ఏ మాటలు నోట జారతాయోనని భయపడి . ఉత్తరీయం భుజంమీద వేసుకు బయటకు వెళ్ళిపోయారు.

ఆ రోజంతా ఆయన ఎక్కడెక్కడో తిరుగుతునే ఉన్నారు మధ్యాహ్నం ఇంట్లో భోంచేయలేదు రాత్రి భారతి వచ్చి బ్రతిమాలితే పాలు మాత్రం తీసుకున్నారు అయితే కోడళ్ళు ముగ్గురు చెవులు కొరుక్కోవటం మధ్య గదిలో కూర్చొని ఏవో కాగితాలు చూసుకుంటున్న ఆయన చెవికి సోకుతునే ఉంది.

''ముసలాయనకి బాగా కోపం వచ్చినట్టుంది వస్తేరానీ పిల్లలని చదివించి వృద్ధిలోకి తేవటం కూడ ఒక ఉపకారంలాగే కబుర్లు చెప్తున్నారు

### ''శిలాయుగ'' చికిత్స

మానసిక రోగుల చికిత్స కోసం పశ్చిమ జర్మనీలో ఒక క్రొత్త విధానాన్ని రూపొందించారు. ఈ విధానంలో రోగులు శిలా యుగం నాటి పనిముట్లతో పనిచేయవల్సి వుంటుంది. ఈ పనిముట్లలో రాళ్ళు ఎముకలు కూడా వున్నాయి. దీని కోసం ఫ్రాంకు ఫర్టు నగరంలో శిలాయుగపు వర్కుషాపుని ప్రారంభించారు. ఈ విధంగా రోగిని శిలాయుగానికి తీసుకెళ్ళడం వలన ప్రాచీన, ఆధునిక వ్యవస్థలకు తాను వారధినని గుర్తించేటట్లు చేస్తారు. అందువలన అతనిలోని 'అహం' తొలగి మామూలు మనిషికావడానికి అవకాశం ఏర్పడుతుంది. ఈ పనిముట్లతో పని చేయడం వలన అతనిలో నిర్మాణాత్మకమైన మార్పులు వచ్చి అనిశ్చిత పరిస్థితి తొలగి యితరులతో సంబంధాలను పెంచుకొంటాడు.




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### కె. ఎస్. ఆర్ - మహబూబ్‌నగర్

నా వయస్సు 18 సం॥లు. నాకు చిన్నప్పటి నుండి కడుపులో నెప్పి వున్నది. డాక్టరుకి చూపించి మందులు వాడాను కాని ఏమీ తగ్గలేదు. ఇంకా ఎక్కువవుతున్నట్లున్నది. రాత్రి ప్రక్కకు తిరిగి పడుకున్నట్లయితే నెప్పి ప్రారంభమవుతుంది. కడుపులో ఎప్పుడూ గుర్...గుర్ మనే చప్పుడు వస్తుంది. కొద్ది సమయము కూర్చొని లేస్తే శరీరము తిరిగినట్లయి కళ్ళు కనిపించటంలేదు దీనికి నేనేమి చెయ్యాలి ?

★ బేరియం మీల్ సీరీస్ (ఎక్సరేలు) చూసి కాని రోగ నిర్ధారణ చేయటం కుదరదు. అల్సరేటివ్ కొలైటిస్ అనే రోగం ఉన్నదీ లేనిదీ పై పరీక్షవల్ల తెలుస్తుంది. రోగ నిర్ధారణ ననుసరించి చికిత్సా విధానాన్ని నిర్ణయించాలి.

ఇకపోతే మీరు వ్రాసిన రెండవ లక్షణానికి బలహీనత మాత్రమే కారణం. దీనిని పోస్చ్యురల్ హైపోటెన్షన్ అని అంటారు. ఇనుపధాతువులు గల మాత్రలు వాడటం, పుష్టిగల ఆహారాన్ని తీసుకోవటంవల్ల ఈ లక్షణం నయమవుతుంది.

### ఎల్. జి యస్ - విజయవాడ

నా వయస్సు 19 సం॥లు. 5 నెలల క్రితం కళ్ళ క్రింద వుబ్బినట్లు వచ్చినది. ఇప్పటికీ ఆ వుబ్బు అలాగే వున్నది. ప్రొద్దున్నే నిద్రలేచేసరికి కను రెప్పలు వాచి వుంటాయి. క్రమముగా సాయంత్రానికి తగ్గుతున్నాయి. కనురెప్పల వెంట్రుకలు వూడు తున్నాయి. డాక్టరుకి చూపిస్తే రక్తం తక్కువగా వున్నదని ఫెరోకార్బియం సిరప్ వాడమన్నారు. అది వాడినపుడు కొంచెము తగ్గినా మరలా అదే విధముగా వున్నది. వూడిన కనురెప్ప వెంట్రుకలు మరలా వస్తాయా ?

★ రక్త పరిశోధన (హీమోగ్లోబిన్, టి. సి. + డి. సి., యూరియా) మూత్ర పరిశోధన చేయించుకోవటం అవసరం.

మూత్ర పరిశోధనలో ఆల్బ్యుమిన్ ఉన్నట్లు తేలితే నెఫ్రైటిస్‌కిగాను చికిత్స పొందవలసి ఉంటుంది.

### టి. ఎస్. డి. - తాడిపత్రి

నా వయస్సు 21 సం.లు. నాకు వివాహమయి 6 సంవత్సరములు అయినది. ఇంతవరకూ నాకు పిల్లలు కలుగలేదు. నాకు బహిష్టు సమయములో విపరీతముగానూ, మిగతా రోజులలో కొంచముగాను పొత్తికడుపు నెప్పి వస్తోంది. ఈ పొత్తికడుపు నెప్పికి పిల్లలు పుట్టకపోవటానికి ఏమైనా సంబంధము వున్నదా ?

★ బహిష్టు సమయంలో వచ్చే కడుపు నెప్పికి గర్భం రాకపోవటానికి సంబంధం లేదని చెప్పవలసి ఉంది. కానీ మామూలు రోజులలో కూడా పొత్తి కడుపు నెప్పి రావటం అసహజమే. మీరు నిపుణులైన లేడీ డాక్టర్లచేత పరీక్షింపచేసుకొని తగిన చికిత్స పొందవలసి ఉంటుంది. ముందుగా మీవారిని సెమెన్ అనాలిసిస్ చేయించుకోమనండి.

### డి. ఆర్ - భిలాయ్

'మయోకార్డియల్ ఇన్‌ఫ్రాక్షన్' ఇతర ఏ కాంప్లికేషన్సూ అంటే మధుమేహం, బ్లడ్ ప్రెషర్, గుండె జబ్బులు, పెన్సిలిన్ రియాక్షన్ లేకుండా అయ్యే అవకాశం వుందా ?

★ ఒక మధుమేహం, బ్లడ్ ప్రెషర్, అతి స్థూల్యం మొదలయిన కారణాల వల్ల మాత్రమే మయోకార్డియల్ ఇన్‌ఫార్‌క్షన్ వస్తుందనేది ఎక్కడాలేదు. ఈ లక్షణాలు ఉన్నవారికి మామూలు వారికన్నా ఈ రోగం వచ్చే అవకాశం మాత్రం ఎక్కువ అని చెప్పవలసి ఉంది.

పై లక్షణాలు లేనివారికి కూడా ఈ రోగం వస్తూ ఉన్నది.

పెన్సిలిన్ రియాక్షన్‌కి మయోకార్డియల్ ఇన్‌ఫ్రాక్షన్‌కి సంబంధం లేదు. ●

---

## స్వార్థమా కళ్ళు తెరచి చూడు

మనం తెచ్చిన కట్నం డబ్బంతా ఏం చేసాడు? ఉండే ఉంటుంది. ఈ విధంగా మనదగ్గర రాబట్టాలని చూస్తున్నాడు" ఇక ఆ మాటలన్నీ వినలేక ఆయన లేచి బయట వరండాలోనికి వెళ్ళిపోయారు.

* * *

రోజూలాగే ఆ రోజు తెల్లవారింది. కాస్త అలస్యంగా లేచిన కోడళ్ళు, ఇంట్లో అత్తగారు మామగారు కనిపించకపోవటంతో హడావిడిగా పరుగెత్తి భర్తలను లేపారు. అల్లుడుగారితోసహా అందరూ మధ్య గదిలోనికి చేరారు. కాగితం లాంటిది ఏదైనా ఉందేమోనని పెద్దకొడుకు వెతుకుతూ చూస్తూ తల్లి మంచంమీద తలగడ ఎత్తాడు. అతని ఊహ పొల్లుపోలేదు. కాగితం మడత, తాళాలగుత్తి ఉన్నాయి. కాగితం మడత విప్పి చదవటం మొదలుపెట్టాడు. అతని వెతుకుతూ తక్కిన తలలు చేరాయి. ఆ ఉత్తరంలో ఇలా ఉంది :

చి॥ పిల్లలకి నా ఆశీస్సులు,

ఎన్నాళ్ళనుంచో తీర్థయాత్రలు చెయ్యాలనే కోరిక మీ అమ్మకి ఉండేది. మనిషి సుఖంగా ఉన్నప్పుడు భగవంతుడ్ని విస్మరించినట్టే...మనమకి బలంగా తగిలిన గాయాన్ని మాన్పుకొని భగవత్సన్నిధిలో తిరిగి మనశ్శాంతిని పొందాలని నేనూ మీ అమ్మ అప్పటికప్పుడు ఈ నిర్ణయానికి వచ్చాము. అయితే మాలో ఈ ఆలోచన కలిగి ఇంత త్వరగా ఈ ప్రాప్తం కలగటానికి కారకులు మీరేకాబట్టి ఆ పుణ్యమంతా మీదే. మీ అమ్మకి ఇప్పుడు కొంచం బాగుంది. కానీ ఆపరేషను జరగందే ఆమె బ్రతకదు. మీ ఉద్యోగాలు రావటంకోసం అప్పటికప్పుడు అప్పు పుట్టకపోతే బెంగ పెట్టుకుంది కానీ... ఈనాడు తన ప్రాణం నిలవటం కోసం ఆరు వేలు అప్పు దొరకలేదంటే ఆమె కించిత్ కూడ బాధపడలేదు.

"పోనీలెండి... ఎన్నాళ్ళున్నా... ఏదో ఒకరోజు ఈ తనువు విడిచిపెట్టవలసిందే కదా! ఇంక నాకేం లోటు. ఏం కొరత. పిల్లలంతా ఎవరిమట్టుకు వారు సుఖంగా ఉన్నారు. ఏదో మీ చేతుల్లో నా జీవితం వెళ్ళబెట్టుకోవాలన్నదే నా ఆశ" అంది. కానీ... రమణా... నాకు... నాకు... మీ అమ్మ కావాలి. ఆవిడ తోడు లేనివాడు నేనుకూడ జీవించ లేను. మన దేశంలో ఉన్న ఎన్నో ధర్మాసుపత్రులు... ఉత్తి ధర్మానికి వైద్యం చెయ్యవని, కన్నకొడుకు లున్నా ఆపదలో ఆదుకుంటారన్నది పొరపాటు. వారి దగ్గర్నుంచి ఆదరాభిమానాలు ఆశించటం వ్యర్థమని కొత్తగా తెలుసుకున్నాను. మీ అమ్మ ఆరోగ్యం... ఆ భగవంతుని చేతుల్లోనే పెడతాను. ఆయనే ఏదో ఒక విధంగా సహాయపడగలడన్న ఆత్మవిశ్వాసంతో బయలుదేరి వెళ్తున్నాము మీ ప్రయాణాలు కూడా ఈ సాయంత్రమే కదా! మీరంతా వెళ్ళిపోతుంటే మీ అమ్మ భరించలేదు. అందుకే మేమే ముందుగా బయలుదేరి వెళ్తున్నాము. మీతో చెప్పినందువల్ల పెద్ద ప్రయోజనం ఏమీ లేదుకనుక చెప్ప కుండానే వెళ్తున్నాము. అన్ని గదులకు తాళాలువేసి, పక్కింటి రంగనాధంగారికి తాళాలివ్వవలసింది చి॥ మనుమలకి, మనుమరాళ్ళకి, కోడళ్ళకి, భారతికి, భాస్కరంకి అందరికీ ప్రేమతో ఆశీర్వదిస్తూ ఈ లేఖ ముగిస్తున్నాను. మళ్ళీ మీ అమ్మ మునుపటిలా తిరిగి ... మీ అందరికీ వండి వార్చే శక్తి కలిగిన నాడు ... మళ్ళీ మీ అందరూ రావాలని కోరు కుంటున్నాను.

ఇట్లు

సదా మీ క్షేమం కోరే

మీ నాన్న పరంధామయ్య. ★

**తలనొప్పి కోసం ఎన్నో వాడిచూశాను,**
**అయితే నిజంగా పనిచేసేది ఒక్కటే!**

**సారిడన్**
ట్రేడ్ మార్కు 'రోష్'

శక్తివంతమైనది. సురక్షితమైనది.
ఒక్కటి వేసుకుంటే చాలు.




HTB-RPL-7797




(గత సంచిక తరువాయి)

అనుభవజ్ఞుడైన చిత్రకారుడు గీచిన చిత్రపటం లాగా ఉంది ప్రకృతి !

అందమైన అమ్మాయి వయ్యారంగా కట్టిన తెల్లచీరలాగా ఉంది రాత్రి !

అందమంతా తనలోనే ఇమిడ్చుకుని – ఠీవిగా, గర్వంగా ప్రజల కష్టసుఖాలు వింటూ రాజమాత తల ఆడించినట్లుగా మెల్లగా ఊగుతున్నాయి సూర్యకాంతి పూవులు !

స్వచ్ఛత అనేది మాలో మాత్రమే ఉన్నాది అన్నంత దర్పంగా వెన్నెట్లో వింత అందాలతో మెరుస్తున్నాయి నందివర్ధనాలు !

జీబ్రా మీది చారలు నలుపో, తెలుపో తెలియనట్లుగా గింజ అందమా, పూవు అందమా అని పోటీకి నిలబడిన తన బిడ్డలు పోట్లాడుకుంటూంటే 'మీ ఇద్దరూ అందమేలే' అని మందలింమతూన్నట్లుగా నిండుగా ఉన్నాది దానిమ్మచెట్టు !

ముదురాకు పచ్చని పట్టుబట్టపై తెల్లటి జరీ పూవులను ఎంతో శ్రద్ధగా, నైపుణ్యంతో కుట్టిన కాశ్మీరు శాలువాలాగా ఉంది పందిరి అంతా ప్రాకిన మాలతీలత !

ఇన్ని అందాలను 'చక్కగా చూడొచ్చుగదా' అనే మేమింత పొడవుగా పెరిగాము అన్నట్లుగా ఉన్నాయి కొబ్బరిచెట్లు !

మీరెన్ని అందాలు ప్రదర్శించినా, నేను అందించే చల్లదనానికి పోటీ రావు అని తన అసంఖ్యాకమైన చేతులను ఊపుతూ మరీ చెబుతూన్నది వేపచెట్టు !

'నిశ్శబ్దంలో వెన్నెల మరింతగా విరగబడి అందాన్ని చాటుతుంది' అని స్పష్టంగ తెలుస్తున్నాది

ఆ ప్రశాంతమైన వాతావరణంలో దాదాపు, అర్ధరాత్రి సమయంలో ఎలాంటి తడబాటూ, భయమూ లేకుండా వడివడిగా నడుస్తున్నా దొక మానవమూర్తి ! ఒకసారి చూస్తే మళ్ళీ మళ్ళీ చూడాలనిపించేంతటివాళ్ళు ఎక్కడో కొద్దిమంది మాత్రమే ఉంటారు ! అలాటి కోవకు చెందిన ఆ వ్యక్తి పొడవూ, ఆ గంభీరతా, ఆ ఠీవీ చూస్తే– ఆ నడక ఒక పురుషునిది అని ఇట్టే తెలిసిపోతున్నాది ! అతను ఒక ఇంటిముందు ఆగి అటూ ఇటూ చూసి చటుక్కున లోపలకు వచ్చేసాడు.

గేటు లోపల – ఆరుబయట – వరుసగా మంచాలపైన హాయిగా నిద్రపోతున్నారు.

ఎవరికోసమో వెదకాలన్నట్లుగానూ, కాని, 'ఎలా వెదకటం' అని తటపటాయిస్తున్నట్లుగానూ మెల్లగా అటూ ఇటూ తచ్చాడుతున్నాడు.

పట్టెపట్టని నిద్రలో ఎందుకో మెలకువ వచ్చి కళ్ళు విప్పి చూచేసరికి -- ఎదురుగా మంచాల దగ్గర అటూ ఇటూ తిరుగాడుతూన్న ఆకారాన్ని చూడగానే గబుక్కున "ఎవరదీ ?" అని అడిగారు

ఉలిక్కిపడ్డాడతను ఆ ప్రశ్న వచ్చిన వైపుకు చటుక్కున తల త్రిప్పి చూసాడు.

రెండడుగులు ముందుకువేసి, మంచాన్ని సమీపించి మెల్లగా, మృదువుగా అన్నాడు –

"నేను .. నేను వెంకట్‌ను మామయ్యా."

ఆ పేరు వినగానే ఆశ్చర్యపోయారు రాఘవయ్యగారు. ఆ వెంటనే అమితమైన సంతోషంతో, అతన్ని దగ్గరకు తీసుకోవాలనే ప్రీతి కోరికతో ఎడం చేతిని చాచి "బాబూ ... బాబూ, నువ్వేనా" వణుకుతూన్న కంఠంతో కలవరించినట్లుగా అంటూ అతన్ని ఆప్యాయంగా చుట్టేసారు.

అదో దివ్యానుభూతి !

మంచంలోంచి లేవకుండా, కేవలం ఎడం చేతితో తనని చుట్టి, సంతోషాన్ని దుఃఖంతో మిశ్రమం చేసి అనుభవిస్తూన్న ఆ ముసలాయనను చూస్తుంటే వెంకటరత్నానికి ఏదో అనుమానం వచ్చింది.

"మామయ్యా ! ఏమిటి ? ఇలా అయిపోయారేమిటి ? ఏమైనా సుస్తీయా ?" అతని చూపులు మంచంపైన బిగదీసినట్లుగా ఉన్న కుడిచేతిపై నిలచిపోయాయి.

తిరుణాలలో తప్పిపోయిన కొడుకుని వెతికి వెతికి – ఇహ దొరకడనే నిరాశతో, నిస్పృహతో ఉన్న సమయంలో – హఠాత్తుగా తప్పిపోయినవాడు ఎదురుగా వచ్చి నించుంటే – ఆ మాతృ హృదయం అప్పటివరకూ మూగగా పడిన బాధ గబుక్కున అశ్రురూపంలో బయటకు వస్తూంటే–అమాంతంగా ఆ కొడుకుని అక్కున చేర్చుకున్నపుడు – ఓహ్ ! అది - నిర్వచనానికి అందని అనుభూతి !

ఎన్నాళ్ళగానో పస్తులున్నవాడికి ఒక్కసారిగా పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం వడ్డించితే ఎలా ఆబగా తింటాడో – అలాగే ఎంతో ఆర్తితో అతన్ని చుట్టేసుకుని అన్ని విషయాలనూ వివరిస్తున్నారు రాఘవయ్యగారు.

ఆయన చెబుతూన్న విషయాలు వింటూంటే వెంకటరత్నం మనసు గాడిపొయ్యిలా మండింది !

"ఆ మోసం చేసినవాళ్ళను ఊరకే ఎందుకు వదిలారు మామయ్యా ?" ఆవేశంగా అడిగాడు.

"ఏం చేస్తాం బాబూ ! వాడికర్మన వాడే పోతాడు ! మనల్నింత అన్యాయం చేసి వాడు బాగుపడతాడంటావా !"

"లక్షణంగా ఉంటాడు మామయ్యా ! ఆ కర్మ, ఆ వేదాంతం – అదంతా ఒట్టిది! ఎందుకూ పనికిరానిది మామయ్యా !

పదిమందిని కొట్టి సంపాదించినవాడు బాగానే ఉంటాడు ! వాడిని మీరనేట్లుగా ఏ దేవుడూ, ఏ విధీ ఏమీచేయదు ! మనం వాడ్ని వదిలేస్తే – అది వాడిమీద జాలి చూపటం మాత్రమే కాదు మామయ్యా, మనకు తెలియకుండానే మనమే మరికొందర్ని అన్యాయం చేసినట్లు మామయ్యా."

"మనమా ! మనం అన్యాయం చేసామా ?"

"అవును మామయ్యా ! ఖచ్చితంగా మనమే చేస్తున్నాం ! మనల్నింత మోసం చేసినవాడు మనలాటి ఇంకెంత మందిని మోసం చేయడు ! మనం వాడ్ని వదలబట్టే – అంతమంది వాడిచేతిలో పడ్డారు ! దానికి కారణం పరోక్షంగా మనమే అవుతాం మామయ్యా."

రాఘవయ్యగారు మాట్లాడలేదు. ఆయన ఇంతదూరం – అసలు ఇలా జరుగుతుందేమో! అని కూడా ఆలోచించలేదు ! ఇపుడు వెంకటరత్నం చెబుతూంటే ఆయన భయభ్రాంతులయ్యారు.

**జరిగిన కథ–17** కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం. ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకుంటుంది తార. ప్రకాశం మంత్రివర్గం ఏర్పాటయిన తరువాత కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. తత్ఫలితంగా వెంకట్‌ను పట్టుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తుంటుంది పోలీసుశాఖ. అతనెప్పుడు పూర్తిగా వేషం మార్చేసి తప్పించుకు తిరుగుతుంటాడు. తమకి దొరక్కుండా తప్పించుకు తిరుగుతున్నాడనే కోపంతో వెంకట్ ఇంటిపై మెరుపు దాడులు చేస్తూ అతని కుటుంబ సభ్యులతో చాల అసభ్యంగా, అమానుషంగా ప్రవర్తించుతుంటారు పోలీసులు. వెంకట్ ఆజ్ఞపై తార పిల్లలతో పుట్టింటికి వెళ్తుంది. భాగస్వామిని నమ్మి మోసపోవడంతో, రాఘవయ్యగారు చాలా కృంగిపోయారు. పిల్లలను ప్రసాద్ తనవెంట తీసుకు వెళ్తాడు. ఇక నాగరత్నమ్మ నోటికి, చేసే పనులకు అదుపు అనేది లేకుండాపోయింది. రాఘవయ్యగారికి పక్షవాతం రావడంతో కుడికాలూ, చెయ్యీ పడిపోతుంది తారను తీసుకు రమ్మని వెంకట్ మనిషిని పంపితే రాఘవయ్యగారు అంగీకరించకపోవడంతో వెళ్ళలేకపోతుంది.

"ఈ చెంపన కొడితే ఆ చెంప చూపెట్టమన్నాడు బాపూజీ! కాని, మామయ్యా! అలా చూపెడితే అవతలివాడు నిజంగా సిగ్గుపడతాడంటారా! ఉహూఁ – లేదు మామయ్యా అది ఎప్పటికీ జరగదు! ఆ దెబ్బతోనే అవతలివాడి మనసు మార్పుగలిగితే – మా యీ పోరాటానికి అర్థమే లేదు మామయ్యా! అర్థమయిన వాడికి మనం చెప్పక్కరలేదు! అర్థంకాని వాడికి 'తెలియటం లేదులే' అని చెప్పటం మానకూడదు! నాలుగుతన్ని అయినా చెప్పాలి! మీరు చాలా పొరపాటు చేశారు మామయ్యా! వాణ్ణి అట్లా ఒదిలి ఉండకూడదు! ఇప్పటికయినా మించిపోయింది లేదు. వాడిపేరు, వాడెక్కడుంటాడు – అన్నీ వివరాలు నాకు



చెప్పండి. నేను కనుక్కుంటాను."

వెంకటరత్నం ఆవేశంగా మాట్లాడుతూంటే అతనికి తెలియకుండానే అతని గొంతు కొంచెం శబ్దం చేసింది. ఆ మాటలకు మేలుకొంది తార. ఆ మృదు గంభీర స్వరం వింటూ నిజమా, కలా లేక భ్రమా అన్నట్లు కళ్ళు పెద్దవిచేసి మరీ చూస్తోంది.

అప్పుడే తల తిప్పి చూసిన వెంకట్ మంచం మధ్యలో పోతపోసిన విగ్రహంలా కూర్చుని ఉన్న తారను చూసి చెబుతూన్న మాటను మధ్యలోనే ఆపేశాడు.

రాఘవయ్యగారు కూడా తారను చూశారు. ఆయనకు చప్పున నాలుగురోజుల క్రితం 'కొరియర్' ద్వారా చేసిన కబురు జ్ఞాపకం వచ్చింది. 'అల్లుడు కూతుర్ని చూసేందుకు వచ్చి ఉంటాడని' తృప్తిగా నవ్వుతూ, ఆప్యాయంగా అన్నారు–"అమ్మా, తారా! అబ్బాయికి ఏమైనా ఉంటేపెట్టు! ఎప్పుడు భోంచేశాడో, ఏమో!"

"అహాఁ – తింటానికేమీ వద్దుగానీ కొంచెం మంచినీళ్ళు ఇవ్వు!" అతని కంఠంలో ఏదో అర్థంకాని ఉద్వేగం!

తార మంచం దిగి లోపలకు వెళ్ళింది.

"లోపలకు వెళ్ళు బాబూ!" వెంకట్ చేతుల మీద ఆప్యాయంగా తడుతూ అన్నారు రాఘవయ్యగారు.

లేచి లోపలకు వెళ్ళాడు వెంకట్. దీపం వెలిగించి వత్తి సరిచేస్తూన్నది తార

"తారా"

చటుక్కున తల తిప్పి చూసింది. పొడవాటి జడ వీపుమించి ప్రక్కకు జారింది. కొద్దిగా నలిగిన వంగపూవు చీరమీద నలుపు జాకెట్ ముద్దుగా ఉన్నాది! పెరిగిన ముంగురులు నుదుటిమీద పడి అదోక రకమైన అందాన్నిస్తున్నాయి! అనుభవిస్తూన్న మానసిక వ్యధలకు చిహ్నంగా కొంచెం చిక్కినట్లుగా ఉన్న తార వెంకట్ కళ్ళకు అద్భుతంగా కనిపిస్తున్నాది!

అతని ఒంట్లోని ప్రతి అణువూ ఎంతో ఆర్తిగా, ఆప్యాయంగా 'తారా, తారా, తారా' అని కోటి గొంతుకలతో పిలుస్తుంటే – తార మెల్లిగా లేచి అతనివైపుకు అడుగు వేసింది. చటుక్కున చేయిచాపి వేగంగా తారను తన దగ్గరకు లాక్కుని గుండెల్లో దాచుకున్నాడు వెంకట్!

అబ్బ! ఈ క్షణం కోసరం ఎన్నాళ్ళు? – ఎన్నాళ్ళనుండి ఎదురు చూస్తున్నాది – ఓహ్! అంత ఆనందాన్ని గుండెల్లో దాచుకోలేకపోతున్నాది తార. ఆమె శరీరం అంత గొప్ప అనుభూతిని భరించలేకపోతున్నాది!

'వియోగం తర్వాత సంయోగంలో అంత మహత్తు ఉన్నది కాబోలు!'

"తారా!" ఆమెని కౌగిలిలోంచి అవతలకు జరిపి ముఖంలోనికి చూడటానికి ప్రయత్నించాడు వెంకట్

"వెంకట్! నన్ను – నన్ను దూరం చేయకండి వెంకట్! మీకు దూరంగా నేను బ్రతకలేను. మీరెక్కడ ఉంటే నేనూ అక్కడే హాయిగా బ్రతగ్గలను. నన్నూ తీసుకుపోండి" మళ్ళీ అతని గుండెల్ని అంటుకుపోయి వెక్కి వెక్కి ఏడ్చేసింది తార!

ఎన్నో మాటలతో, ముద్దులతో, అనునయ వాక్యాలతో, చిరుకోపంతో తారను మామూలుగా చేయగలిగాడు వెంకట్.

పొలకోవ తింటూ భార్య భుజాల చుట్టూ చేయివేసి, ఆమె కుడిభుజంపై గడ్డమాన్చి చెవి దగ్గర గుసగుసగా అడిగాడు వెంకట్ – "తారా! నీ కోసం నేనెంతో ధైర్యం చేసి బయటకు వస్తే ఉత్త పాలకోవలతో నన్ను పంపేస్తావా?"

అతని కంఠంలోని మాధుర్యానికీ, అ పలికిన తీరులో చిందులేస్తూన్న కొంటెదనానికీ, అతని చూపుల్లోని మహత్తరమైన శక్తికీ తార కొండపల్లి బొమ్మలా సిగ్గుపడిపోయింది. ఒక్కక్షణం తటాపటాయించి మరుక్షణం రెండు చేతులూ ఎత్తి అతని మెడలో దండగావేసి అతన్ని హత్తుకుపోయింది. అతని గుండెంపైనా, కంఠం క్రిందుగానూ ముద్దు పెట్టుకుంది.

వెంకట్‌లోని కోరిక జరజరా పాకి ఒళ్ళంతా ఒక విధమైన ఉద్రేకంతో వేడిగా కాలిపోతున్నాది. తార చుట్టూ ఉన్న అతని చేతులు మరింత గట్టిగా

బిగుసుకున్నాయి. వన్నగా కంపిస్తున్న ఆమె అధరములపై గాఢంగా ముద్దుపెట్టాడు వెంకట్.

దూరంగా అమెరికన్ హాస్పిటల్ లోని గడియారం ఠంగు ఠంగున నాలుగు గంటలు కొట్టింది. ఉలిక్కిపడ్డాడు వెంకట్. తన కౌగిట్లో పిట్టలా ఒదిగిపోయిన తారను మరోమారు సున్నితంగా ముద్దు పెట్టుకుని, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని అరచేతిలో గీతలు గీస్తూ అన్నాడు –

''తారా ! నేను వెళ్ళిపోవాలి !''

''అప్పుడేనా ?''

''ఊఁ – మళ్ళీ రేపు రాత్రికి వస్తాను''

''రేపా ?'' ఆశ్చర్యంగా అడిగింది.

''ఊఁ – రేపు రాత్రికి వస్తాను.'' నవ్వుతూ అన్నాడు, ఆమె ముక్కుమీద వేలితో గీస్తూ.

''భయం లేదా ?'' ఎంతో అమాయకంగా అడిగిన ఆమె ప్రశ్న తమాషాగా ఉన్నది వెంకట్ కు.

''భయమే ! కాని, నీకోసం వస్తాను.''

తార సిగ్గుగా నవ్వింది.

''మరి, నేను వెళ్ళనా ?''

''స్వప్నను చూడరూ ?''

''ఇపుడు సమయం లేదు తారా. ఇప్పటికే చాలా లేటయిపోయింది. అందరూ ఇంగారు పడుతుంటారు. రేపు వచ్చినపుడు చూస్తాను నేను వచ్చినట్టుగా తనకు చెప్పకు.''

ఆ చిన్నారి మనసులో 'నాన్న నన్ను చూడకుండా వెళ్ళిపోయారు' అనే ఆలోచన రావటం నా కిష్టంలేదు అన్నట్టుగా చెబుతూన్న వెంకట్ ను చూస్తూ 'మీ భావం నేనర్థం చేసుకున్నానులే' అన్నట్టు చిన్నగా నవ్వింది తార

రాఘవయ్యగారితో చెప్పాడు.

''మంచిది బాబూ ! జాగ్రత్తగా వెళ్ళిరా.''

''మర్చిపోయాను. ఆ వివరాలు చెప్పండి.''

రాఘవయ్యగారు 'చెప్పాల్సిందేనా' అన్నట్టుగా చూసారు 'అవును' అంటూన్న వెంకట్ కళ్ళల్లోకి చూస్తూ ''నీకున్న అనేక సమస్యల్లో మళ్ళీ ఇదొకటా !'' అన్నారు.

''ఏం ఫర్వాలేదు. తారా, కొంచెం ఆ దీపం ఇలా తీసుకురా.''

## తార

గబగబా వ్రాసుకుని, ఎకవకా నడిచి, సందు మలుపు తిరిగిపోయాడు వెంకట్.

* * *

తారకు చెప్పినట్లుగా వెంకట్ ఆ మరుసటి రోజున రాలేకపోయాడు.

'వస్తారు, వస్తారు' అనే ఆశతో ఎదురు చూసిన తార అతను ఎంతకూ రాకపోయేసరికి చాలా నిరుత్సాహపడిపోయింది. ఆ తర్వాత ఏడ్చేసింది కూడాను. మనసులోని ఆ ఉక్రోషం, శరీరంలోని ఉద్విగ్నతా కన్నీటి ధారలతో కలిసి బయటకు వెళ్ళిపోయాక ఆలోచనాశక్తి కళ్ళు విప్పింది. వెంటనే 'ఎందువల్ల రాలేకపోయారో, ఆయన రాకపోవటానికి కారణం–ఏమైనా చిక్కుల్లో చిక్కుకున్నారేమో ! అసలు నిన్న 'చాలా లేటయింది' అనుకున్నారు – ఎలా చేరుకున్నారో, ఏమో !' – ఈ ఆలోచనలు తారను స్థిమితంగా ఉండనివ్వలేదు. ఆ రాత్రి – ఆదుర్దాతో, ఇంగారుతో, భయంతో – అబ్బ ! ఎలాగో గడిచి సూర్యోదయమయింది !

తన మనసులోని అలజడిని తల్లిడి పసిగడతాడేమో అని – తెచ్చిపెట్టుకున్న హుషారుతో పనులు చేస్తున్నాది తార.

ఉదయాన్నే వాకిలి ఊడ్చి, కళ్ళాపి జల్లి, ముగ్గుడబ్బా పట్టుకుని వాకిట్లోకి వచ్చేసరికి తెల్లబట్ట లేసుకున్న యువకుడొకడు ఒక చిన్న కాగితాన్ని తార చేతిలో ఉన్న ముగ్గుడబ్బాలో వేసి వెళ్ళిపోయాడు. అతను అలా వేయటం ఎవరూ గమనించటానికి – అసలు తార గమనించటానికే ఆస్కారం లేనంత ఎతురతతో చేయటం నిజంగా తారను ముగ్ధురాల్ని చేసింది.

తార కూడా ఏం జరగనట్టుగా వంగుని ముగ్గు వేసింది. అప్పటికే వీధుల్లో జనసంచారం మొదలైంది.

గబగబా లోపలకు వచ్చి వేపచెట్టు క్రిందకు వెళ్ళి చీటీ విప్పింది.

రెండే రెండు మాటలు !

'సారీ, తారా !'

వెంకట్ ఎప్పుడు చీటీలు పంపినా అంతే ! ఖర్మకాలి ఆ కొరియర్స్ ఎవరికైనా చిక్కినా, ఆ ఉత్తరాలు పట్టుబడ్డా కూడా ఎలాటి ప్రమాదాలూ జరక్కుండా ఉండటానికి అంతజాగ్రత్తగా ఉంటారు! అసలు ఈ కొరియర్స్ దే నిజంగా చాలా ప్రమాదకరమైన పని ! వాళ్ళు మామూలుగా పగలూ, రాత్రీ కూడా అందరితోనూ కలిసే తిరుగుతుంటారు ! ఎపుడు ఎవరికి అనుమానం వచ్చి ఎక్కడ కాల్చేస్తారో కూడా ఎవరికీ తెలియదు ! అసలు కొరియర్స్ అంటే రింగు లీడర్ కూ విప్లవ నాయకులకూ మధ్యనా, విప్లవ వాదులకూ బయటి ప్రపంచానికీ మధ్యనా వారధి లాంటివారు ! అండర్ గ్రౌండులో దాక్కుని రహస్యంగా తిరుగుతూ చేస్తూన్న వాళ్ళు – వాళ్ళ ఇళ్ళకుగాని, వేరే ఇతర నాయకులకుగాని ఏం చెప్పాలన్నా వీళ్ళే మోసుకుపోతారు !

ఆ తర్వాత కూడా నాలుగైదురోజులు అరడి నిరీక్షణలోనే గడిపింది తార. కానీ ఆ మరుచటిరోజు పేపర్లో పడిన వార్త చదివి నిర్ఘాంతపోయింది.

''ప్రముఖ డి. యస్. పి. పళనియప్పన్ ఒక రింగ్ లీడర్ ని వాకచక్యంగా కాల్చి చంపేసారు.''

ఆ రింగు లీడర్ పేరు, వివరాలు కూడా ప్రచురించారు ! అది చదివిన తార చాలా భయపడి పోయింది. వెంకట్ కూడా ఒక లీడరేనేమో అని తార అనుమానం.

'ఎప్పటికప్పుడు పొంచి చూసే ఈ ప్రమాదాల గుహను ఏనాటికి దాటగలమో !' ఎంత ధైర్యంగా ఉండాలనుకున్నా అపుడపుడూ ఆ అనుమానం ఆమెకు వస్తూనే ఉంటుంది.

* * *

మార్చి మాసం – 1950 !

ఎండలు మండిపోతున్నాయి – విప్లవకారుని గుండెలాగా !

నేలమీద కాలుపెడితే చుర్రున కాలుతోంది – వెంకట్ ఉపన్యాసంలాగా !

ఇహ మధ్యాహ్నమవుతున్నాదంటే చాలు. మనుష్యులు బయటకు రావాలంటేనే భయపడి పోతున్నారు – పళనియప్పన్ కాంపులాగా !

పళనియప్పన్ !

అబ్బ ! ఆ పేరు వింటేనే భయంతో ఒళ్ళంతా గజగజలాడేది !

---

'రేపెలాగూ రైలు ప్రయాణం చేస్తున్నారు కాబట్టి ఆ కట్లు ఇప్పుడే విప్పకుండా అలాగే ఉంచుకొంటే మళ్ళీ కట్లు కట్టించుకొనే పని ఉండదు !

..??

డాక్టర్ రాజేంద్ర MBBS

బాన రెడ్డి

వీడు చేసిన పాపాలకు తీసుకు వెళ్ళి బాగా మరిగే నూనెలో వెయ్యండి!!

విజయవాడ ఎండలలెక్క చెయ్యని నాకు ఈ వేడొక లెక్కా అప్పారావ్ !!

యమలోకం

భావన

పాపం! బొమ్మ వానలో తడిసి ముద్దయింది.
నా గొడుగు యిచ్చేశాను!!



టింకూ లాంటి బాబు మీకు
వున్నప్పుడు
కావలసిందే మరి **రీగల్**




ACIL/0366/82

**ఇండియాలో అత్యధిక శక్తిగల డిటర్జెంట్ బట్టలసబ్బు**

వేడెక్కిన రక్తం స్రవించి దూసుకుపోతు న్నట్టుగా నరాలన్నీ ఉబ్బేవి!

నారిని సంధించిన బాణానికి ఏదో ఒక పక్షి విలవిల్లాడుతూ నేల రాలినట్లే — అతడు చంపు చేసాడంటే — ఎవరో ఒక విప్లవకారుడు చరిత్రలో కలిసిపోయాడన్నమాటే!

అలాటి పళనియప్పన్ మోసం చేసి మరీ సుమారుగా ముప్పై ఏడు మంది ప్రాణాలు తీసాడు.

ఒక్కొక్క రింగ్ లీడర్ ఆధ్వర్యంలోనూ సుమారు ఎనభై 'డెన్స్' ఉండేవి! ఆ డెన్స్‌లో ఉండే విప్లవకారులకు కూడా ఒకరి గురించి మరొకరికి తెలిసేది కాదు. కాని, ఈ మొత్తం ఎనభై మంది గురించీ ఆ రింగు లీడర్‌కు మాత్రం తెలును!

అందువల్ల సాధారణంగా ఎవరైనా లీడర్ అరెస్టు అయినట్లు వార్త తెలిస్తే - 'అతడి నుంచి మిగిలినవాళ్ళ సమాచారాలు ఏ విధంగానైనా వాళ్ళు రాబట్టుకోగలరు!' అని మిగిలిన విప్లవకారులంతా ఆ ప్లేసెస్ నుండి మారిపోవటం జరుగుతుంది. కాని, ఈసారి పళనియప్పన్ అలా చేయలేదు. 'రింగ్ లీడర్‌ను చంపేసారు!' అనే వార్తను ప్రకటింపచేసాడు. కాని, నిజంగా అతడ్ని చంపలేదు. అతణ్ణి పట్టుకుని నానా చిత్రహింసలూ పెట్టి ఎలాగో వివరాలు రాబట్టుకుని సడెన్‌గా డెన్‌మీదికి దాడి చేయటమూ, నిర్దాక్షిణ్యంగా కాల్చి వేయటమూనూ!

ఓహ్! ఏ క్షణాన ఏ వార్త వినవలసివస్తుందో ఎవరికీ తెలిసేది కాదు.

దేశమంతా అలజడి! కల్లోలం!!

ఒకవైపున ప్రకృతి దాడి!

మరోవైపున ఈ నరరూప రాక్షసుల భయంకరమైన ప్రళయ తాండవం!!

విపరీత మేమిటంటే విప్లవకారుల మరణ వార్త ప్రజానీకానికి తెలిసినట్టుగా మిగిలిన విప్లవ కారులకు తెలిసేది కాదు! వాళ్ళకు ఆశ్రయమిచ్చిన పేద బ్రతుకులకు వార్తా పత్రికలు కొనటం వీలు కాదు! కొరియర్స్ వచ్చి చెప్పేవరకూ తెలియదు! కాని ఈ భయంకరమైన వాతావరణంలో, విలక్షణ మైన నిఘాలో కావలసినంత వేగంగా కొరియర్స్ కూడా వార్తల చేరవేయలేకపోయేవారు!

ఆ విధంగా ఒక వారం రోజుల లోపున ముప్పై ఏడు మందిని పిట్టల్ని కాల్చినట్టుగా కాల్చేసాడు!

ఒళ్ళంతా గగుర్పొడుస్తున్న ఆ వార్తల్ని చదువుతూంటే తారకు ఒళ్ళంతా ముంచుముక్కల మధ్య పెట్టినట్టుగా బిగదీసుకుపోతోంది! ఒక్కసారి వెళ్ళి ఆయా కుటుంబాలను ఊరడించి రావాలని ఉబలాట పడుతోంది.

కాని, వెళ్ళకూడదు! వెళ్తే ప్రభుత్వానికి మనల్ని మనమే పట్టిచ్చుకోవటం అవుతుంది!

ఎంత దుర్భరం!

కళ్ళు మూస్తే — కళ్ళల్లో భయంకరమైన దృశ్యాలు తిరుగుతుండేవి!

విధవలైన స్త్రీలు బొట్టు చెరిపేసుకుని, గాజులు పగలగొట్టుకుని, తాళిబొట్టు తీసేసి — హృదయ విదారకంగా విలపిస్తున్న ఆ ఆడకూతుళ్ళే కనిపించేవారు!

మునలి వయసులో 'తల కొరివిపెట్టి పున్నామ నరకం నుండి తప్పిస్తాడు' అనుకునే కన్నకొడుకు అకాల మృత్యువుకు బలి అయ్యాడని తెలియగానే గుండెలు బాదుకుంటూ విలపిస్తున్న వృద్ధ తల్లి తండ్రులు — మూసిన కళ్ళక్రింద ప్రత్యక్షమయ్యే వారు!

తండ్రిని కాల్చేస్తే, ఆ ఆవేదనలో తల్లి పిచ్చిదైపోతే, మిగిలిన పెద్దవాళ్ళు బరువైన గుండె లతో మూగవాళ్ళైతే, ఇంక ఇంట్లోని పిల్లలు ఆలనాపాలనా చూసేవాళ్ళు లేక పీక్కుపోయిన మొహాలతో, ఏడ్చి ఏడ్చి అలసిపోయి ఆకలికి సొమ్మసిల్లి అలాగే క్రిందపడి నిద్రలో కూడా వెక్కుతూన్నట్టు ఎగిరిపడే డొక్కలతో, బుగ్గలమీద ఎండిన చారికలతో దిక్కులేని వాళ్ళులాగా విలపిస్తున్న — ఆ అనాథలను తలుచుకుంటూ భోరున ఏడ్చేసింది తార!

* * *

## జీవిత నౌక!

జనన మరణ తీరాల మధ్య,<br>
ధనమనే నీటిలో<br>
తేలియాడే నౌక, ఈ జీవితం!<br>
ఇది కాలప్రవాహంలో<br>
ఎటు కొట్టుకుపోతుందో,<br>
ఏ సంసార సుడిగుండంలో చిక్కుకుంటుందో,<br>
ఎలా గమ్యం చేరుతుందో తెలీక,<br>
మనస్సనే తెరచాప<br>
'రెపరెప' కొట్టుకుంటోంది

— గమ్మి కృష్ణమూర్తి

మద్రాసు నుంచి చిన్న అల్లుడు వచ్చాడు. అతడ్ని చూడంగానే అందరూ ఎంతో ఆనందించారు. తలచి తలచి సరస కబుర్లు చెప్పించుకుని విన్నారు.

ఇంక నాగరత్నమ్మ కయితే అసలు ఏం చెయ్యాలో, ఏమిటో — ఏమీ తెలియటంలేదు. ఇన్నాళ్ళకు అల్లుడు — అందునా తనకెంతో ఇష్ట మయిన అల్లుడు వాకిట్లోకి వచ్చాడనే సంతోషంలో కాలూ చెయ్యీ ఆడటంలేదు! అప్పటికప్పుడు అనేక రకాల వంటకాలతో, పిండివంటలతో భోజనం తయారుచేసింది. కొసరి కొసరి వడ్డించి తృప్తి పడింది.

మరుసటి రోజున అతను వెళ్తూంటే అప్పటి కప్పుడు చెల్లెలి కొట్లోంచీ మంచి ఖరీదయినవి నాలుగు చీరలూ, అతనికి ఒకప్యాంటుకూ, షర్టుకూ సరిపడా బట్టలూ తెచ్చి అల్లుడికిచ్చింది. అటూ ఇటూ చూస్తూ, ఏమిటో రహస్యంగా చెబుతూ చేతికి డబ్బు ఇస్తున్నాది. ఆ సమయంలోనే ఏదో పనిమీద లోపలకు వెళ్ళబోయిన తార అది గమనించి చటుక్కున వెనక్కి తిరిగి వచ్చేసింది.

అతను వెళ్ళిపోయాడు

'అమ్మయ్య!' అని తేలిగ్గా నిట్టూర్చింది తార లేకపోతే నాగరత్నమ్మ కాస్త అవతలకు వెళ్తే చాలు, లోపలకు ఏదో పనిమీద వచ్చినట్టుగా రావటమూ, ఏదో ఒక వంకర మాట అనటమూ చేసేవాడు అతని చూపులు చూస్తుంటే తారకు ఒళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ పాకుతున్నట్టుండేది

ఛీ! ఛీ! అనుకునేది అసహ్యంగా

* * *

చంద్రం ప్రసాదుకు ఆ తర్వాత కూడా అప్ప డపుడూ ఉద్యోగం సంగతి గుర్తుచేస్తూనే ఉన్నాడు కేవలం ఆ పని అంతా అతని భుజాలపైనే వదల కుండా తను కూడా ఫ్రెండ్స్ ద్వారా ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు.

ఉన్నట్టుండి ఒకరోజు అతని స్నేహితుడొకడు ఒక విషయం ప్రస్తావనకు తెచ్చాడు "చంద్రూ! మా నాన్నగారు కంట్రాక్టులు చేస్తుంటారు! ఆయన చేతి క్రింద చాలామంది పని చేస్తున్నారు నీ కేమీ అభ్యంతరం లేకపోతే మా నాన్నగారితో చెబుతాను" అన్నాడు.

కాసేపు ఆలోచించాడు చంద్రం 'పోయి పోయి అలాటి నౌకరీకి ఒప్పుకోవటమా' అనే సందిగ్ధంలో పడిపోయాడు. మళ్ళీ తనకు తానే నచ్చచెప్పుకున్నాడు 'ఏదైనా అందులో తలపెట్టి అసలెలా ఉందో, ఏమిటో చూసి నెమ్మదిగా పని నేర్చుకోవచ్చుకదా' అని ఒప్పేసుకున్నాడు.

ఆ విషయం వినగానే ప్రసాదు, జయమ్మ కోప్పడ్డారు! "ఇలాటి నిర్ణయాలు తీసుకునేంత పెద్దవాడివి ఇంకా అవ్వలేదు" అంది జయమ్మ

"అక్కా! మీ కళ్ళకు ఎన్నేళ్ళొచ్చినా మేము పిల్లలుగానే కనిపిస్తాము, సరా! తర్వాత ఏ పనైనా నేర్చుకోకుండా చేయటం చాలా కష్టం! అనుభవం లేకుండా ఏమీ చేయలేం! కాబట్టి నువ్వేమీ అడ్డు చెప్పకుండా నన్ను వెళ్ళనియ్యి" అన్నాడు చంద్రం.

అతని పట్టుదల చూసి నిస్తబ్ధోయింది జయమ్మ

ఆ విషయాలు తండ్రితోనూ, అక్కతోనూ చెప్పటానికి వచ్చాడు చంద్రం.

ప్రయత్నాలు చేసేటపుడుగానీ, చెప్పటానికి బయలుదేరేటపుడుగానీ లేని ఏదో భయంలాటి భావం — రాఘవయ్యగారికి చెప్పాల్సొచ్చేసరికి అడ్డం వచ్చేస్తున్నాది.

మొత్తానికి అతను చెప్పలేదు "తర్వాత సమయం చూసి మెల్లగా నువ్వే చెప్పక్కా," అంటూన్న చంద్రాన్ని చూస్తే కళ్ళనిండా నీళ్ళు నిండుకున్నాయి.

"చంద్రూ! నాకోసం చదువు మానేసి ఈ వెధవ చాకిరీని నెత్తినేసుకుంటున్నావా?" ఆర్తిగా అడిగింది తార.

"అబ్బెబ్బే! అలాంటిదేమీ లేదక్కా. నువ్వు అలా అనుకుని బాధపడుతున్నావా! ఛ.. ఛ.." అంటూ అక్కను ఓదార్చాడు.

(ఇంకా వుంది)




దేశమంతటా నాగరిక యువతులు కోరి
ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల పుష్ప
విధానాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం
చేసేటందుకే కన్నుల కింపైన 14 రంగులలో
దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో
తయారుచేయబడు ఐటెక్స్ తిలకం
చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు

మధుర స్మృతులు కలిగించే ఆనందం...

రోజంతా నిలిచివుండే తాజాతనం




... మీరు ఎప్పుడూ
వాడే పరిమళము.

HTM-PL-2648

# చీకటిలో చిరుదీపం



వింజమూరి కృష్ణమూర్తి

పండగొస్తోందీ అన్న ఆనందం కన్నా ... పండగకి పిల్లలందరూ వస్తున్నారన్న సంతోషం ఉక్కిరి బిక్కిరి చేస్తోంది నారాయణమూర్తి గారిని, పార్వతమ్మగారినీ. ఆ వయసులో కూడా, లేని బలాన్ని కూడదీసుకుని ఒకరి మీద మరొకరు పోటీ పడుతూ ఇంటి పనులు పార్వతమ్మగారు, బజారుపనులు నారాయణమూర్తిగారు చేస్కుపోతున్నారు.

పిల్లలు పెళ్ళిళ్ళయి ఉద్యోగ రీత్యా తలో కోటా దూర ప్రాంతాలకి వెళ్ళిపోయి ఐదేళ్ళు పైగా అయింది. ఐదేళ్ల తరువాత మొదటిసారిగా వస్తున్నారు పండగకి. ఇన్నేళ్ళకి కొడుకులూ, కోడళ్ళూ, కూతురు, అల్లుడు మనవలు, మనవరాళ్ళూ వస్తున్నారు. ఉన్నదాంట్లో ఉన్నంత వీలాటి లోటు రాకుండా ఈ పండుగ మూడురోజులు పిల్లలందరితోనూ సరదాగా గడపాలి. అలాగే రాధ పెళ్ళి విషయం కూడా వీళ్ళందరూ ఉండగానే ఏదో ఒకటి నిర్ణయం చెయ్యాలి అనుకున్నారా దంపతులిద్దరూ.

నారాయణమూర్తిగారు టీచరుగా మూడేళ్ళ క్రితమే రిటైరయ్యారు మధ్య తరగతి మనిషి నీతికి, నిజాయితీకి విలువ ఇచ్చేవాళ్ళంటే ఆయనకి ఇష్టం. తను ఉద్యోగం చేసేది కేవలం తన బ్రతుకు బ్రతకడం కోసమే కాదు, తన విద్యార్థుల భవిష్యత్తు తీర్చి దిద్దాల్సిన బాధ్యత కూడా ఉంది అన్న సిన్సియారిటీ గల మనిషి బహుశా ఈ రోజుల్లో ఇలాంటి వాళ్ళు చాలా అరుదేమో ...

నారాయణమూర్తిగారి భార్య పార్వతమ్మ గారు భర్తకి అన్నివిధాలా తన సహకారం అందిస్తూ సంసారాన్ని వీలాంటి ఒడిదొడుకులు లేకుండా సాఫీగా నడిపే తెలివిగల ఇల్లాలు రాజశేఖరం, గోపాలం, జానకి, రాధలు వాళ సంతానం. ఉద్యోగంలో ఉండగానే కొడుకులిద్దరి పెళ్ళిళ్ళూ చేసారు మరో ఏడాదిలో రిటైరవబోతున్నారనగా పెద్ద కూతురు జానకి పెళ్ళి కూడా ఉన్నదాంట్లో ఉన్నంతగా గొప్పగానే చేశారు. కాకపోతే ప్రావిడెంటు ఫండు నుంచి పెద్ద మొత్తం లోనుగా విత్‌డ్రా చెయ్యవలసి వచ్చింది. అదీ సరిపోక బయట ఒకటి రెండు చోట్ల అప్పు కూడా చేశారు.

రిటైరయ్యాక వచ్చిన ప్రావిడెంటు ఫండు బ్యాలెన్స్, గ్రాట్యుటీలతో జానకి పెళ్ళికి చేసిన అప్పులు పూర్తిగా తీర్చేసి ఊపిరి పీల్చుకున్నారు. ఆ తరువాత ప్రతినెలా వచ్చే పెన్షన్ డబ్బు చాలక ఒకటీరెండు ట్యూషన్స్ చెపుతూ మామూలుగా సంసారాన్ని లాగిస్తున్నారు. నారాయణమూర్తిగారు చెయ్యవలసిన మిగిలిపోయిన బాధ్యతల్లా ఒకటే. చిన్న కూతురు రాధ పెళ్ళి చెయ్యటం. రాధ పెళ్ళి చేస్తే, నారాయణమూర్తిగారు పూర్తిగా విశ్రాంతి తీసుకోవచ్చు.

ప్రతి ఏడాదీ దీపావళి పండగకి పిల్లల్ని రమ్మని నారాయణమూర్తిగారు నెలరోజులు ముందుగానే ఉత్తరాలు రాసేవారు పెద్ద వాడు ఢిల్లీలోనూ, రెండోవాడు బొంబాయి లోనూ, కూతురు అల్లుడితో మద్రాసులోనూ స్థిరపడిపోయారు. ఇన్నేళ్ళలో ఏ నాడూ ఏ ఒక్కరూ రాలేదు. పెద్దాడికి ఇద్దరూ కొడుకులనీ, రెండోవాడికి ఓ కూతురనీ ... కూతురుకి ఓ కొడుకు, ఓ కూతురు అని ఎప్పుడో వ్రాసిన ఉత్తరాలలో చూసారు కాని తను మనవలని, మనవరాళ్ళని చూసుకొని

ఆనందించే అదృష్టానికి నోచుకోలేదు ఆ దంపతులిద్దరూ. అంతంత దూరం వెళ్ళి వాళ్ళని చూసొచ్చే స్తోమత లేదు. పోనీ అలా అని ఒక్కసారి కూడా ఏ ఒక్కళ్ళూ "మీరు రండి నాన్నగారూ...అమ్మా"అని పిలవలేదు. డబ్బు పంపినా రాలేదు. అందుకు బాధ పడ్డారు గాని ఏం చెయ్యగలరు? ప్రతి ఆడదీ ఏదో ఓ విధంగా 'సెలవు దొరకలేదు' 'ఒకళ్ళూ ... 'పిల్లలకి ఒంట్లో బాగాలేదని' మరొకళ్ళూ 'మీ అల్లుడు గారు క్యాంపుకి వెళ్ళాల్సి వచ్చింది అనుకోకుండా'అని కూతురు ఇలా వంకలతో ఇన్నేళ్ళూ రానేలేదు. పిల్లల్ని మనమల్ని మనమరాళ్ళని చూడాలన్న ఆశ, నిరాశగానే మిగిలిపోయింది.

ఈ సారి పండగకి పిల్లల్ని రమ్మని రాయకూడదనే నిర్ణయానికొచ్చారు నారాయణ మూర్తిగారు. కాని పార్వతమ్మగారు నారాయణమూర్తిగారు ఉత్తరాలు రాసేవరకూ వదిలి పెట్టలేదు. మగవాడు మనసు ఉన్నా చంపుకోగలడు కాని ఆడది అలా చంపుకోలేదు. అందులోనూ కన్నతల్లి ఎలా చంపుకోగలదు? అందుకే భార్య మాట కాదనలేకపోయారు. తన నిర్ణయాన్ని సడలించుకున్నారు. పిల్లలందరికీ పండగకి తప్పకుండా రమ్మని ఉత్తరాలు రాసారు.

వారం రోజుల్లో పిల్లలందరి దగ్గరి నుంచీ ఉత్తరాలొచ్చాయి- ఈ సారి అందరూ వస్తామన్నట్టుగా రాసారు. పెద్దవాడు ఓ వారం రోజులు సెలవు పెట్టుకొని వస్తున్నాను అని రాస్తే, రెండోవాడు 'పండగ మూడురోజులూ తప్పకుండా అక్కడే ఉంటాను మీ కోడలు, పిల్లలతో' అని రాసాడు. కూతురు కూడా పండగ ముందు రోజు వస్తున్నట్టు ... రిజర్వేషన్ కూడా చేయించబోతున్నట్టు వ్రాసింది. ఈ ఉత్తరాలన్నీ పండగ పదిరోజులుందనగా వచ్చాయి. నారాయణమూర్తిగారు, పార్వతమ్మగారు ఎంతో సంతోషించారు ఇన్నాళ్ళకి పిల్లల్ని, కోడళ్ళని, అల్లుడిని, మనమలని మనమరాళ్ళని చూడబోతూన్నందుకు, వాళ్ళతో పండగ జరుపుకోబోతున్నందుకు. ఓ విధంగా రాధ పెళ్ళి జరిగి పోయిందన్నంత సంతోషించారు

వారం రోజులు ఇట్టే గడిచిపోయాయి పండగ మర్నాడే...ముందురోజు వంటింట్లో పార్వతమ్మగారు స్వీట్స్ ప్రిపరేషన్‌లో మునిగి తేలుతున్నారు. భార్య ఒక్కతే కష్టపడుతూంటే చూడలేని నారాయణమూర్తిగారు ఆ ప్రిపరేషన్‌లో పార్వతమ్మగారికి సహాయ పడుతున్నారు. వంట వండుతూంది రాధ.

"ఇన్ని రకాల స్వీట్స్ ఎందుకు పార్వతీ... ఒక రకమే మరిన్ని చెయ్యలేక పోయావా?' తయారవుతూన్న లడ్డూలు, జిలేబీలు బాదుషాలు చూసి అడిగారు నారాయణ మూర్తిగారు.

"మీరు మరీ అండీ ... లడ్డూలంటే అల్లుడికి ఇష్టం, చిన్నాడికి బాదుషాలంటే ప్రాణం, పెద్దదానికి జిలేబీలంటే ఇంకేం అక్కరలేదు. ఇన్నాళ్ళకి వస్తున్నారు- వాళ్ళకి ఇష్టమైనవి చేసిపెట్టకపోతే నేనెందుకండీ" పార్వతమ్మగారు పిల్లల్ని తలుచుకుంటూఅంది భర్తతో.

"ఏంటో పార్వతీ పిల్లలొస్తున్నారన్న ఆనందమే గానీ ... నీ గురించి అసలు నువ్వు చూసుకోవటంలేదు. మరీ ఇంత ఇదిగా నీ ఆరోగ్యం కూడా చూసుకోకుండా ఓపిక లేక పోయినా ఇవన్నీ చేసావు. ఏది ఒట్టి పిచ్చి అభిమానం" అన్నారు నారాయణమూర్తిగారు భార్య కష్టపడడం చూసి.

'నాది పిచ్చి అభిమానమే అండీ. ఇన్నాళ్ళ కొస్తున్నారు. నా తృప్తికోసం ఇవన్నీ చేసాను. మరి మీరు మాత్రం తక్కువేం? మీకు మాత్రం వాళ్ళ మీద వెర్రి ప్రేమ కాకపోతే అంతంత ఖరీదు చేసి, మన తాహతకు మించి ఇవి ఎందుకు తెచ్చారండీ. మళ్ళీ ఈ బాకీ తీర్చడానికి ఎన్ని నెలలు పడుతుందో అన్న నా మాటలకి మీరు "లేదు పార్వతీ మన పరిస్థితి చూసి ఈరోజు ఇలా ఆలోచిస్తున్నావు గాని లేకపోతే ఇన్నాళ్ళకి ఇంటికి పండగకి వస్తున్న కొడుకులకి, కోడళ్ళకీ, కూతురుకి, అల్లుడికీ, మనమలనీ, మనమరాళ్ళకి ఈ మాత్రం ఖరీదు చేసే బట్టలు పెట్టకపోతే ఏంబాగుంటుంది? బాకీఅంటావా ఎలాగోలాగ సాధ్యమైనంత తొందరగానే తీర్చుదాంలే" అనలేదూ. మీరుమాత్రం పైకి అలా అంటున్నాగానీ, పిల్లలొస్తున్న ఆనందంలో ఈ వయసులో కూడా మీరు మరీ కుర్రాడిలా ఆ పరుగులూ, ఆ కంగారూ నేను గమనిస్తూనే ఉన్నాను.'

భార్య తన మనసులో ఉన్న ఉద్దేశ్యాన్ని గ్రహించినందుకు తనలోతానే చిన్నగా నవ్వుకున్నారు నారాయణమూర్తిగారు.

వంటింట్లో కార్యక్రమం ముగించుకొని, భోజనాలు చేసి హాల్లోకొచ్చేసరికి పదకొండు గంటలయింది. సాయంత్రం లోపలే ఒక్కొక్కరూ దిగుతారు నెమ్మదిగా. రాత్రి ఇల్లు చాలా సందడిగా, పిల్లలతో కళ కళ లాడుతూ ఉంటుంది. దీపావళి రేపైనా ఈ రోజే ఇంట్లో దీపావళి పండడి వచ్చేస్తుంది రాత్రికి- అనుకున్నారు. పిల్లల రాక కోసం ఎదురుచూస్తూ... వాళ్ళ ఆలోచనలతో మంచంమీద పడుం వాల్చబోతున్న నారాయణ మూర్తిగారికి "పోస్ట్" అన్న కేక వినిపించింది. మరు నిముషంలో రాధ రెండు కవర్లు తెచ్చి నారాయణమూర్తిగారి కిచ్చింది.

ఉత్తరాలు చదివిన నారాయణమూర్తిగారు, చదువుతూండగా విన్న పార్వతమ్మగారు, రాధ



# చీకటిలో చిరుదీపం

ముగ్గురూ నిరుత్సాహంతో నీరు కారిపోయారు. అవి ఢిల్లీ నుంచి పెద్దకొడుకు, మద్రాసు నుంచి కూతురు వ్రాసిన ఉత్తరం, వాటి సారాంశం, పండగకి రావటం లేదని ... కారణాలు ఏవైనా... వాళ్ళు రావటంలేదన్నది పచ్చినిజం. పిల్లలు రావటం లేనందుకు ఓ పక్క బాధ ఉన్నా కనీసం రెండోవాడు గోపాలం వస్తున్నాడు కదా అని కొంత ధైర్యంగా ఉండగలిగారు ... సాయంత్రానికి అది కూడా నిరాశ అయిపోయింది.

సాయంత్రం గోపాలం నుంచి టెలిగ్రాం వచ్చింది

'జర్నీ పోస్ట్‌పోన్ ... నాట్ కమింగ్ లెటర్ ఫాలోస్ ...''

టెలిగ్రాం చదివి దాని సారాంశం భార్యకి చెప్పి...చిన్నగా, నీరసంగా ఓ చిన్న నవ్వు నవ్వారు నారాయణమూర్తి గారు. పిల్లలు రానందుకు బాధపడుతూన్న భార్యని చూసి,

"పిచ్చిదానా! ఎందుకు బాధపడతావు, రెక్కలొచ్చేదాకానే మన పిల్లలు, రెక్కలొచ్చాక ఎగిరిపోతారు. వాళ్ళకి మన అవసరం ఆసరా అనవసరం. ఎవరి దారి వాళ్ళది. ఎవరి బ్రతుకు వాళ్ళది వాళ్ళని కన్నందుకు పెంచి పెద్దచెయ్యాల్సిన బాధ్యత మనది మన బాధ్యత మనం నెరవేర్చాం వాళ్ళు వాళ్ళ సంసారాలు, బాధ్యతలు చూసుకుంటారు. అంతేగాని మిగిలిపోయిన మన బాధ్యతనికూడా వాళ్ళ మీదకి తోసేస్తే వాళ్ళకి మాత్రం భారం కాదా?

కన్నందుకు తల్లిగా నీకు, పెంచి పెద్ద చేసినందుకు తండ్రిగా నాకు ఈ అభిమానం, వాళ్ళమీద ప్రేమ ఉండటం సహజం. కాని ఈ రోజు ఇంకా వాళ్ళు మన పిల్లలే అనీ, మన చెప్పుచేతల్లో ఉండాలనీ మనం అనుకుంటే అది మన పొరపాటేగాని వాళ్ళ తప్పేమీ కాదు.

పార్వతీ! పెళ్ళిళ్ళు చేసేవరకే పిల్లల మీద తల్లిదండ్రుల బాధ్యత. ఆ తరువాత వాళ్ళు పెళ్ళాల మాటలకి ఎదురు చెప్పరు. కట్టుకున్న దాని ముందు కన్నవాళ్ళు, ఎప్పుడూ చిన్నచూపులోనే ఉంటారు. ఇది ప్రకృతి సహజం. దీనికి మనం వాళ్ళని నిందించవలసిన పని లేదు. నేను ముందే చెప్పాను, వాళ్ళు రారు అని. వాళ్ళని రమ్మని రాయడం

దండగేనని అన్నాను. కాని పిచ్చివాణ్ణి ... నీ మనసు తెలుసు కనుక, నీ మాట కాదనలేక, నువ్వు బాధపడతావనీ, నిన్ను నిరాశ పరచడం ఇష్టంలేక రమ్మని రాసాను. దానికి వాళ్లందరి దగ్గరమంచీ వస్తోన్నట్టుగా ఉత్తరాలు కూడా వచ్చాయి. అనవసరంగా అభిమానాన్ని పెంచుకుని. ఒక్కసారిగా వాళ్ళు రావటం లేనందుకు క్రుంగి పోతున్నాం. తప్పదు. ఈ బాధ మనం అనుభవించి తీరాలి. ఇది ఓ విధంగా మనకి గుణపాఠం కూడా.

పార్వతీ! ఓ విషయం ఎప్పుడూ గుర్తుంచుకో, అభిమానం, ఆప్యాయత అనేవి రెండు వైపుల నుంచీ ఉన్నప్పుడే వాటికి విలువ ఉంటుంది. ఆ విలువ మనకు తెలుస్తుంది. అలా కాకుండా ఏదో ఒకవైపు నుంచే ఉండి మరో వైపు నుండి చుక్కెదురైతే ప్రస్తుతం మన పరిస్థితి లాగా ఉంటుంది. మర్చిపో పార్వతీ ఈ అభిమానాన్ని, ప్రేమించే మనసునీ మర్చిపో.

ఇంకా నా గుండెల్లో గుప్పెడంత నమ్మకం, నా కండల్లో కొండంత కాకపోయినా కాసంత బలం ఉన్నాయి. ఓ ఏడాది తిరిగే లోగా రాధ పెళ్ళి చెయ్యలేకపోము. వీళ్లమీద ఆశ పెట్టుకోవడం మనదే బుద్ధి తక్కువ. ఇంతకీ నా బాధంతా ఇది కాదు కన్నతల్లిని, కన్నతండ్రిని, తోడబుట్టిన చెల్లెల్ని చూడాలని ఇన్నేళ్లలో ఒక్కసారన్నా వీందుకు అనిపించ లేదా అని. మరి మనం వీందుకు వాళ్ళ గురించి అనుక్షణం ఆలోచిస్తున్నాం? అన్నదే నాకు అర్థంకాని ప్రశ్న. బాధపడకు పార్వతీ. బాధపడకు. పరిస్థితులకి అనుగుణంగా మనం కూడా మారుతూండాలి. ఈ మార్పు తప్పదు.'! తనలో ఉన్న భావాలన్నీ నారాయణ మూర్తిగారు పైకి వెలిబుచ్చారు.

భర్త చెప్పిన మాటల్లో నిజం గ్రహించ లేక, తెలుసుకోలేక కాదుగాని తల్లిగా, ఆడదానిగా భర్తలా తనూ సర్దుకోలేక పోయారు పార్వతమ్మగారు.

రాధ అన్నయ్యలు, అక్క రానందుకు లోలోనే బాధ పడింది.

పండగ పండగలా లేదు పార్వతమ్మగారికి. నారాయణమూర్తిగారికి విన్నటివరకూ ఉన్న ఉత్సాహం, చురుకుదనం ఈరోజు రవ్వంతైనా కనిపించటంలేదు వాళ్ళ మొహాలలో. పండగొస్తోందన్న ఆనందం కన్నా, పండగకి పిల్లలొస్తున్నారు అన్న సంతోషంతో ఈ వారం రోజులూ హుషారుగా ఉన్నవాళ్ళు ఈ రోజు పండగ వచ్చినా, పండగకి రాని పిల్లల్ని తలుచుకొని నిరుత్సాహంగా ఉన్నారు.

పండగపూట భోజనాలుఅయ్యాయనిపించి, వంటింట్లోంచె గదిలోకి వచ్చారు ముగ్గురూ. పార్వతమ్మగారు చాప మీద నడుం వాల్చారు. నారాయణమూర్తి గారు పడక కుర్చీలో కూర్చున్నారు. రాధ దీపావళి ప్రత్యేక సంచిక చదువుతూంది గదిలో గోడవారగా కూర్చుని.

ఇంతలో ఎవరో పిలుస్తోంటే చదువుతూన్న వారపత్రికని చేత్తో పట్టుకుని వీధితలుపుతియ్యడానికి వెళ్ళిందిరాధ... తలుపు తెరచి, గుమ్మంముందు నిలబడ్డ అపరిచిత వ్యక్తిని, అతని చేతిలోని సూట్‌కేస్‌ని చూసి కంగారుగా... ఓ క్షణం ఆలోచించింది. రాధ ఆలోచనలకి అడ్డొస్తూ ...

"మాష్టారున్నారాండీ" అంటూ అతనే అడిగాడు.

"ఉన్నారు. రండి లోపలకొచ్చి కూర్చోండి" అంటూ పక్కకి తప్పుకుని, కుర్చీ చూపించి, లోపలకొచ్చి నారాయణ మూర్తిగారికి చెప్పింది ఎవరో వచ్చినట్టు.

గదిలోంచి బయటకొచ్చిన నారాయణ మూర్తిగారిని చూసి ఆ వ్యక్తి 'నమస్కారం మాష్టారూ' అంటూ నారాయణమూర్తిగారి కాళ్ళకి దణ్ణం పెట్టాడు.

అనుకోని ఈ సంఘటనకి నారాయణ మూర్తిగారు కాస్త కంగారుపడ్డా రెండు చేతుల్తో అతని భుజాలు పట్టుకొని పైకి లేవదీశారు. ఎవరా ఇతను? అని ఆలోచించారు.

ఇది గ్రహించిన ఆ వ్యక్తి, "నేను మాష్టారూ! మీ కృష్ణని గుర్తుపట్టలేదూ" అంటూ చెప్పాడు.

నారాయణమూర్తిగారు ఓ క్షణం ఆలోచించారు. ఈ కృష్ణ ఎవరో ఆయనకి గుర్తు రాలేదు. తన దగ్గర చదువుకున్న ఎంతో మంది కృష్ణలలో ఇతను ఎవరా? అని ఆలోచించారు.

"అదేంటి మాష్టారూ, నేను మీ మురళీ కృష్ణని. బడిలో నన్ను అందరూ "వారాలబ్బాయి" అని పిలిచేవారు. మీ ఇంట్లో భోంచేసేవాడ్ని- మీ దగ్గర చదువుకున్నాను" అంటూ అన్నీ గుర్తు చేసాడు.

నారాయణమూర్తిగారికి 'వారాలబ్బాయి' అనగానే గుర్తుకొచ్చింది – "నువ్వా మురళీ కృష్ణా! గుర్తు పట్టలేక పోయాను. ఎంతగా మారిపోయావు. ఐయామ్ వెరీ సారీ, మరోలా అనుకోకు" అంటూ మురళీకృష్ణని దగ్గరగా తీసుకుని కౌగలించుకున్నారు.

తలుపు వారగా నిలబడి ఇదంతా చూస్తున్న రాధ కూడా అతన్ని గుర్తు పట్టింది. లోపలకెళ్ళి పార్వతమ్మగారికి చెప్పింది. ఆవిడ బయటకొచ్చి మురళీకృష్ణని



## చీకటిలో చిరుదీపం

చూసి "ఏం బాబూ బాగున్నావా?" చాలా మారిపోయావే! మా రాధ వచ్చి చెపితే గుర్తుపట్టాను కాని, లేకపోతే గుర్తుపట్టలేకపోయే దాన్ని" అంటూ పలకరించింది.

"కులాసాగానే ఉన్నానండి. మీ రేకాదు మాష్టారు కూడా నన్ను గుర్తుపట్టలేకపోయారు" అన్నాడు మురళీకృష్ణ.

మురళీకృష్ణ ఇన్నాళ్ళూ తనెక్కడున్నదీ, ఏం చేసిందీ, ఒకటి రెండుసార్లు మాష్టారు లెక్కడున్నారో తెలుసుకోవాలని చేసిన ప్రయత్నాలు ఫలించకపోవటం—అన్నీ వివరంగా పూసగుచ్చినట్లు చెప్పాడు.

అన్నీ విన్నాక "ఇంతకీ ఇప్పుడేం చేస్తున్నావు? నేను ఈ ఊళ్ళో ఉన్నట్లుగా ఎలా తెలిసిందీ?" అనడిగారు నారాయణమూర్తిగారు.

"మాష్టారూ! ఆ మధ్య పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షలు వ్రాసాను, తరువాత ఇంటర్వ్యూకి కూడా వెళ్ళి వచ్చాను. నేను సెలెక్టు అయ్యాను. మొన్ననే నాకు ఆర్డర్స్ వచ్చాయి. నన్ను ఈ ఊరికి అసిస్టెంట్ కలక్టర్‌గా పోస్ట్ చేసారు. రేపు ఇక్కడ జాయిన్ అవాలి. ముందు మీరిక్కడున్నారని నాకు తెలీదు. నిన్న అనుకోకుండా కాకినాడలో మా క్లాస్‌మేట్ గురుమూర్తి ... అదే మాష్టారూ మన శేఖరం మాష్టారు అబ్బాయి కలిసాడు. మాటల్లో ఇలా సెలెక్టు అయినట్లు, నాకు ఈ ఊరికి పోస్టింగ్ వచ్చినట్లు చెప్పినప్పుడు తనే మీరిక్కడున్న విషయం చెప్పి మీ అడ్రసు కూడా ఇచ్చాడు. గురుమూర్తి చెప్పినప్పుడు నిజంగా నేను నమ్మలేదు ముందు. ఆ తరువాత నాకు వింత ఆనందం, సంతోషం కలిగిందో! ఓ పక్క పోస్టింగ్ వచ్చినందుకు, అదీ మీరున్న ఊరికి వచ్చినందుకు, అంతకన్నా మీ రిక్కడున్నారని గురుమూర్తి ద్వారా తెలిసినందుకు. అందుకే నా అన్నవాళ్ళు లెవరూలేని నాకు మీరే అన్నీ అన్న అభిప్రాయంతో ఈ పండగ పూట మీ దగ్గరకొచ్చి మీకీ శుభవార్త చెప్పాలనిపించింది. మీ ఆశీస్సులు తీసుకోవాలనిపించింది. అందుకే ఉదయమే బయలుదేరి కాకినాడ నుండి తిన్నగా వచ్చేశాను." అంటూ పూర్తి చేసాడు మురళీకృష్ణ.

"మురళీకృష్ణా! బయాక్సి వెరీ వెరీ ప్రౌడ్ ఆఫ్ యూ ... మై హార్టీ కంగ్రాచ్యు

> ## భ్రమ
>
> వల్మీకంమీద కూర్చున్న
> క్రౌంచాన్ని జూచి
> బంగారు పడకు బెదర్
> అది కూర్చున్నది
> ఆదికవి
> కాకలం కోసం కాదు
> వెదకోసం.
>
> —ఎస్. మునిసుందరం

లేషన్స్ టు యూ ... నిజంగా నేను చాలా గర్వపడుతున్నానోయ్, నా శిష్యుడు ఈ రోజు ఇంతటి ఉన్నత పదవిలో ఉన్నందుకు. అందులోనూ నేనున్నచోట మన్నీ పదవిలో ఉండటం నాకు మరింత [illegible]గా ఉంది" అన్నారు.

"మాష్టారూ! ఇదంతా మీ ప్రోద్బలం, మీ ఆశీర్వాదమే మాష్టారూ. ఈ రోజు నే వింత వాణ్ణి అయ్యానంటే...అదంతా మీ చలువే మాష్టారూ. నిజంగా ఆ రోజుల్లో ఏ ఆసరా లేని ఒంటరిగాణ్ణి నన్ను చేరదీసి, నాకో నీడనిచ్చి, నాకో దారి చూపించారు. అంతే కాకుండా మన మాష్టార్లందరి ఇళ్ళలోనూ వారాలు కూడా ఏర్పాటు చేశారు. బళ్ళో పిల్లలు నన్ను "వారాలబ్బాయి" అని హేళన చేస్తున్నారని తెలిసిన మీరు ఆ రోజు మంచి మీ యింట్లోనే మీ మనిషిగా ప్రతిరోజూ నాకు భోజనం ఏర్పాటు చేసారు. నా మీద ప్రత్యేకశ్రద్ధ చూపించి స్కూల్లోనే కాకుండా — ఇంట్లో కూడా నాకు తెలీనివి చెప్పి నన్నో మంచి మనిషిగా తీర్చిదిద్దారు...మాష్టారూ ఆ రోజు నా మీద మీరు మీ మంచితనాన్ని మానవత్వాన్ని చూపించకపోతే ఈ రోజు ఈ స్థితికి వచ్చేవాడినా ?

ఆ రోజు జిగిబిగిగా నేల మీద ఆసరా లేకుండా అల్లుకుపోతూన్న నా భవిష్యత్తనే తీగలకి మీరు పందిరి వేసి ఆసరా చూపించారు. లేకపోతే ఆ తీగలు అలాగే ఎటుపడితే అటు అల్లుకుపోయి చెల్లాచెదురై పోయేవి. కాదా ? నేను ఏంచేస్తే మీ ఋణం తీర్చ గలుగుతాను మాష్టారూ" అంటూ నారాయణ మూర్తిగారి రెండు చేతులూ పట్టుకున్నాడు మురళీకృష్ణ.

'మురళీకృష్ణా! నువ్వలా ఫీలవకూడదు. ఇందులో నేను చేసిందేముంది? నీకా తెలివి ఉంది నీ అంతట నువ్వు ఈ రోజు ఈ పొజిషన్‌కి వచ్చావు' అంటూ 'అవన్నీ తరువాత తీరిగ్గా మాటాడుకుందాం, ముందు లేచి స్నానం చేసిరా, భోజనం చేద్దువుగాని. ఈ రోజు మాకు చాలా ఆనందంగా ఉంది. పండగపూట నువ్వు వచ్చినందుకు' అంటూ నారాయణమూర్తిగారు మురళీకృష్ణని గదిలోకి తీసుకొచ్చారు.

మురళీకృష్ణ స్నానంచేసి వచ్చేసరికి ... వంటింట్లో రాధ భోజనం వడ్డించింది. మురళీకృష్ణ భోంచేస్తుంటే అతనికి అటు పక్క, ఇటుపక్క పార్వతమ్మగారు, నారాయణమూర్తిగారు కూర్చుని కబుర్లు చెబుతున్నారు దగ్గరుండి అన్నీ మరీ మరీ అడిగి,బలవంతంగా తినిపించారు మురళీకృష్ణ చేత.

నారాయణమూర్తిగారు, పార్వతమ్మగారు ఇప్పుడు పిల్లలు గురించి కాని, వాళ్ళు పండగకి రాలేదన్న సంగతి గురించి గాని ఆలోచించటంలేదు వాళ్ళకి ఇపుడు మురళీకృష్ణే కనబడుతున్నాడు. అందులో పండగపూట వచ్చినందుకు ఎంతో సంతోషపడుతున్నారు. పిల్లలు రాలేదన్న వెలితి కనిపించటంలేదు ఇద్దరికీ. పార్వతమ్మగారికి, నారాయణమూర్తిగారి మాటలు గుర్తుకొచ్చాయి. 'అభిమానం రెండువైపుల నుంచీ ఉన్నప్పుడే దానికి విలువ వుంటుంది. ఆ విలువ మనకి తెలుస్తుంది.' కాకపోతే ఏమీకాని మురళీకృష్ణ మీద తమకి ఇంత అభిమానం-అలాగే మన మీద ఎందుకతనికి అభిమానం? ఇలా ఆలోచించారు పార్వతమ్మగారు.

కబుర్లలో ఎన్నో విషయాలు పాలు పంచుకున్నారు. చిన్నప్పుడు స్కూల్లో పిల్లల్ని కొట్టడం దగ్గర నుంచి కాలేజి విషయాలు, ఉద్యోగాలు, పిల్లలు, సంసారాలూ అన్నీనూ. మురళీకృష్ణ మాష్టారి పిల్లలు గురించి, ఎక్కడున్నదీ, ఏంచేస్తున్నదీ ఎందుకు పండగకి రాలేదో, అన్నీ తెలుసుకున్నాడు అతనికి వాళ్ళమీద ఓ రకమైన అభిప్రాయం కూడా ఏర్పడింది. మాష్టారినీ, పార్వతమ్మగారిని చూస్తే జాలేసింది కూడా ఈ విషయం గురించే ఆలోచిస్తూ ఓ చిన్న కునుకు తీశాడు.

నారాయణమూర్తిగారికి, పార్వతమ్మగారికి ఒకే ఫీలింగ్. తమ కన్న పిల్లలకి తమ మీద లేని ఈ అభిమానం, ఏ తల్లో కన్న ఈ పిల్లవానికి తమ మీద ఎందుకీ అభిమానం? కొన్నాళ్ళు తిండి పెట్టి, నీడ నిచ్చినందుకు ఇంత అభిమానం అయితే ... కని, పెంచి, పెద్దచేసిన తమ పిల్లలకి తమ మీద ఎందుకు లేదీ అభిమానం. జవాబు లేని ఈ ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలిపోయాయి.

సాయంత్రం అవుతోంది, అందరూ స్నానాలు ముగించి, కొత్తబట్టలు కట్టుకున్నారు. గోపాలం కోసం తెచ్చిన బట్టలని మురళీకృష్ణకి ఇచ్చారు కట్టుకోమని పార్వతమ్మగారు. నారాయణమూర్తిగారు పిల్లలు, మనుమలు, మనుమరాళ్లు కాలుస్తారని తెచ్చిన మందుగుండు సామానంతా తెచ్చి అరుగు మీద పెట్టారు పార్వతమ్మగారు.

కుర్చీలేసుకొని వరండాలో నారాయణమూర్తిగారు, పార్వతమ్మగారు, మురళీకృష్ణ కూర్చున్నారు. వరండా చుట్టూ గోడ మీద ప్రమిదలు పెట్టి, వత్తులు వేసి నూనె పోస్తోంది రాధ.

"అమ్మాయి రాధా ఆ పనయ్యాక లోపల దేముడి ముందు దీపం వెలిగించి, ఆ తరువాత ఈ బయట ప్రమిదలు వెలిగించు" అని చెప్పారు పార్వతమ్మగారు.

రాధ లోపలికి వెళ్ళింది.

రాధ లోపలికి వెళ్లిపోయాక మురళీకృష్ణ "మాష్టారూ, మీరు మరోలా అనుకోనంటేనూ, నన్ను అపార్థం చేసుకోరంటేనూ నేను ఓ మాట అడుగుతాను మీ కిష్టమైతేనూ, మీ కభ్యంతరం లేకపోతేనూ..." అంటూ సందేహంగా ఆగాడు ... అడగాలా వద్దా అని

'అదేంటి కృష్ణా! నీకు మా దగ్గర సందేహం దేనికి, మొహమాటం దేనికీ' అన్నారు నారాయణమూర్తిగారు. "అడుగు బాబూ... ఇది నీ ఇల్లే అనుకో" అన్నారు పార్వతమ్మగారు.

"ఏంలేదు మాష్టారూ రాధకి ఎలాగూ పెళ్ళి చెయ్యాలనుకుంటున్నారు కదా? మీకు అభ్యంతరం లేకపోతే రాధని నేను పెళ్ళి చేసుకుంటాను. అయితే రాధకి కూడా నన్ను చేసుకోవడం ఇష్టం అవునో కాదో తెలుసుకోవాలి. నా సందేహం ఒకటి— మీ ఇంట్లో వారాలు చేసుకుని చదువుకున్న నాకు ఈ అర్హత ఉందా" అన్న సందేహం వెలిబుచ్చాడు మురళీకృష్ణ.

నారాయణమూర్తిగారు, పార్వతమ్మగారు ఇద్దరూ రెండుక్షణాలపాటు ఆశ్చర్యపోయారు. తాము నిజంగా వింటున్నారా, కలగంటున్నారా అని అనుకున్నారు. వెంటనే సమాధానం చెప్ప లేకపోయారు, ఆ ఆనందంలోంచి తేరుకోని వారు.



## చీకటిలో చిరుదీపం

"నన్ను క్షమించండి మాష్టారూ, మీ ఇద్దరి మీద ఉన్న గౌరవంతోనూ - రాధంటే ముందు నుంచీ ఉన్న సదభిప్రాయంతోనూ, అభిమానంతోనూ, తొందరపడి, అర్హతలేని దానికి ఆశించాను. మీ మనసు నొప్పిస్తే నన్ను మనస్ఫూర్తిగా మన్నించండి" అని అడిగాడు మురళీకృష్ణ.

"నో...నో...అదేంటోయ్ మురళీకృష్ణా... నిన్ను అపార్థం చేసుకోవడంకాదు, నీకు అర్హత లేకపోవడంకాదు, మేం కలగా నీ కంటం లేదుకదా అన్న సందేహం వల్ల నీకు సమాధానం చెప్పలేకపోయాం. నిజం చెప్పాలంటే, ఆ అర్హత నీకుందా లేదా అన్నది కాదు నా ప్రశ్న... ఆ అర్హత నాకుందా లేదా అన్నదే నా అనుమానం - నువ్వో మంచి పొజిషన్‌లో ఉన్నవాడివి, నేను మామూలు రిటైర్డ్ మాష్టారిని. ఇదే నే నాలోచిస్తున్నాను ?" అన్నారు నారాయణమూర్తిగారు.

"మాష్టారూ! మీరు పెద్దవారు అలా మాట్లాడకూడదు నేను ఏ పొజిషన్‌లో ఉన్నా మీకు మాత్రం ఎప్పుడూ మీ కృష్ణనే మాష్టారూ... మీ మురళీకృష్ణనే! కాకపోతే నాకు కావలసింది రాధ అభిప్రాయం కూడా తెలుసుకోవాలి ?'

"దానిదేముంది కృష్ణా! నిన్ను చేసుకోవడానికి దానికేంటి అభ్యంతరం... కావాలంటే దాన్నే అడుగుదాం" అని రాధని పిలవబోయిన మాష్టారికి అప్పుడే ...

ఎర్రటి పట్టుచీరలో, రెండు చేతులలో వెలుగుతూన్న ప్రమిదలని పట్టుకొని గుమ్మం బయటికి అడుగేస్తూన్న రాధ కనిపించింది.

గుమ్మం దాటుతూన్న రాధకి ఈ మాటలన్నీ వినిపించాయి. రాధకి కూడా మురళీకృష్ణని చేసుకోవడం ఇష్టమే అని - ఆమె ముఖంలో సిగ్గు దొంతరలు తొంగి చూడ్డం, ఆ ప్రమిదల వెలుగులో ఆ ముగ్గురూ గమనించారు.

శుభసూచకంగా, రాధ చేత చిచ్చుబుడ్డి కాల్పించాడు మురళీకృష్ణ.

పండగ పండగలానే కాకుండా, ఎంతో సందడిగా కొత్త కాంతులతో, కొత్త వెలుగులతో కనిపిస్తోంది నారాయణమూర్తిగారికి పార్వతమ్మగారికి.

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## ఎంత దారుణం !

"చంపదగిన యట్టి శత్రువు తన చేత
జిక్కెనేని కీడు సేయరాదు
పొసగమేలుసేసి పొమ్మనుటే చాలు"

అని వేమన్న చాటాడు. కాని, రాజకీయాలలో ఇలాంటివి పనికిరావంటారు. ఋణ శేషం, శత్రు శేషం ఉంచరాదని చాణిక్య సూత్రం. కాని, శత్రు పక్షాన్ని శౌర్య బలంతో, బుద్ధి బలంతో, కర్తవ్య దీక్షా బలంతో తమ వైపు తిప్పుకోవా లన్నది నేటి రాజనీతి శత్రు వర్గాన్ని చంపితే ప్రయోజనం లేదు. శత్రుత్వానికి కారణమైన సిద్ధాంత వ్యాప్తి దానితో ఆగదు. ఇంత తెలిసినా నేటి రాజకీయ ప్రత్యర్థులు పరస్పరం గొంతులు నరుక్కోడంలో నిమగ్నులయ్యారు. ఇది పూర్వం ఫ్యూడలిజం వ్యాప్తిలో వున్న ప్రాంతాల్లో విపరీతంగా వుంది. దీనికి నిదర్శనం మార్చి 2వ తేదీన నల్లగొండ బస్ స్టాండులో పట్టపగలు శ్రీ జి. శ్రీనివాసరెడ్డి అనే మార్క్సిస్టు పార్టీ సభ్యుని గొడ్డళ్ళతో నరికి చంపడం. ఈ విష యాన్ని రాష్ట్ర విధాన సభ్యుడు శ్రీ ఎం. ఓంకార్ తెలియజేశారు. నల్లగొండజిల్లాలో మార్క్సిస్టులను తుడిచి పెట్టడానికి శ్రీ చకిలం శ్రీనివాసరావు వర్గం ప్రయత్నిస్తున్నదని శ్రీ ఓంకార్ ఆరోపించారు.

## ఇది సంభవమా ?

రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి గడచిన రిపబ్లిక్ దినోత్సవం ప్రసంగంలో శ్రీమతి గాంధి ప్రభుత్వం పరిపాలన పద్ధతిని విమ ర్శించారు. పిదప పాలక పక్షం నాయకులు, ప్రతి పక్ష నాయకులు తనను కలుసుకొన్నప్పుడు కూడ ఆయన శ్రీమతి గాంధి ప్రభుత్వాన్ని విమర్శించి నట్లు తెలిసింది. దీనికి శ్రీమతి గాంధి ఆందోళన చెందగా విదేశాంగ శాఖా మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు జోక్యం చేసుకుని వారిద్దరి మధ్య కలిగిన అభిప్రాయభేదాలను తొలగొట్టడానికి ప్రయత్నించారని, దానికి ఫలంగా రాష్ట్రపతి అల్లుడు శ్రీ రాంభూపాల్ రెడ్డికి రాష్ట్ర మంత్రి వర్గంలో స్థానం లభించిందని వ్యాపించిన వదం తులను ఇక్కడి ప్రముఖులు కొందరు నిరసిం చారు. రాష్ట్రంలో మంత్రి పదవి వంటి చిన్న ఎరతో రాష్ట్రపతి వంటి ఉదాత్త వ్యక్తిని మభ్య పెట్టడమనేది జరుగదని, అలా అనుకోడం గాని అనడంగాని రాష్ట్రపతి దేశసేవాపరా యణతను చిత్తశుద్ధిని శంకించడమేనని ఆ ప్రముఖులన్నారు. శ్రీ రాంభూపాల్‌రెడ్డి ఇప్పుడు కొత్త సెటప్‌లో వచ్చారు గాని, శ్రీమతిగాంధి శ్రీ సంజీవరెడ్డిని ఆకట్టుకోడానికి వేసిన ఎత్తేమీ కాదని వారు అన్నారు. ఇంతకూ రాష్ట్రపతి త్వరలో పదవీ విరమణ చేస్తున్నారు కదా అలాంటప్పుడు ఇలాటి లెక్కలు వేయవలసిన అవసరం శ్రీమతి గాంధి వంటి మేధావికి, రాజ తంత్ర విదుషికి లేదని వారు నొక్కి చెప్పారు.

## జనరల్ కృష్ణారావు హెచ్చరిక !

భారత సైన్య ప్రధానాధికారి జనరల్ కె. వి. కృష్ణారావు మార్చి 3 వ తేదీన గోల్కొండ వద్ద జరిగిన ఒక సైనిక సమ్మాన విన్యాసంలో ప్రసం గిస్తూ, భారత్ సైన్యాలను సదా సన్నద్ధంగా వుంచడం అవసరమని నొక్కి చెప్పారు. భారత దేశానికి కయ్యానికి కాలు దువ్వే గుణం లేదు. దానికి పూర్తిగా పంచశీలపై విశ్వాసం వుంది. కాని ఎవరైనా బలవంతంగా యుద్ధానికిదిగితే మాత్రం యావచ్ఛక్తితో పోరాడుతుంది— అని ఆయన అన్నారు. ప్రస్తుతం భారతదేశం చుట్టూ యుద్ధ మేఘాలు కమ్ముకొనే వున్నాయి. ఇరుగు పొరుగు దేశాలలో జరుగుతున్న పరిణామాలు ప్రజలందరికి తెలుసు. ఎవరైనా మన దేశంపై దండెత్తితే, పూర్తి శక్తితో ప్రతిఘటిస్తాము. విజయం మనదే ననడం తథ్యం. మనబలం మనకు తెలుసు అయినా, అంతమాత్రాన సంతృప్తితో వుండరాదు. సైన్యం ఎప్పుడూ సర్వ సన్నద్ధంగా వుండాలి—అని ఆయన ఉద్బోధించారు. ఈ సమ్మాన విన్యాసం ఆంధ్రప్రదేశ్‌లో తొలి సారిగా జరిగింది. తొలి తెలుగు సేనాపతి అయిన జనరల్ కృష్ణారావు 29 మంది సైనిక అధికారు లకు, సైనికోద్యోగులకు విశిష్ట సేవా పతకాలు బహూకరించి, వారిని అభినందించారు. 75 నిమిషాలపాటు జరిగిన ఈ విన్యాసాలను బ్రిగేడియర్ జె. సి. పంత్ నిర్వహించారు.

## శ్రీమతి జానకమ్మకు గౌరవ భృతి :

విశ్వవిఖ్యాత గణిత శాస్త్రవేత్త, కీర్తిశేషుడు శ్రీ శ్రీనివాసరామానుజం సతీమణి శ్రీమతి జానకమ్మకు నెలకు మూడువందల రూపాయల గౌరవ భృతిని ఏర్పాటుచేసి రాష్ట్ర ప్రభుత్వం తన సంస్కృతిని, విద్యాభిమానాన్ని చాటింది. నిజానికి ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం సుప్రసిద్ధ గాయని శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మిని ఆస్థానసంగీత విద్వాంసిగానియమించడం తోనే దేశ, భాషా విభేదాలు లేక గుణాలను గౌరవించడ మనే సత్సంప్రదాయాన్ని పాటించింది. శ్రీ రామా నుజంపట్ల గౌరవసూచకంగా ఆయన సతీమణి ఈ గౌరవ భృతితో సత్కరించామని ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకటరాం అన్నారు. శ్రీమతి జానకమ్మకు 82 సంవత్సరాలు. దాదాపు రెండు తరాలుగా ఆమె



హాస్య రచయితగా ఆం. ప్ర. సాహిత్య అకాడమీ అవార్డునందుకున్న డా. రావూరుని మార్చి 7న హైదరాబాదులోని శ్రీనివాస సాహితీ సమితివారు సన్మానించారు. సమితి కార్యదర్శి శ్రీ తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి, ఆంధ్ర సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు, సన్మానితుడు డా. రావూరు వెంకట సత్యనారాయణగార్లని చిత్రంలో చూడవచ్చు.

శరత్కీర్తి వైభవంతోనే జీవిస్తున్నారు. శ్రీ రామానుజం మద్రాసుపోర్టులో గుమాస్తాగాపని చేసేవారు. పోర్టుట్రస్టువారు శ్రీ రామానుజం స్మారకోత్సవాల సందర్భంగాఆమెకు నెలకుమూడువందల రూపాయల గౌరవభృతి ఏర్పాటు చేశారు. రెండు నెలల క్రితం పశ్చిమబెంగాల్ ప్రభుత్వం ఆమెకు నెలకు రెండు వందల రూపాయల గౌరవభృతిని ఏర్పాటు చేసింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,ఇతర సంస్థలు తనకు చేసిన ఈ గౌరవానికి శ్రీమతి జానకమ్మ కృతజ్ఞత ప్రకటిస్తూ, ఈ గౌరవం తనకు కొన్నేళ్ళక్రితమే జరిగి ఉంటే ఎంతో సహాయంగా ఉండేదని, తానిప్పుడు అవసానదశలో ఉన్నానని శ్రీమతి జానకమ్మను ఇటీవల (మార్చి మూడవవారంలో)దర్శించినప్పుడు అన్నారు. ఈ గౌరవమంతా కీర్తిశేషుడైన తన పతిదేవునిదేనని అంటూండగా ఆమె కనులు చెమ్మగిల్లాయి. కేవలం పతి సంస్మరణతోనే రెండు తరాలు గడిపి, మూడవ తరంచివర ఉన్న ఆ మాతృమూర్తిని దర్శిస్తున్నప్పుడు రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ వెంకటరాం ఎంత మంచి పని చేశారు? రాష్ట్రం గర్వించదగిన పని చేశారు అని మెచ్చుకోకుండా ఉండలేకపోయాను.

### డాక్టర్ మేల్కోటే కాలధర్మం ;

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు డాక్టర్ జి. ఎస్. మేల్కోటే కన్నుమూతతో తెలంగాణాలో పాత తరం స్వాతంత్ర్యయోధులపరంపర పరిసమాప్తమైనట్లేభావించాలి. డాక్టర్ మేల్కోటే వయస్సు ఎనభై ఒక్క సంవత్సరాలు. ఆయన మార్చి 10వ తేదీన ఉస్మానియా ఆస్పత్రిలో కాలధర్మం చెందారు. కొద్ది రోజులుగా ఆయన అస్వస్థులుగా ఉన్నారు. ఆయన ఉస్మానియా వైద్యకళాశాలలో ఎల్.ఎం,ఎస్. పరీక్షలో ఉత్తీర్ణులై హైదరాబాద్‌లో వైద్యవృత్తి ప్రారంభించి గొప్ప పేరు గడించారు. ఆయన విద్యార్థి దశకూడా ఉజ్జ్వలమయిందే. ఆయనహైదరాబాద్‌లో ఖద్దరు ప్రచారానికి మూలపురుషులై ఖాదీభాండార్ స్థాపించారు. కాంగ్రెస్ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభం కాగానే, తమ ఔషధాలయాన్ని మూసివేసి, వైద్యవృత్తిని మానివేసి, నాసిక్‌కు వెళ్లి సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టయ్యారు. పిదప 1930లో ఉప్పు సత్యాగ్రహంలోను, 1931లో కర్నాటకలో

## హైదరాబాద్ నోట్ బుక్

పన్నులనిరాకరణోద్యమంలోనుపాల్గొని కారాగారవాసం చేశారు. పిదప1938లోను, 1942లోను,1947లోను కారాగారశిక్ష అనుభవించారు. 1948లో హైదరాబాద్ స్వాతంత్ర్య సమరసంఘానికి సారథ్యం వహించారు. 1947—52లో హైదరాబాద్ రాష్ట్ర కాంగ్రెస్ కార్య వర్గసభ్యులుగాను, కాంగ్రెస్ సేవాదళ్ నాయకులుగాను ఉన్నారు. 1952లో హైదరాబాద్ విధానసభకు ఎన్నికయ్యారు. బూర్గుల రామకృష్ణారావు మంత్రివర్గంలోమంత్రిగా ఉన్నారు.పిదప లోక్‌సభ సభ్యులుగా ఎన్నికయ్యారు.1949—52లో భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ హైదరాబాద్‌శాఖకు అధ్యక్షులుగాను, 1957—58లో భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగాను,1964—65లో ఆ సంస్థకు అధ్యక్షులుగాను వ్యవహరించారు. హైదరాబాద్‌జిల్లా మెడికల్ అసోసియేషన్‌కు,రాష్ట్ర మెడికల్ అసోసియేషన్‌కు అధ్యక్షులుగాఉన్నారు. పది సంవత్సరాలుగా ఆయన యోగశాస్త్రంలోను,యోగం ద్వారా రోగ నివారణలోను శ్రద్ధ వహించి పతంజలి యోగ పరిశోధన సంస్థను నెలకొల్పారు. కాశీహిందూ విశ్వవిద్యాలయం యోగపరిశోధన సంస్థలో సభ్యులుగాను ఉన్నారు, డాక్టర్ మేల్కోటేకు ప్రభుత్వం లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి. ప్రముఖ స్వాతంత్ర్యయోధులు, వైద్యులు,మంత్రులు,ఉత్తరప్రదేశ్, ఒరిస్సాల మాజీ గవర్నర్ శ్రీ మీర్ అక్బర్ ఆలీఖాన్ ముస్సగు ఆయన సహచరులు పాల్గొని ఆయన గుణగణాలు కీర్తించారు.

### ఉరుదూలో ఒకశకం సమాప్తి ః

ఇటీవల సుప్రసిద్ధ ఉరుదూ కవి పుంగవులు ఫిరాక్ గోరక్‌పూర్, జోష్‌మలిహాబాదీల అస్తమయంతో ఉరుదూ సాహిత్యంలో లక్నవీ సంప్రదాయశకానికి ఒక విధంగా సమాప్తి కలిగిందని జంట నగరాలలోని ఉరుదూ అభిమానులు అభిప్రాయ పడుతున్నారు. ఫిరాక్‌ను తలచుకొన్నప్పుడుఆయన రెండుదశాబ్దాల క్రితం ఢిల్లీలోని లాల్‌ఖిల్లాలోజరిగిన ముషాయిరాలో ఆలపించిన ఒక గజల్ జ్ఞాపకం వస్తుంది.

ఇసీ ఖండ హర మే కహీ కుచ్
దియే హై టూటేహుఏ,
ఇనహీసే కామ్ చలావో
బడీ ఉదాస్ హై రాత్

(ఈ శిధిలాలలో కొన్ని తునిగి విరిగిన దీపాలు పడి ఉన్నాయి. వాటితోనే పని గడుపుకోండి. ఎందుకంటే ఈ రాత్రి చాలా నీరవంగా ఉంది) పైకి-ఇదేదో విరహ గీతిగా కనిపిస్తున్నా, సమకాలిక దేశ పరిస్థితికొక మచ్చుతునక. జోష్, ఫిరాక్‌లకు చాల వాటిలో సాదృశ్య వైదృశ్యాలున్నాయి. జోష్ కవితలో వోలలాడేతాలూక్ దార్ల వంశంలో జన్మించారు. చిన్ననాటి నుంచి విప్లవభావాలు కలవారు. జవహర్‌లాల్ నెహ్రూకు సన్నిహితులు. కమ్యూనిస్టులు ఒకప్పుడు ఆయనను తమవాణ్నిగా చేసుకోదలచారు. కాని, జోష్ తనదారినే నడిచారు. జోష్ కవితలో పారసీక, అరబ్బీ సాహిత్య సౌందర్య వీచికలు వెలిగేవి. ఉరుదూ భాషా సముద్రాన్ని చులికించారు. ప్రాచీన దర్బారీ కవితా సంప్రదాయాలను పుణికిపుచ్చుకొన్నారు.అతనికవితలో శిల్పం ఎక్కువ. ఫిరాక్ కవితా పూర్వ రంగం వేరు. అది గెట్టే,షేక్‌స్పియర్, వర్డ్స్‌వర్త్‌ల, గ్రీక్ ప్రాచీన సాహిత్యకారులు మొదలైన పాశ్చాత్య సాహిత్యకారుల నుంచి, కాళిదాస బీహారీల వరకు ప్రాచ్య సాహిత్య ప్రపంచాన్ని పర్యటించిన సంస్కారంగలది. ఇద్దరూ చలోక్తులలో దిట్టలే. ఫిరాక్ గజల్ అభిమాని. జోష్ నజం ప్రియుడు. శంగార రంజితంగా సమకాల దుస్థితిని వర్ణించడంలో జోష్‌కూడా గొప్పవాడు. ఇలా అంటారు ఆయనః ఈ పేద గుండెకు ఈ జీవితంలో ఎన్నో అనుభవాలు కలిగాయి. కనుక సంతోష మనే మాటతోనే భయపడుతున్నది. నీవు నాతో చిరునవ్వు ఒలికిస్తూ మాట్లాడితే ఇది నిజమా అన్న భయ సందేహాలతో నా మొగం దించుకుపోతుంది.—

వహ్ గరీబ్ దిల్‌కో సబక్ మిలే కి,
ఖుషికే నామ్‌సే డర్‌గయా
కభీ తుమ్‌నే హస్‌కే జో భాత్ కీ
తో హమారా చేహరా ఉతర్‌గయా

పవిష్టి ఉర్దూ సంస్కృతికి,ముషాయిరా సంప్రదాయానికి దేశ విభజన పెద్ద అఘాతమయింది. జోష్‌మలిహాబాదీ ఫిరాక్ గోరక్‌పురీలు తమ విశిష్ట వ్యక్తిత్వంతో కూలిపోతున్న ఆ సంప్రదాయాన్ని నిలబెట్టారు. ఆఇద్దరు మహా వ్యక్తులు అస్తమించడంతో ఇప్పుడు హైదరాబాద్, ఢిల్లీ, లక్నో వంటి ఉరుదూ కేంద్రాలపై ఎక్కువబరువు, బాధ్యతలు చిన్నవారిపై పడ్డాయి.

### ఉపశ్రుతి !

ఏం సార్. మహా ఖుషీగా తిరుగుతున్నారు? — అనడిగాను న్యూ ఎం.ఎల్.ఎ. క్వార్టర్స్‌లో హడావుడిగా పారాడుతున్న ఒక ఛోటా నాయకుణ్ని. మావాడు మంత్రయ్యాడుగా!— అన్నాడు ఆ ఛోటా నాయకుడు. ఆ గదిముందు పడిగాపులు గాస్తున్న ఒక పల్లెటూరి పెద్దమనిషి మా సంభాషణ వింటూ అన్నాడుగదా — బాగారూ మన్నించాల. ఒక మోటు సామెత ఉంది. ఏమే ఎంకటీ హొరెగిరి పడుతున్నావు అంటే, మా యక్క దొరగారి దివాణంలో ఉండాదిగదా అన్నదట— అని.

# సహపంక్తి

కె. అరుణ




"బావగారికి రెండు గారెలు తీసుకురా"

"వద్దు...నాకొద్దు" బావమరిది సూర్యం మాటలకు మొగమాట పడుతూ అన్నాడు నరసింహమూర్తి...

నవ్వింది సువర్చల... "అంత భయపడి పోతారేం బావగారూ... పోన్లెండి బావగారిది పేరు...మా అందరిదీ నోరు" అన్నది.

"నా పేరెందుకు మధ్యలో మీ యిల్లు మీ యిష్టం..." అన్నాడు నరసింహమూర్తి.

"ఏమిటే బావగారిని అల్లరి పెడుతున్నారు" వంట యింట్లోనించి బయటకు వస్తూ అన్నది వసుంధర.

"మీ ఆయనకు గారెలు సహించవుట ... ఇదెక్కడి విడ్డూరం" వసుంధర అక్కయ్య మనోరమ అన్నది, సూట్కేసులో నించి చీర బయటకు తీస్తూ.

"వదినగారూ ఇది అన్యాయం" నరసింహమూర్తి అన్నాడు వెంటనే- చదువుతున్న న్యూస్‌పేపర్‌ని కిందపడేస్తూ...

"మీ అన్నయ్యగారూ వచ్చేవరకు ఈ ఇంట్లో మీకు సపోర్టు లేదు. అప్పటివరకూ ఇంతే" అన్నది మనోరమ.

ఇంతలోనే ఇంటి బయట రిక్షా వచ్చిన చప్పుడయింది ...

"అదుగో ... మా అన్నయ్యగారు వచ్చేశారు" అన్నాడు నరసింహమూర్తి.

అందరూ ఒక్కసారి ముందుకు వచ్చి బయటకు చూశారు. కాని రిక్షా ఎదురింటి ముందు ఆగింది.

"పట్టిదే మిమ్మల్ని వుడికించాలని అలా చెప్పాను" నవ్వాడు నరసింహమూర్తి.

"బావగారూ గడుసువారే" సూర్యం నవ్వుతూ అన్నాడు.

"మా అక్కయ్య ఇంకా గడుసుది" అన్నది సువర్చల.

"సువర్చలా" వంటింట్లోంచి తల్లి పిలుపు విని అక్కడి నించి వెళ్లిపోయింది సువర్చల.

ఉదయం పదిన్నర దాటుతోంది. బయట బాగా ఎండగా వుంది. సుందరరామయ్య గారిల్లు హడావిడిగా వున్నది.

క్రితం ఏడాది దీపావళి పండక్కి సుందర రామయ్యగారింటికి వచ్చింది ఒక్క అల్లుడే... మనోరమ భర్త. కాని ఈ సారి దీపావళికి రెండో అల్లుడు నరసింహమూర్తి కొత్త అల్లుడు. వాళ్ల పెళ్లయి మూడు నెలలే అయింది. ఈ యేడాది సువర్చల పెళ్లి చెయ్యాలని అనుకుంటున్నారు. అయితే వచ్చే దీపావళికి ముగ్గురు అల్లుళ్లవుతారు.

బజారుకు వెళ్లిన సుందరరామయ్యగారు గేటు తెరిచిన చప్పుడుకు అంతా బయటకు తొంగి చూశారు.

"ఏం నాన్నా రైలు వచ్చిందా" అడిగింది మనోరమ.

"ఇంకా రాలేదే, మూడు గంటలు ఆలస్యంగా నడుస్తోందట" లోపలకు వస్తూ అన్నారాయన.

"అయితే బావ వచ్చేసరికి ఇంకో రెండు గంటలు పడుతుంది" సువర్చల అన్నది.

"అయినా ఒకరోజు ముందు వస్తే ఏం పోతుందిట. సరిగ్గా పండగరోజే బయల్దేరకపోతే" సూర్యం అన్నాడు.

"ఆయనకు సెలవు దొరకలేదురా... పైగా వాళ్ల ఆఫీసరు మరీ మొండి మనిషిట ... నీకేం తెలుసు ఇదంతా" మనోరమ అందుకున్నది.

"వింతకోపం వచ్చిందే మీ ఆయన్ని

# సహపంక్తి

అనేసరికి'' అప్పుడే వంటింట్లోనించి వచ్చిన సువర్చల అన్నది.

''రేపు నువ్వు ఇంతే సువర్చలా! పెళ్ళయితే మీ ఆయన మీద ఈగనుకూడా వాలనివ్వవు'' అన్నాడు సూర్యం.

''నువ్వు మాత్రం తక్కువా నాయనా, మా మరదలును మాట పడనిస్తావా'' వసుంధర అన్నది.

ఉన్నట్టుండి అన్నది మనోరమ ''అందరం పైకి మాట్లాడుతున్నామనేగానీ మనసులో రామం అన్నయ్య మన మధ్య ఈ ఇంట్లో లేడని బాధ పడటం లేదూ.''

ఆ మాటతో అందరూ ఒక్కసారి బరువుగా నిట్టూర్చారు!

''పెద్దగా అరవకే... నాన్న విన్నాడంటే మళ్ళీ గొడవవుతుంది'' సువర్చల అన్నది.

''నాన్న ఇక్కడ లేడులే, బయట మామిడి చెట్టు కింద పడక్కుర్చీలో పడుకున్నాడు'' అన్నాడు సూర్యం తొంగిచూసి.

''నాకు అర్థంకావటంలేదు వదినగారూ! అతను అంతకాని పని ఏంచేశాడని? ఏమైనా మా మామగారికి పట్టుదల బాగా ఎక్కువ'' నరసింహమూర్తి చిన్నగా అన్నాడు.

''బాగా అన్నావు నాయనా. ఆయన మొదటేనించీ అంతే. ఆయన పట్టిన కుందేటికి మూడేకాళ్ళు. మంచయినా చెడయినా ఆయన పంతం చెల్లాలి'' గుమ్మం దగ్గర నిలబడి అన్నది నరసింహమూర్తి అత్తగారు శారదాంబ. అలా అంటున్నప్పుడు ఆమె కళ్ళలో నీళ్ళు తిరగటాన్ని నరసింహ మూర్తి గమనించాడు.

అతనికీ బాధ అనిపించింది. ఆయనకు ఇష్టంలేని పెళ్ళి చేసుకున్నందుకు కొడుకును కుటుంబానికి దూరం చేశాడు సుందర రామయ్యగారు.

నిమిషంపాటు అక్కడ నిలుచుని తర్వాత పమిటతో కళ్ళు తుడుచుకుంటూ లోపలకు వెళ్ళిపోయింది ఆమె.

''ఏమయినా ఈ రోజు మన మందరం నాన్నతో ఈ విషయమై గొడవపడాల్సిందే'' అన్నది మనోరమ.

''వేమసిద్ధం'' అన్నది వసుంధర.

''నువ్వు రా సూర్యం...'' సువర్చల అడిగింది.

''మనిద్దరం ఇంట్లో వుండే వాళ్ళంకనా మనం డైరెక్టుగా మాట్లాడవద్దు. మనం సపోర్టు ఇద్దాం''

బయకు తొంగి చూసి అన్నాడు సూర్యం.

''వాడు నా పెళ్ళికి వచ్చినప్పుడు కూడా నాన్న వాడితో మాట్లాడలేదని ఎంత బాధ పడ్డాడో నాకు తెలుసు. అందుకే భోజనం కూడా చెయ్యకుండా వెళ్ళిపోయాడు'' వసుంధర కళ్ళు తుడుచుకుంటూ అన్నది.

''ఇంతకీ మీ అన్నయ్య చేసుకున్న అమ్మాయి వాళ్ళది మన కులం కాదా'' అడిగాడు నరసింహమూర్తి.

''మన కులమే. ఆ అమ్మాయికి తండ్రి లేడు. చిన్నప్పుడే చనిపోయాడుట. ఆయనది మన కులం కాదని అంతా అనేవాళ్ళు. ఆ అమ్మాయి అదే మా వదిన సరళ చింతో అందంగా ఉంటుంది. వాళ్ళమ్మ సంగీతం నేర్పేది. ఏడాది క్రితం వాళ్ళు ఈ పక్క యింట్లో చిన్న పోర్షన్‌లోకి అద్దెకు వచ్చారు. ఆ తర్వాత నెల రోజులనుంచే అన్నయ్య, వదినలమధ్య ప్రేమాయణంమొదలయింది..'' వసుంధర చెబుతోంది.

వింటున్నాడు నరసింహమూర్తి.

ఇంతలోనే బయట ఆటో రిక్షా ఆగిన చప్పుడయింది.

సువర్చల ముందుకు వంగి చూసి ''పెద్ద బావగారు వచ్చారు'' అన్నది పెద్దగా.

పెద్దల్లుడు రామ్మూర్తి మామగార్ని పలుకరించి లోపలకు వచ్చాడు.

''ఏం బావగారూ... ఇప్పుడా రావటం'' అన్నది సువర్చల.

''నువ్వు ఎదురు చూస్తూ వుంటావని నాకు గుర్తులేదు మరదలుపిల్లా'' అన్నాడు రామ్మూర్తి.

''నేనేం కాదు. మీ భార్యామణిగారు కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తున్నారు'' అన్నది సువర్చల.

అందరి పలకరింపులు, కుశల ప్రశ్నలూ అయినాయి.

''ఏమిటే వండక్క రామం వాళ్ళు రాలేదా'' అడిగాడు రామ్మూర్తి కుర్చీలో కూర్చుంటూ.

''రాలేదు. ఇప్పుడు అన్నయ్య గురించే మే మందరం చర్చించుకుంటున్నాం'' వసుంధర చెప్పింది.

''ఏమిటా చర్చలు? ఇంకా మీ నాన్న పంతాలు, పట్టింపులు వదులుకోలేదా?''

"ఆయన సంగతి మీకు తెలియనిది ఏముంది?" అన్నది భార్య మనోరమ భర్త చేతికి కాఫీ గ్లాసు అందిస్తూ.

"ఇంకా ఈ రోజుల్లో కూడా ఏమిటి వాదిస్తాలు? కులం ఒకటే కదా. అయినా కులాలు కూడా ఇప్పుడు అంతగా ఎవరు పట్టించుకుంటున్నారు? అయిందేదో అయింది. అందరూ కలిసిపోవాలిగానీ ఇలా ఎన్నాళ్ళు?"

వెంటనే అందుకున్న వసుంధర...

"మా అందరి ఉద్దేశంకూడా అదే బావా? అన్నయ్య మా మధ్య లేకపోవటం ఎంతో వెలితిగా వుంది. మొన్నటివరకూ మా అందరి మధ్యన పెరిగిన అన్నయ్య నాన్నకు ఇష్టంలేని పెళ్ళి చేసుకున్నకారణంగా అందరికీ దూరంగా కావటం మా అందరికీ ఎంతో బాధగా వుంది. తల్చుకుంటే ఏడుపు వస్తోంది. వాడంటే ఎంత ప్రేమ! మాలో ఎవరికైనా జ్వరం వచ్చినా, ఇంకేదైనా బాధ వచ్చినా తల్లడిల్లి పోయేవాడు. నాకు టైఫాయిడ్ వచ్చి హాస్పిటల్లో వున్నప్పుడు తగ్గేవరకూ అన్నిరోజులూ వాడే హాస్పటల్లో నా దగ్గర వున్నాడు. అంతగా అందర్నీ ప్రేమించే అన్నయ్య ఈ రోజున లేకపోవటం భరించలేకుండావున్నాం."

ఆమెకు కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

నరసింహమూర్తి వింటున్నాడు.

మనోరమ అన్నది- "ప్రతి యేడాదీ ఈ దీపావళి పండుగ ఈ ఇంట్లో ఎంత సరదాగా గడిచిపోయేదో మీకు తెలుసు గదా ... పోయిన యేడాది రామం ఎంత హడావిడి చేశాడు? ఎన్ని పండగలకు అందరం కలిసి భోజనాలు చేశాము. ఎంత సరదాగా గడిపాము? ఏం వంతాలో? ఏం పట్టింపులో? ఏ పంతాలయినా కుటుంబంలోని మనుషుల మధ్య బంధాలను, ప్రేమలను తెంచేవిగా వుండకూడదు. అప్పటికీ నాన్నను అడుగుదామనుకున్నాను, వాడిక్కూడా పండక్కిరమ్మని ఉత్తరం రాయమని. కాని ఆయన వింటాడనే నమ్మకం లేక చెప్పలేదు. పాపం ఈరోజున మనందరినీ తల్చుకుని వాడెంత బాధ పడుతున్నాడో?"

అందరి హృదయాలు బరువుగా అయిపోయాయి.

బయట చెట్టుకింద పడక్కుర్చీలో పడుకున్న సుందరరామయ్యగారికి లోపల జరుగుతున్న సంభాషణ అప్పుడప్పుడు వినపడుతోంది ... అయినా ఆయన నిటో చూస్తూ అలాగే పడుకున్నాడు

"ఇవాళ మనందరం ఒక నిర్ణయానికి రావాలి బావా! రామం అన్నయ్య ఈ ఇంటి నించి దూరం కావటానికి వీల్లేదు. వాడు క్షమించరాని నేరం ఏమీ చెయ్యలేదు, తను కోరుకున్న అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. వాడు మళ్ళీ ఈ ఇంటికి రావాలి. నాన్న వాడిని ఇదివరకటిలాగే ఆదరించాలి. ఇవాళ భోజనాలముందు నాన్నకు చెప్పేద్దాం ... వాడిని ఈ ఇంటికి పిలిపిస్తేనే మనందరం భోజనాలు చేస్తామని చెబుదాం-లేకపోతే ఎవ్వరం భోజనాలు చెయ్యమని అలాగే కూర్చుందాం. ఏమంటారు?" అన్నది వసుంధర.

అందరూ అందుకు సరేనన్నారు.

వంటగదిలో వున్న శారదాంబ కూతుళ్ళ మాటలూ, అల్లుళ్ళ మాటలూ వింటోంది. వాళ్ళు తీసుకున్న నిర్ణయం ఆమెకు ఇష్టంగానే వున్నది. వాడు అంత కాని పని ఏం చేశాడని ఇంటికి రాకుండా చెయ్యటం? పాతికేళ్ళుగా ఇంతమంది కుటుంబ సభ్యుల మధ్య పెరిగిన మనిషిని ఆ కుటుంబంతో సంబంధం లేకుండా చెయ్యటం, బంధాలను తెంచెయ్యటం న్యాయమా?

ఆలోచిస్తోంది ఆమె ...

వంట తీక్షణంగా అయిపోయింది. కాలం ముందుకు పరుగుతీసింది.

"ఒరేయ్ సూర్యం. అయన్ని లేచి మడి కట్టుకోమని చెప్పు — వంటయ్యింది" లోపల్నించి చెప్పింది ఆమె.

సూర్యం కదిలాడు...

సుందరరామయ్యగారు కుర్చీలోంచి లేచాడు. ఆయన లోపలకు వచ్చి ఎవర్నీ చూడకుండా లోపలకు వెళ్ళిపోయాడు, పట్టుబట్ట కట్టుకుని.

"నాన్న మన మాటలు విన్నాడేమో" అన్నది మనోరమ.

"వింటే విననీ ... వినటమే మంచిది. అయినా మనం ఒక నిర్ణయానికి వచ్చాము కదా" అన్నది వసుంధర.

అరగంటలో పూజ అయిపోయింది.

"అమ్మాయ్ మనలా. వచ్చి అందరికీ వళ్ళాలు పెట్టు" అన్నది శారదాంబ.

అల్లుళ్ళిద్దరూ కాళ్ళుకడుక్కుని వచ్చారు. వళ్ళాల్లో అన్నీ వడ్డించింది శారదాంబ.

విస్తరి ముందు కూర్చున్నాడు సుందరరామయ్యగారు.

ఎవ్వరూ అన్నం కలుపుకోలేదు.

ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటున్నారు.

మనోరమ భర్త రామ్మూర్తివైపు చూసింది.








బులుసు వేంకటరమణయ్య

# విద్యార్థుల ధర్మం

విద్య కావాలని కోరి గురువుని ఆశ్రయించిన విద్యార్థులను పూర్వం గురువులు ఎంతో ఆదరంతో — తమ పుత్రుల వలెనే చూచుకునేవారు. విద్యార్థులు గురువులకు ధనం ఇవ్వడం, తమకు డబ్బు ఇచ్చినవారికే గురువులు విద్య బోధించడం అప్పట్లో లేదు.

ఇప్పుడు కాలం మారిపోయింది. విద్యార్థులు తమ తమ తరగతులకు నిర్ణయించిన ప్రకారం సొమ్ము చెల్లిస్తూ ఉంటేనే తరగతిలో కూర్చోనిస్తారు. తమకు జీతాలు ఇస్తేనే ఉపాధ్యాయులు విద్యను బోధిస్తారు. విద్యకు విత్తంతో ముడిపెట్టడంతో ఇటు గురుభక్తి, అటు శిష్యవాత్సల్యం కూడా అంతరించి పోయాయి, చాలాచోట్ల; కొన్నిచోట్ల కొనఊపిరితో ఉన్నాయి.

నిత్యావసర వస్తువుల ధరలు దినదినానికీ పెరిగిపోతూ అదుపులో లేనందువల్ల తమకిచ్చే జీతాలు చాలవని అధ్యాపకులు ఆందోళనలు జరపడంవల్ల వారిని తృప్తిపరచుటకు విద్యాలయాల యజమానులు విద్యార్థుల వల్ల అధికంగా విరాళాలు కూడా వసూలు చెయ్యడం జరుగుతున్నది. విద్యార్థులున్నూ తమకు సౌకర్యాలు తక్కువగా ఉన్నవనీ, పరీక్షలు తమ యిష్టానికి అనుగుణంగా జరపాలనీ ఆందోళనలు సాగిస్తూ ఉన్నారు. కార్ఖానాలలో జరుగుతూ ఉండిన సమ్మెలు విద్యాసంస్థలకు కూడా వ్యాపించాయి. వీటి మూలంగా విద్యాలయాలు నిరవధికంగా మూసివేయబడడం జరుగుతున్నది. విద్యార్థుల విద్యాభ్యాసానికి భంగం కలుగుతున్నది. వారి లక్ష్యం నెరవేరడం లేదు. వారిలో అశాంతి ఏర్పడుతున్నది. అవాంఛనీయాలైన సంఘటనలు జరుగుతూ ఉన్నవి. ఇది దేశానికి క్షేమం కాదు.

రాజకీయవాదులు తమ స్వార్థాన్ని నెరవేర్చుకొనుటకు ఆందోళనలు ప్రారంభిస్తారు. విద్యార్థులను రెచ్చగొట్టి, వారిని స్వార్థానికి ఉపయోగించుకొంటారు. అమాయకులైన విద్యార్థులు వారికి లొంగిపోయి తమ భవిష్యత్తును పాడుచేసుకుంటారు. దీన్ని గ్రహించి విద్యార్థులు న్యాయ సమ్మతమైన తమ కోరికలను విద్యాలయాధికారులకు తెలిపి, వాటిని సఫలం చేసికొనుట ఉచితమైనది. పార్టీలతోను, ఆందోళనలతోను చేతులు కలపకూడదు. విద్యను అర్జించడమే విద్యార్థికి ధర్మం. అదే అతని ప్రధాన లక్ష్యమయి ఉండాలి. అప్పుడే వారికి భవిష్యత్తు ఉంటుంది. అభ్యుదయం కలుగుతుంది. సదభిప్రాయాలతో ఉత్తమ పౌరులుగామారిన వారివల్ల దేశానికి మేలు కలుగుతుంది. విద్యార్థులకున్నూ మంచి పదవులు లభిస్తాయి. వారి ప్రతిభ వెల్లడి అవుతుంది. ఈ విషయాలను ప్రతి విద్యార్థి గమనించవలసి ఉన్నది.

---

నరసింహమూర్తి భార్య వసుంధరను చూశాడు.

''నాన్నా'' ధైర్యంచేసి అన్నది వసుంధర.

ఇంతలోనే ఇంటిముందు రిక్షా వచ్చి ఆగింది.

సంతోషంతో అరిచింది సువర్చల ''రామం అన్నయ్యావాళ్లు వచ్చారు.''

''నిజంగానా !'' అన్నది మనోరమ.

''అవును'' అన్నాడు సూర్యం.

సుందరరామయ్యగారు ఒక్కసారి ఆశ్చర్యపోయి మళ్ళీ మామూలుగా అయిపోయాడు.

అందరి మొహాలూ సంతోషంతో విప్పారినయి.

రామం, అతని భార్య లోపలకు వచ్చారు.

''ఏరా కులసాయేనా'' ఒక్కసారిగా అడిగారు మనోరమ, వసుంధర.

## సహపంక్తి

అతని రాక అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఎవ్వరూ వూహించలేదు అతను భార్యతో వస్తాడని.

''ఆ కులసాయే ... ఎంత ప్రయత్నం చేసినా రాకుండా వుండలేక పోయాను. నాన్న నన్ను తిట్టినా సరే పండగపూట మీ అందరితో కలిసి భోజనం చెయ్యాలని వచ్చేశాము'' అన్నాడు రామం.

కొడుకు మాటలకు కళ్ళు వత్తుకుంది శారదాంబ.

''రా వదినా ... కాళ్ళు కడుక్కుందువుగాని'' సువర్చల నీళ్ళు తీసుకు వచ్చింది.

అల్లుళ్ళిద్దరూ భార్యలకేసి చూశారు. అందరి మొహాలు దీపావళి మతాబుల్లా వెలిగిపోతున్నాయి.

కాళ్ళు కడుక్కుని లోపలకు వచ్చారు రామం, అతని భార్య.

మామగారు ఏమీ మాట్లాడకపోవటం అల్లుళ్ళకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

సరిగ్గా అప్పుడే అన్నాడు సుందరరామయ్యగారు భార్య శారదాంబతో—''వాడికీ, కోడలుకీ కూడా వడ్డించు''

ఒక్కసారి అందరూ ఆయనకేసి విస్తుపోయి చూశారు, కలా! నిజమా? అన్నట్టు ...

ఆ సమయంలో ఆయన కనుల ముందు ఒక దృశ్యం కదులుతోంది—

పోయిన ఏడాది దీపావళి పండక్కి కుటుంబ సభ్యులందరూ కళకళలాడే మొహాలతో సరదాగా కబుర్లు చెప్పుకుంటూ సంతోషంతో సహపంక్తిన తృప్తిగా భోజనాలు చెయ్యటం.

# వంటలు

## వేసవి పానీయాలు

### చాకొలెట్ సిరప్

కావలసిన వస్తువులు : కోకో-1 గ్లాసు, చక్కెర – 2 గ్లాసులు, చల్లని నీరు – 2 గ్లాసులు, వెనీలా ఎసెన్సు – 1 స్పూను ఉప్పు – కొంచెము.

తయారుచేయు విధము: కోకో, చక్కెర ఉప్పు బాగా కలిపి కొంచెము చల్లని నీరుతో కలపాలి. సన్నని సెగమీద వుంచి గట్టిపడే వరకు కలుపుతూ వుండాలి. చల్లబడిన తరువాత వెనీలా ఎసెన్సు కలిపి సీసాలో దాచుకోవాలి.

### పైన్ ఏపిల్ లైమ్ ఫ్రాస్ట్

కావలసిన వస్తువులు : కోడిగుడ్లు 4, చక్కెర - 4 స్పూను, నిమ్మరసం - 1 స్పూను, అనాసరసం – 4 గ్లాసులు.

తయారు చేయు విధము : కోడిగుడ్లు పగలకొట్టి, పచ్చసొన వేరుచేసి, తెల్లసొన బాగా చిలక్కొట్టాలి. చక్కెర మెత్తగా పొడిచేసి నిమ్మ, అనాస రసం, చక్కెర, కోడిగుడ్డ సొన బాగా కలిపి సీసాలలో భద్రపరచుకోవాలి.

### కమలా జామ్

కావలసిన వస్తువులు : కమలా రసము – 2 గ్లాసులు, చక్కెర – 2 గ్లాసులు, నీళ్ళు – 2 గ్లాసులు, సిట్రిక్ యాసిడ్ – అర టీ స్పూను, సోడియం మెటాబై సల్ఫేట్ – అర టీ స్పూను.

తయారుచేయు విధము : కమలా రసము, చక్కెర, నీళ్ళు సరిసమానముగా కలపాలి. మొదట కమలా పండ్లను వలిచి ఫ్రూట్ క్రషర్‌తోనైనా, చేతితోనైనా రసం పిండుకొని ఒక శుభ్రమైన గుడ్డలో వడపోయాలి. సరిగ్గా రెండు గ్లాసుల రసం వుండాలి. ఒక గ్లాసు నీళ్లలో చక్కెరను సిట్రిక్ యాసిడ్‌ను వేసి పొయ్యి మీద వుంచి బాగా మరిగిన తరువాత దించి చల్లారనివ్వాలి. ఇంకొకగ్లాసు వేడి నీటిలో సోడియం మెటాబై సల్ఫేట్, వడగట్టిన కమలా రసంను బాగా కలిపి చల్లారిన తరువాత మూతి చిన్నగా యుండే సీసాలోపోసి మూత గట్టిగా పెట్టాలి. మనకు అవసరమైనప్పుడు ఒక గ్లాసుడు నీళ్ళకు 2 టీ స్పూనులు వేసుకొంటే సరిపోతుంది.

–టి. స్వప్న



## బ్రెడ్ ఆమ్లెట్

కావలసిన సామానులు: బ్రెడ్ - 1, చక్కెర – 50 గ్రా., పాలు –1/16 లీ, కోడిగుడ్లు - 2, ఏలకలు – అర తులం.

విధానం : కోడి గుడ్డు కొట్టి, పాలు, చక్కెర, ఏలకపొడి వేసి బాగా కలపాలి. బ్రెడ్ నాలుగు వేపుల వుండే కాఫీ కలర్ భాగాన్ని మినహాయించి మిగిలిన భాగం మాత్రం వుంచుకోవాలి. స్టౌ మీద పెనం వుంచి, కాస్త నూనె లేదా నెయ్యివేసి, ఒక్కొక్క బ్రెడ్ ముక్కని పై ద్రవంలో ముంచి ఎర్రగా వేయించాలి. దీన్ని కొంతమంది 'కోడిగుడ్డు బోండా' అని కూడా అంటారు.

– ఎ జ్యోత్స్న

## బకాళా బాత్

కావలసిన వస్తువులు : సేమ్యా 450 గ్రాములు, నెయ్యి నాలుగు టేబుల్‌స్పూన్లు, నీరు మూడు కప్పులు, పాలు ఒక కప్పు, పెరుగు ఒక కప్పు, కొద్దిగా అల్లం, పచ్చి మిరపకాయలు పది, అరటీస్పూన్ ఆవాలు, చిటికెడు ఇంగువ, తగినంత ఉప్పు, కొత్తిమీర, కరివేపాకు, జీడిపప్పు.

తయారుచేయు విధము :- ముందుగా బాణలిలో కొద్దిగా నెయ్యి తీసుకుని పొయి పై పెట్టి, కాగాక సేమ్యా వేసి బాగా ఎర్రగా వేయించి, నీటిని పోసి తగినంత ఉప్పువేసి ఉడకనివ్వాలి. ఉడికిన సేమ్యాను దించేసి చల్లారనివ్వి పాలు, పెరుగు పోసి మళ్లీ తగినంత ఉప్పువేసి బాగా కలపాలి. కలిపేటప్పుడు తేలికగా కలపాలి. తర్వాత అల్లం, పచ్చిమిరపకాయలు, కొత్తిమీర సన్నగా తరగాలి. బాణలిలో కొద్దిగా నెయ్యి వేసి మరిగాక ఆవాలు వేసి చిటపటలాడించి అల్లం ముక్కలు, పచ్చిమిర్చి ముక్కలు, కరివేపాకు, ఇంగువ, కొత్తిమీర ముక్కలు, జీడిపప్పు వేసి బాగా వేయించి దానిని సేమ్యా మిశ్రమంలోకి పోసి బాగా కలియపెట్టాలి - ఇది మరీ గట్టిగా కాక కాస్త జారుగా వుండాలి. ఇది చాలా రుచిగా వుంటుంది.

– గార్గ సరస్వతి






## బెంగుళూరులో పోతన పంచశత జయంత్యుత్సవం

పోతన పంచశతజయంత్యుత్సవ సందర్భంగా బెంగుళూరులోని "తెలుగు కళాభారతి" ఏర్పాటుచేసిన సభలో భక్త కవి పోతనకు శ్రీ పి. వెంచుసుబ్బయ్య నివాళులర్పించారు.

సభకు అధ్యక్షతవహించిన శ్రీ లంకా కృష్ణమూర్తి "పోతన భాగవతము తెలుగు దేశంలోనే కాక కన్నడ దేశంలో కూడా ఎక్కువ ప్రచారానికి నోచుకొన్నది" అని అన్నారు.

సంస్థ అధ్యక్షులు శ్రీ ఘట్టమరాజా ప్రసంగిస్తూ ఆంధ్ర భాగవతం ప్రసిద్ధి చెందినంతగా మరే ఆధునిక భారతీయ భాషల్లోను భాగవతం ప్రసిద్ధి చెందలేదని, భాషాదురభిమానాలు; ప్రాంతీయ తత్వాలు పెచ్చుపెరుగుతున్న ఈ కాలంలో పోతనవంటి కవులే భావసమైక్యతా సేతువులుగా విలసిల్లగలరని చెప్పారు.

శ్రీ లంకా సూర్యప్రకాశరావు స్వాగత వాక్యాలు పలుకగా,కుమారి కె. ఎస్.నాగమణి,లక్ష్మి ప్రార్థనా గీతం పాడగా, కార్యదర్శి రాయాపురం రమేష్ వందన సమర్పణ చేశారు.

## "రవీంద్ర గీత" ఆవిష్కరణ

మార్చి 5వ తేదీన నూజివీడు పి.జి. సెంటరు ఆవరణలో కళావాచస్పతి, సినీ నటులు శ్రీ కొంగర జగ్గయ్య రచించిన "రవీంద్రగీత" ఆవిష్కరణసభ జరిగింది. శ్రీ అజంతాఈ కావ్యాన్ని ఆవిష్కరించారు. ఎమ్మెయల్ అతిథులకు స్వాగతంచెప్పారు. డి. ఎస్. పి. శ్రీ జి. వి. కృష్ణారావు సభకు అధ్యక్షత వహించారు. కుమారి కరుణ ప్రార్థనగీతం పాడింది. శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, శ్రీ టి. ఎల్. కాంతారావు, శ్రీ కాగడా శర్మ ఉపన్యసించారు.

అనంతరం పి.జి. సెంటరు స్పెషల్ ఆఫీసరు ఆచార్య భమిడిపాటి కృష్ణమూర్తి జగ్గయ్యగారిని, నూతనవస్త్రాలతో సత్కరించారు. వివిధ సంస్థల ప్రముఖ వ్యక్తులు జగ్గయ్యగారికి పూలదండలు సమర్పించారు. ఎమ్మెయల్ వందనసమర్పణ చేశారు.

## "అభిరుచి" ఆధ్వర్యంలో అష్టావధానం

అభిరుచి తెలుగు సాంస్కృతిక వేదిక ఆధ్వర్యములో మార్చి 7వ తేదీన బెంగుళూరులో శ్రీ పి. వెంచుసుబ్బయ్య అష్టావధానం నిర్వహించారు. శ్రీ వి. రామనరసింహారెడ్డి సంస్థ నివేదికను సమర్పించారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ ఎం. ఎస్ ప్రకాశరావు మాట్లాడుతూ అష్టావధానం తెలుగు భాషకు విఖ్యాతి తెచ్చిపెట్టిన సాహిత్య ప్రక్రియ. బుద్ధికి పదును, హృదయానికి సంస్కారం కలిగించే ఈ సాహిత్య ప్రక్రియకు బెంగుళూరులో గొప్ప గుర్తింపు ఉంది, అన్నారు.

సంస్థ సంచాలకులు శ్రీ ఘట్టమరాజా నగరంలోని తెలుగువారిలో ఉత్తమ సాహిత్యం పట్ల అభిరుచి కలిగించి, వారికి తెలుగు సాహిత్యాన్ని పరిచయం చేయుటమే అభిరుచి ఆశయం, అని చెప్పారు.

శ్రీయుతులు లంకా కృష్ణమూర్తి, తిరుపతిరావు, వి. రామనరసింహారెడ్డి, లంకా సూర్యప్రకాశరావు, ఎస్. ఎస్. ఎస్. శాస్త్రి, జి. వెంకటరెడ్డి, రాయాపురం రమేష్, శ్రీమతి పాలగుమ్మి అన్నపూర్ణ పృచ్ఛకులుగా వ్యవహరించారు.

కుమారి కె. ఎస్. నాగమణి, లక్ష్మి, ప్రార్థన గావించారు. శ్రీ ఘట్టమరాజా వందన సమర్పణ చేశారు. (ఒ. వి.)

## అహర్నిశం సేవామహే

నాటిక. రచన శ్రీ మునిగొండ చంద్రశేఖర్ 46 పేజిలు వెల తెలియదు. ప్రతులకు రచయిత పేర, ఇంటి. నెం. 12.10.407/40 నవాలగిండు,సీతాఫల్ మండి సికింద్రాబాదు 500361

## శ్రీరామచంద్ర ప్రభుశతకము

రచన : శ్రీ తిరుపతి రామచంద్రకవి 22 పేజిలు గల ఈ పుస్తకము తిరుమల తిరుపతి దేవస్థానం వారి ద్రవ్య సహాయముతో ప్రచురింపబడినది. వెల : రూపాయన్నర ప్రతులకు రచయిత పేర ఎక్. ఐ. డి. నెం. 5 హవుసింగ్ బోర్డు కాలనీ. కపిలతీర్థం రోడ్డు. తిరుపతికి రాయాలి.

## సెక్స్ అండ్ సైన్స్

శ్రీ ఎస్. రాజేశ్వరరావు సంపాదకత్వంలో వెలువడిన లైంగిక విజ్ఞాన మాస పత్రిక ప్రారంభ సంచిక(మార్చి 1982). 56 పేజీలు, వెల రెండు రూపాయలు. వివరాలకు చిత్రదర్శిని ప్రింటర్స్, లాలాపేట, గుంటూరు—522 003 అన్న చిరునామాకు రాయాలి.

## పీపుల్ అండ్ ప్రోగ్రెస్

నాస్తిక దృక్పథంలో కీ. శే. గోరా వివిధ విషయాల గురించి ఆంగ్లంలో రాసిన వ్యాసాలని ఎన్నికచేసి ఈపుస్తకంలో పునర్ముద్రించి ఆయన 79వ జయంతి సందర్భంగా విడుదల చేశారు. 94 పేజీలు గల ఈ పుస్తకం వెల 8 రూపాయలు. ప్రతులకు : నాస్తిక కేంద్రం, పటమట, విజయవాడ—520006

## గుండె చప్పుళ్ళు

మినీ కవితల సంపుటి, రచన శ్రీ అసురాజేంద్ర 92 పేజీలు, వెల ఏడు రూపాయలు. ప్రతులకు : శ్రీ శ్రీ పబ్లికేషన్, స్టూడియో బలరామ్, అమలాపురం—533 201.

## శ్రీరామచంద్ర సుప్రభాతము

రచన : శ్రీ వేలి శివరామశర్మ 6 పేజీలు వెల : తెలియదు. ప్రతులకు : రచయిత పేర శ్రీరామచంద్రాలయం, బాలాజీనగర్ నెల్లూరుకి రాయాలి.

## గ్రామస్వరాజ్యం

రచన : శ్రీ కందర్ప, 32 పేజిలు, వెల : రు. 1—25ప్రతులకు : నవభారతి ప్రచురణలు, 3—4—852బర్కత్‌పురా, హైదరాబాద్—500027.

## రామగిరి చరిత్ర

కరీంనగరుజిల్లాలోని రామగిరి పౌరాణిక—చారిత్రక ప్రాశస్త్యాన్ని గురించి వివరంగా తెలిపే ఈ పుస్తకాన్ని కీ.శే.శ్రీ యురబాటిబాబురావురచించారు. రామగిరి దేవాలయ నిర్మాణ ధర్మకర్తల సంఘం వారు ప్రచురించారు. 52 పేజీలుగల ఈ పుస్తకం వెల పన్నెండు రూపాయలు. ప్రతులకు శ్రీ ఆర్. బాలప్రసాదు, ఇం. నెం. 2—4—104, శివాలయం వీధి, పెద్దపల్లి (కరీంనగరుజిల్లా).

## రేవటి మజిలీ

కవితా సంపుటి. రచన : శ్రీ పరిగి రాధాకృష్ణ. 82 పేజీలు, వెల 5 రూపాయలు. ప్రతులకు: శ్రీ పి. ఎస్. శర్మ, పరిగి, హిందూపురంతాలూకా, అనంతపురం జిల్లా.

## విరుపెక్కిన గుండె

రచన : శ్రీ రామచంద్రరావు పాలమరసెట్టి, 36 పేజీలు. వెల రెండు రూపాయలు. ప్రతులకు శ్రీ షేక్ కమ్రుద్దీన్,పాండురంగపేట, ఘంటావారివీధి, తెనాలి—522 201.

## పరిణామ శాస్త్రం ప్రథమ పాటాలు

వ్యాస సంపుటి. రచన 'ఆర్కె'. 76 పేజీలు. వెల 3 రూపాయలు. ప్రతులకు మేనేజర్, ప్రజాసాహితి, వెంకటరత్నం,వీధి,సూర్యారావుపేట,విజయవాడ—2.


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

## ఇప్పుడు...
## అందానికి ఒక కేలమైన్

# పాండ్స్
# కేలమైన్ లోషన్

## పూసిన అందం,
## సంరక్షించే గుణం,
## తాజా మురిపెం,
## మీ చర్మానికిది లాభమయం.

చర్మానికి ఆరోగ్యంతోబాటే అది ఒక అందాల గని కావాలని కోరుకోరామరి ? ఈ రెంటి కోసమూ యిదుగో కొత్త పాండ్స కేలమైన్ లోషన్ :

మచ్చలేని, నిర్మలమైన శోభ, చల్లదనం యిక మీ వంటిపైన_గాలిలోని, సంతోషం విరిసే, మారని ఆ తాజాదనం. మేకప్ వేసుకునే ముందైనా, లేదా దానంతట అదిగానే వాడటానికి వీలు. సుగంధం విరజిమ్మే, అందాన్నిచ్చే పాండ్స కేలమైన్ లోషన్.




పాండ్స్

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA